# కథా కిరణాలు

## మన తెలుగు కథకులు

పైడిమర్రి రామకృష్ణ

**పైడిమర్రి కమ్యూనికేషన్స్**
10-3-211, మామిళ్ళగూడెం, ఖమ్మం - 507 001.
ఫోన్ : (08742) 233462

కథాకిరణాలు - మన తెలుగు కథకులు

COLLECTION OF STORY WRITERS LIFE SKETCHES

by

**PYDIMARRI RAMAKRISHNA**

Cover Design : **SNIGDHA**

1st Edition : Dec. 2002

Copies : 1000

Price : Rs. 50/-

Laser Type Setting : Best, Hyderabad - 44.

Printed at : **KARSHAK ART PRINTERS**
40-APHB, Vidyanagar,
Hyderabad - 500 044.
Ph : 27618261, 27653348

*For Copies :*

**P. HEMALATHA**
10-3-211, Mamillagudem,
Khammam - 507 001.
Ph : 08742-233462

**P. SHAILAJA**
3-5-1027, Narayanguda,
Hyderabad - 500 029.
Ph : 040-23224543

**VISHALANDHRA BOOK HOUSE**, Bank Street, Hyderabad.
**DISA PUSTAKA KENDRA**, Chikkadpally, Hyderabad.
**NAVODAYA BOOK HOUSE**, Kachiguda, Hyderabad.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు వారి ఆర్థిక సహాయంతో ప్రచురితం

# విషయసూచిక



## కథా కిరణాలు :

57 నాశబోయిన నరసింహ
58 పరుచూరి రాజారాం
59 పంతుల జోగారావు
60 పాయసం సుబ్రహ్మణ్య మహర్షి
61 పి.ఎస్. నారాయణ
62 పి.వి. రమణకుమార్
63 పులికంటి కృష్ణారెడ్డి
64 పెద్దింటి అశోక్ కుమార్
65 పెండెం జగదీశ్వర్
66 పోతుకూచి సాంబశివరావు
67 పోలవరపు వెంకటేశ్వరరావు
68 పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి
69 పోలాప్రగడ రాజ్యలక్ష్మి
70 పోరంకి దక్షిణామూర్తి
71 పొత్తూరి రాజేంద్రప్రసాద వర్మ
72 బలివాడ కాంతారావు
73 బల్లెం వేణుమాధవ్
74 భాగవతుల సుబ్రహ్మణ్యం
75 బి.ఎస్.ఎన్. మూర్తి
76 బి.ఎస్. రాములు
77 బులుసు - జీ - ప్రకాష్
78 భూపాల్
79 బోయజంగయ్య
80 బొల్లిముంత వెంకటరమణారావు
81 మల్లాది చంద్రశేఖర శాస్త్రి
82 మందడి కృష్ణారెడ్డి
83 మన్నె సత్యనారాయణ
84 మంతెన సూర్యనారాయణ రాజు
85 మండవ సుబ్బారావు
86 మల్లిరెడ్డి చంద్రశేఖర రెడ్డి
87 మళ్ల లక్ష్మిధర్మారాజు
88 మాచిరాజు కామేశ్వరరావు
89 మిరియాల రామకృష్ణ

90 మునిపల్లె రాజు
91 ముదిగొండ శివప్రసాద్
92 ముద్దశెట్టి హనుమంతరావు
93 ముదిగంటి సుజాతా రెడ్డి
94 ముక్తేవి భారతి
95 మేడిచర్ల సూర్యప్రకాశరావు
96 యలమర్తి అనూరాధ
97 యల్లకర ప్రభావతి
98 రసరాజు
99 రావూరి భరద్వాజ
100 రావి - ఎన్ - అవధాని
101 రావిపల్లి నారాయణరావు
102 రావిపాటి ఇందిరామోహన్ దాస్
103 వాసాల నర్సయ్య
104 వాణీ ప్రభాకరి
105 వాడ్రేవు రమాదేవి
106 వెంకటేశ్వరరావు ( గూటూరి)
107 వేదగిరి రాంబాబు
108 వియోగి
109 వీరాజీ
110 శంకర వెంకట నారాయణరావు
111 శాంతి నారాయణ
112 శ్రీవిరంచి
113 శ్రీరాగి
114 శ్రీ సుభా
115 శ్రీకంఠస్ఫూర్తి
116 శ్రీగిరిరాజు విజయలక్ష్మి
117 షేక్ కరీముల్లా
118 సడ్లపల్లి చిదంబర రెడ్డి
119 సత్యవాడ సోదరీమణులు
120 సాహితి
121 సుధామ
122 సూర్యప్రసాదరావు

**నా రెండు కళ్ళు...**

అమ్మ... హేమలత

నాన్న... నరసింహ మూర్తి గార్లకు

ప్రేమతో

మీ బుజ్జి ☺



ఆశీర్వాచనాలందించిన...

గురుతుల్యులు - జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా. సి. నారాయణరెడ్డి...

గురుమిత్రులు - శ్రీ సుమనస్పతి రెడ్డి, శ్రీ సుధామ, శ్రీమతి ఎ. ఉషారాణి, శ్రీ చావలి దేవదాసు, శ్రీ కె.జె. ఆనంద్‌బాబు, శ్రీమతి యల్లంరాజు సరోజా నిర్మల, ఎర్రమిల్లి బుచ్చిరాజు , శ్రీ మడిపల్లి దక్షిణామూర్తి గార్లకు....

ఆత్మీయ మిత్రులు - శ్రీ బండారు మురళీ మోహన్‌రావు, శ్రీ బొల్లిమంత వెంకటరమణారావు, శ్రీ డి.కె. చదువుల బాబు, శ్రీ పి. మురళీ కృష్ణ, శ్రీ నేరెళ్ళ శ్రీనాథ్ గార్లకు

నా సహోదరులు - శ్రీ పవన్‌కుమార్, శ్రీ ప్రమోద్ శర్మ (సినీ సంగీత దర్శకులు)

నానీడవెంటే వున్న - డా. రావూరి భరద్వాజ, డా. దేవరాజు మహారాజు, డా. వేదగిరి రాంబాబు, శ్రీ చొక్కాపు వెంకటరమణ, శ్రీమతి శ్రీగిరిరాజు విజయలక్ష్మి, శ్రీమతి దామర్ల విజయలక్ష్మి (విజేత), శ్రీ బి.ఆర్. వరదరాజులు, వాధూలస గార్లకు...

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు వారికి...

కథకులందరికీ ...



శ్రీబండారు మురళీ మోహన్ రావు తో రచయిత

Jnanpith Awardee
**Dr. C. Narayana Reddy,** M.P.
M.A., Ph.D., D.litt
CHAIRMAN
**Andhra Pradesh State Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalabhavan, Hyderabad - 500 004.
Phone : (O) 3214603 (R) 3548451
Fax : (O) 3214603



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి,** ఎం.పి.
ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్
అధ్యక్షులు
**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు – 500 004.
ఫోన్: (ఆ) 3214603 (ఇ) 3548451
ఫాక్స్: (ఆ) 3214603

## అభిప్రాయం

తెలుగులో కవితతోపాటు సహచరంగా సాగిపోయే సాహితీ ప్రక్రియ కథ. ఈ సంపుటిలో పైడిమర్రి రామకృష్ణ మొన్నటి, నిన్నటి, నేటి తరానికి చెందిన కథకుల జీవిత రేఖా చిత్రాలను పొందుపరిచారు. ఒక్కొక్క కథకుని జీవిత నేపథ్యాన్ని, కథల ప్రాముఖ్యాన్ని ఈ సంపుటిలో పొదుపుగా పొదిగిచూపారు.

ఒకే అద్దంలో ఇన్ని ముఖాలను దర్శించే సదవకాశం కలిగించిన రామకృష్ణకు నా అభినందన.

మన తెలుగు కథకులు ప్రసరించిన 'కథాకిరణాల' వెలుగులు పాఠక లోకాన్ని ఉద్దీప్తం చేస్తాయని ఆశిస్తున్నాను.

(డా. సి. నారాయణరెడ్డి)




# ఏం కత ?

సుమనస్పతి రెడ్డి
(ప్రోగ్రాం ఎగ్జిక్యూటీవ్)
ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం
హైదరాబాదు - 500 004.

కథనం లేనిది కాలం సాగదు. గమనించిన కాలం కథే. The Universe is made of stories, not atoms అని ఓ పాశ్చాత్య మహాశయుడు అన్నాడంటే ఈ ప్రాణి మనిషిదృష్టినుండి నిజమే మరి. అదుపులేని కాలాన్ని, ఆధీనంలో లేని అస్తిత్వాన్ని, మనకూ ఇతరులకూ, మనకూ ప్రపంచానికీ మధ్య ఉన్న పూరించలేని అంతరాన్ని అవగాహన రూపాన్ని ఇచ్చి చూసుకునేది కథల తోనే! సవాలక్ష మూర్త, అమూర్త కళారూపాలకు ఆధారంగా ఏదో ఒక కథనముంటుంది జాగ్రత్తగా చూస్తే. ఒకటీకాదు అనేకమైన కథనాలు నిజానికి. చూడటమూ కథకాదా, కథనం కాదా?

అందుకే కదా కథకుడికి ఎంతో ప్రాధాన్యం ప్రాచీనకాలం నుండీ. ఎవరూ చెప్పకోకపోతే విలవిల్లాడిపోతుంది కథ, బ్రతకాలికదా అదీ! నా కథ, నీ కథ, కుటుంబం, వంశం, వాడ, ఊరు..... ప్రపంచం కథ. కథలేని వ్యథ ఎవరుకోరుకుంటారు, సృష్టించుకుంటారు (!)? అయినా వీలుకాదు. వ్యథనుండి తప్పించేది కథ. పుణ్యకథలెన్ని మనకు? నైమిశారణ్యంలో మహామునులెపుడూ వచ్చిన కొత్తవాడినుండి "అఘునిబర్హణమూ", "ఎఱుక సమగ్రమూ" చేసే కథను వినగోరుతుంటారు! ముచ్చటైన కథ. కథముచ్చట.

అలా మనందరికీ జరుగుబాటునిచ్చే కథకుడికి ఏమి విలువనిస్తున్నాం మన తెలుగుదేశంలో!? దిగదుడుపు కాదే రచయిత, దర్శక నిర్మాతలకు నటుడి కంటె, విటుడికంటె, రంకెలేయు రాజకీయపు ఆంబోతుల కంటెన్... మరింకేలాగున చెప్పగలము మన కళారూపాల జవసత్తువల గురించీ, వెండితెర చిత్రములూ, ఇడియట్టు పెట్టెలోని ధారావాహిక చిత్రమ్ముల గురించిన్నీ!

సమాజానంతటినీ కావలించుకొని కథ చెప్తాను మీకు అని బెట్టుచేసే వెర్రి కథకుడు కుంగిపోడూమరి ? అదొక పెద్దకథ.

ఆంధ్రదేశంలో బతికున్న చిన్నా పెద్దా కథకుల గురించిన లఘు రేఖాచిత్రాలివి. వీటన్నింటిని శ్రమించి, సేకరించి, ప్రచురించిన పైడిమర్రి రామకృష్ణకు ధన్యవాదాలు చెప్పాలి. ఇప్పుడైనా, మరో ఇరవై ఏళ్ళకైనా ఈ చిన్న పుస్తకాన్ని మనం సంప్రదించవచ్చు-చిన్నచిన్న వివరాలకోసం, తేదీలకోసం, కథరాసిన కథకుడి కథకోసం. ముందుకాలంలో, రామకృష్ణ వెనుకటి కాలానికి వెళ్ళి ఆధునిక తెలుగు కథకుల్లో ముఖ్యులందరి గురించి తెలిపే సమగ్ర గ్రంథాన్ని కూడా వెలయిస్తాడని ఆశ. స్వయంగా కథకుడు , కవి , నాటకకర్తా, విమర్శకుడూ అయిన రామకృష్ణ చేసే ఈ కృషికి తోడ్పడే వారు తప్పక ఉంటారు, ఇప్పటి లాగానే!

తేది : 22-10-02
హైదరాబాద్

- సుమనస్పతి




# కథాకిరణాల వెనుక కథ...

ప్రతిజీవితం ఒక కథ... ప్రతి కథ ఒక జీవితం... చిత్రకారులు చిత్రాలను చిత్రించిన విధంగానే రచయితలు ఎన్నో జీవిత చిత్రాలను తన కథల ద్వారా అందించడం జరుగుతుంది. ఆ కథలలో నవరసాలు మనకు కనిపిస్తాయి.

అయితే - రచయిత జీవితం ఒక కథేకదా! ఆ కథా రచయితల లఘు చిత్రాలను విజేత దినపత్రిక (ఆదివారం అనుబంధం) ద్వారా "కథాకిరణాలు" శీర్షికను అందించడం జరిగింది. ఈ శీర్షిక ఎంతోమంది ప్రశంసలు అందుకుంది.

ఈ రచయితల పరిచయాలు, వారు వ్రాయటానికి గల నేపథ్యం తదితర విషయాలు తెలుసుకోవడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి, రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ సంయుక్తంగా నిర్వహించిన "నవరచయితల అధ్యయన శిబిరం - కథానిక" బీజం వేసింది. వారి ప్రేరణతో, వారి ఆలోచనలో అభిప్రాయాలు నలుగురికి పరిచయం చేయాలన్న సంకల్పంతో "కథా కిరణాలు" శీర్షిక ద్వారా కథకుల్ని పరిచయం చేశాను. ఈ శీర్షిక నిర్వహణ విషయంలో పాత, కొత్త కథా రచయితలు నాకు ఎంతగానో సహకరించారు.

కుల, మత, ప్రాంత, వయో, లింగ బేధము లేకుండా కథకులందరిని ఒకే వేదిక మీద సన్మానించటానికి 'కథాకిరణాలు- మన తెలుగు కథకులు' అన్న ఈ చిన్న పుస్తకాన్ని వేదికగా నిర్మించుకున్నాను. నిజానికి ఈ పుస్తకంలో ప్రచురించబడిన కథకులు చాలామందికి ప్రచారము అవసరము లేదు. కానీ మన సాహిత్యాన్ని మనం భద్రపరచుకోవలసిన అవసరం వుంది.

కథకులు వేలసంఖ్యలో వున్నారు. కానీ ఈ చిన్న పుస్తకంలో ప్రస్తుతం 122 మంది కథకులను పరిచయం చేస్తున్నాను. ఇక నుండి ప్రతి సంవత్సరము కొందరు కథకుల వివరాలతో పుస్తకాలు ప్రచురిస్తూ నా యజ్ఞాన్ని కొనసాగిస్తానని హామి యిస్తున్నాను.

విజేత (ఆదివారం అనుబంధం)లో ప్రచురించగా నన్ను అభినందించి, పుస్తకరూపంలో తెస్తున్నానగానే సంతోషించిన కథకులు పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, చలసాని ప్రసాదరావు, డా. పరుచూరి రాజారాం, ఆర్.ఎస్. సుదర్శనం గార్లు ఈ పుస్తకం కార్యరూపం దాల్చకముందే స్వర్గస్తులైనారు. వారికి ఈ సందర్భంగా సంతాపం వ్యక్తపరుస్తూ దివినుండే నాకు ఆశీస్సులు అందజేస్తారని ఆశిస్తున్నాను.

ఎందరో కథకులు... అందరికీ కథాభివందనాలు....

8-12-2002
హైదరాబాదు

- పైడిమర్రి రామకృష్ణ

# అవసరాల రామకృష్ణారావు





ది.21-12-1931న 'మద్రాసు' లో జన్మించిన అవసరాల రామకృష్ణారావు గారు మనకున్న ప్రముఖ కథకుల్లో ఒకరు. ఇప్పటి వరకు 350కి పైగా కథలూ, 9 నవలలు, రెండు బాలల నవలలు ఇంకా ఒక VALLATHOL ఆంగ్లం నుండి తెలుగు లోకి అనువాదం రచించారు.

అవసరాల వారి తొలికథ చిన్న పిల్లల కథ 'పొట్టి పిచ్చుక కథ' టైటిల్‌తో ప్రచురితమైన ఈ కథలో అల్ప ప్రాణియైన ఒక పిచ్చుక ధనవంతుడైన ఒక రాజు గారి అన్యాయాన్ని, దోపిడినీ ఎదిరించి ఎలాగెలిచిందో వివరిస్తుంది. ఎంతో కష్టమైన బాలసాహిత్యం సులువుగా రాయగలగడం రామకృష్ణారావు గారికే చెల్లింది. పిల్లల కోసం ఎన్నో కథలు, రెండు నవలలు 'గణిత విశారథ', 'కేటు డూప్లికేటు' అందిచారు.

వృత్తిరీత్యా ఒరిస్సా రాష్ట్రంలో కొన్ని దశాబ్దాలపాటు ఆంగ్ల ఉపన్యాసకులుగా వున్న అవసరాల వారి కథల్లో కూడా, ఒక నేర్పరి అయిన కథకుడితో పాటు బోధకుడూ స్పష్టంగా కనిపిస్తాడు. నిజానికి వీరు ఆ రోజుల్లోనే ఉన్నతమైన విద్యను అభ్యసించారు. బి.ఎస్.సి., బి.ఇ.డి., యం.ఎ., పిహెచ్.డి. చదివిన వీరు నేడు వస్తున్న సాహిత్యాన్ని కూడా ఒక యజ్ఞంలా చదివి, పరిశీలిస్తుంటారు.

ఒక కమిట్‌మెంట్‌తో కథలు రాసే కథకులు చాలా తక్కువ మంది వుంటారు. కాని అవసరాల వారు మొదటి నుంచీ కమిట్‌మెంట్ వున్న రచయిత. తనచుట్టూ జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను, దురాచారాలను, అసందర్భాలనూ తనరచనల ద్వారా ఎదిరించి సక్రమమైన మార్గం లోకి తీసుకురావాలన్న లక్ష్యం కలిగినవాడు.

రామకృష్ణారావు గారి కథాసంపుటాలను పరిశీలిస్తే 'రామకృష్ణ కథలు', 'అర్థమున్నకథలు', 'మనంమనుషులం', 'మోహన రాగం', 'నాకునువ్వు నీకు నేను', 'అవసరాల రామకృష్ణారావు కథలు', 'పేకముక్కలు' ఇంకొన్ని సంపుటాలు పాఠకుల మన్ననలు అందుకున్నాయి.

రామకృష్ణారావు గారి కథాకథన శిల్పం విలక్షణమైనది. ఆయన కథలు మన ఎదుట నిలబడి మాట్లాడుతున్నట్లుంటాయి. వీరి సాహిత్య కృషికి గుర్తింపుగా ఎన్నో సాహితీ సంస్థలు అవార్డులు యిచ్చి, సన్మానాలు చేసి గౌరవించాయి. 1969లో వీరి కథానికలకు గాను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. 1994 లో తెలుగు యూనివర్సిటీ 'బెస్ట్ రైటర్ ఇన్ హ్యూమర్' అవార్డు యిచ్చి గౌరవించింది. 1996లో కథానికలకు గాను జ్యేష్ఠ లిటరరీ అవార్డు, 1999లో 'చక్రపాణి- చలసాని' అవార్డు, 2000లో ఢిల్లీ తెలుగు అకాడమీ పురస్కారం, 2000లోనే ఆంధ్ర సాంస్కృతిక సంఘం చంఢీఘర్ ఫెలిసిటేషన్ యిచ్చి గౌరవిరచారు.

"నీచాభిరుచులకు మురిసిపోక, మంచి రచనలనే చదవండి. సాహిత్య సృష్టిచేస్తున్న వాళ్ళ రచనలనే కాక, వారి జీవిత విధానాలను కూడా పరిశీలించండి. రచయితలందరు నీతి బాహ్యులు కారు. కథలు చదివి రచయితల మంచి, చెడులను నిర్భయంగా తెలియజేయండి" అని పాఠకులకు నిష్కర్షగా సలహా యిస్తారు అవసరాల రామకృష్ణారావు. వీరు చిన్నపిల్లల కోసం మరిన్ని కథలు అందించాల్సిన అవసరం వుంది.

రచయిత చిరునామా
**అవసరాల రామకృష్ణారావు**
49-37-8/1, ఎన్.జి.ఓ.స్ కాలనీ,
అక్కయ్యపాలెం, విశాఖపట్నం-530 016

# అంపశయ్య నవీన్

"నేను.. అని కథను ప్రారంభిస్తూ, ఉత్తమ పురుషలో చెప్పేకథలు బాగా రాయవచ్చు. నేను అని చెప్పే వాడు ప్రధాన పాత్ర కావచ్చు లేదా పరిశీలకుడు కావచ్చు. ఈ పద్ధతిన రచయిత పాఠకులను త్వరగా తనవెంట తీసుకుపోవచ్చు" అంటారు వరంగల్‌కు చెందిన ప్రముఖ కథకులు నవీన్.

1941 డిసెంబరు 24న వరంగల్ జిల్లా పాలకుర్తి తాలూకా 'వావిలాల' గ్రామంలో జన్మించిన నవీన్‌ను 'అంపశయ్య నవీన్' గా ప్రపంచమంతా పిలిచింది. ఒక రచయితకు నవల పేరు 'ఇంటి పేరుగా' క్రమేణా పిలువబడింది, ఆ గౌరవం పొందింది కేవలం నవీన్‌గారే అంటే అతిశయోక్తి కాదు.

'చైతన్య స్రవంతి' పద్ధతిన మొదటి సారిగా తెలుగులో నవల రాసి 'బేష్' అనిపించుకున్నారు. 'చైతన్య స్రవంతి' అంటే పాఠకులకే ఆలోచన వదలివేయడం. అంతరంగాన్ని అంతర్మథనాన్ని చెప్పటమే చైతన్య స్రవంతి విధానం. ఈటెక్నిక్‌ను శ్రీశ్రీ వాడినప్పటికీ పూర్తి స్థాయిలో మొదటి సారిగానవీన్ 'అంపశయ్య' నవలలో వాడారు.

నవీన్‌మొదటి కథ 1906లో 'జయశ్రీ' మాస పత్రికలో 'అదోలోకం' పేరుతో ప్రచురించబడింది. ఆకథతో మొదలు పెట్టి ఇప్పటివరకు సుమారుగా 50కి పైగా కథలు 'ఆంధ్ర జ్యోతి, ఆంధ్ర ప్రభ, స్వాతి, ఇండియాటుడే' మొదలగు పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

ఇప్పటి వరకూ 'లైఫ్ ఇన్ ఎ కాలేజ్', 'ఎనిమిదో అడుగు', కథాసంపుటాలు ప్రచురించి కథాభిమానులకు అందించారు. త్వరలోనే మూడో కథా సంపుటి తేనున్నారు. నవీన్ రాసిన అనేక కథలు ఇంగ్లీషు, హిందీ, కన్నడ, తమిళ భాషల్లోకి అనువదించారు.

వృత్తిరీత్యా కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసిన నవీన్ గారు, ప్రవృత్తిరీత్యా కథలూ, నవలలూ అందించారు. 'ఎనిమిదో అడుగు' కథాసంపుటి చదివితే కథకుడిగా అంపశయ్య నవీన్ గొప్పతనం తెలుస్తుంది. ఈసంపుటిలో కథలన్నీ 'చైతన్య స్రవంతి' టెక్నిక్ ఉపయోగించి రాసారు నవీన్. ఈసంపుటిలోని పరిధులు, ఎనిమిదో అడుగు, తిరుగుబాటు, రక్తచైతన్యం, దోపిడి, శిక్ష, ఊబ, చెర కథలు స్త్రీ సమస్యలు, పోరాటం, తన శీలాన్ని ఎలా కాపాడుకుంది... వీటి చుట్టూ నడుస్తాయి.

1971 సం.లో నవీన్ కథ 'హత్య' కు ఆంధ్రజ్యోతి వారపత్రిక వారు, 1984 'బలి' కథకు స్వాతి మాసపత్రికవారు, 1985లో 'దాడి' కథకు పల్లకి వార పత్రిక వారు, 1986 లో 'తెర' కథకు ఆంధ్రప్రభ వార పత్రికవారు, 1987లో 'చెర' కథకు ఆంధ్రజ్యోతి పత్రిక వారు 'ఉత్తమ కథ అవార్డు' ఇచ్చి నవీన్‌గార్ని గౌరవించారు.

1979లో వీరి నవల 'దాగుడు మూతలు'కు స్వాతి మాసపత్రిక ఉత్తమ నవలా అవార్డు అందజేసింది. 1995 సం.లో వీరి నవల 'అంతః స్రవంతి'కి పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటీ 'సాహిత్య అకాడమి', 1999సం.లో 'జ్యేష్ఠ లిటరరీ అవార్డు', 2000 సం.లో రా.వి. శాస్త్రి అవార్డు పొందారు. 'చేజారిన స్వర్గం, మనోరమ, హత్య, నిప్పురవ్వలు, అధోలోకం, కసి, బిచ్చగాడు, దోపిడి, పరిహారం, తీరిన కోరిక', కథలు ఇంగ్లీషులోకి అనువదింపబడ్డాయి. వీరిని మంచి కథకుడిగా ప్రపంచమంతా గుర్తించింది.

రచయిత చిరునామా
**అంపశయ్య నవీన్**
ప్లాట్ నెం.84, ఇంటి నెం.2-7-71,
ఎక్సైజుకాలనీ, హన్మకొండ,
వరంగల్ జిల్లా 506 001.



# అబ్బూరి ఛాయాదేవి

ప్రముఖ కథారచయిత్రి అబ్బూరి ఛాయాదేవి 1933లో 'రాజమండ్రి'లో జన్మించారు. 1951-53సంవత్సరంలో హైద్రాబాద్‌లోని నిజాం కాలేజీలో ఎం.ఏ.చదువుతుండగానే ఛాయాదేవిగారు రచనావ్యాసంగం సీరియస్‌గా ప్రారంభించారు.

1953లో నిజాంకాలేజ మేగజైన్‌లో ప్రచురించిన అనుభూతి అనే కథ అబ్బూరి ఛాయాదేవి మొదటి కథ. పెళ్ళయిన తరువాత వీరు రాసిన మొదటి కథ 1955లో తెలుగు స్వాతంత్ర్యంలో వచ్చింది. కథపేరు 'వివర్శకులు'. వివాహ వ్యవస్థగురించి ఆడపిల్లలకుండే భయాలు, అనుమానాలూ, ఆదర్శాల గురించి, పెళ్ళికోసం ఆదర్శాలు వదులుకొని జీవితంలో సర్దుకుపోవడం గురించి రాశారు.

అప్పటి నుంచి ఛాయాదేవి గారు చాలావరకు మధ్యతరగతి, కుటుంబాలలోని స్త్రీలు ఎదుర్కొనే సమస్యల గురించి, పురుషాధిక్యతకి లోబడిన స్త్రీల గురించి కథలు రాసారు. తీవ్రంగానూ, నిష్ఠుర పూర్వకంగానూ కాకుండా, ఆర్ధ్రత కలిగించేటట్లో, హాస్యస్ఫోరకంగానో, వ్యంగ్యపూరితంగానో రాసారు.

ఛాయాదేవి గారి కథల్లో బోన్‌సాయ్ బ్రతుకు, ప్రయాణం సుఖాంతం, అఖరికి ఐదు నక్షత్రాలు, ఉడ్‌రోజ్‌కథలు చాలా ప్రసిద్ధి పొందాయి.

బోన్‌సాయ్ బ్రతుకు, అఖరికి ఐదు నక్షత్రాలు అనే కథలు కేంద్ర సాహిత్య అకాడమీ కథా సంకలనాల్లో చోటుచేసుకున్నాయి. 'మాది-మీది' కథలో మనవాళ్ళకి కమ్యూనల్‌సెన్స్ బాగానే వున్నా కమ్యూనిటీ సెన్స్ బొత్తిగా లేదు. సివిల్‌సెన్స్ అసలే లేదు. ఫ్లాట్‌లలో వుండే వాళ్ళు సాధారణంగా విద్యావంతులు, ఉద్యోగస్తులు గానీ ప్రతీ దానికి 'మాది-మీది' అన్నా బేధభావం చూపిస్తూ నీచంగా ఎలా ప్రవరిస్తారో చూపించిన మంచి కథ.

'సుఖాంతం' అనే కథ సరియైన నిద్రకోసం జీవితమంతా తపించిన ఒక స్త్రీ కథ. ఈ కథ నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు ప్రచురించిన కథాభారతి అనే సంకలనంలో 1972లో చోటు చేసుకుంది.

అబ్బూరి ఛాయాదేవి గారి కథలు కొన్ని హిందీ, తమిళ, మరాఠి, కన్నడ భాషల్లోకి అనువదించడం విశేషం. ఆడపిల్లల పెంపకంలోనూ, మగపిల్లల పెంపకంలోనూ వివక్ష చూపిస్తూ ఆడవాళ్ళ బ్రతుకుల్ని బోన్‌సాయ్ చెట్లుల్లా ఎదగనివ్వటం లేదని చెప్పే కథ బోన్‌సాయ్ బ్రతుకు. ఈ కథని 2000 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 10వతరగతి తెలుగు వాచకం (రెండోభాష) లో చేర్చింది.

అబ్బూరి ఛాయాదేవి గారు వృత్తిరీత్యా న్యూఢిల్లీలోని జవహర్ లాల్ నెహ్రూ యూనివర్సిటీలో డిప్యూటీ లైబ్రేరియన్‌గా పని చేసి 1982లో స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు.

1993లో వాసిరెడ్డి రంగనాయకమ్మ సాహిత్య పురస్కారం, 1996లో మృత్యుంజయ పుస్తకానికి తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ రచయిత్రి అవార్డు అందుకున్నారు. 2000 సంవత్సరంలో కళాసాగర్-పందిరి సాహితీ పురస్కారాలు అందుకున్నారు.

రచయిత్రి చిరునామా
అబ్బూరి ఛాయాదేవి
హెచ్.ఐ.జి బి-4, ఎఫ్-4,
బాగ్‌లింగంపల్లి,
హైదరాబాద్ - 500014





# అంబల్ల జనార్ధన్

"'బొంబాయి కథలు' ద్వారా మీకు పరిచయమైన నేను, ఇప్పుడు బొంబాయి నానీలు లోకి ఎదిగాను. ఎదిగానని ఎందుకంటున్నానంటే కథ కంటే కవిత లోతైనది కనుక, రాయడం కష్టం కనుక" అంటారు. ప్రముఖ కథకులు అంబల్ల జనార్ధన్.

నిజామాబాద్ జిల్లా 'ధర్మోరా' లో.... నవంబరు 9 న జన్మించిన అంబల్ల జనార్ధన్ పెరిగింది చదివింది అంతా బొంబాయి మహానగరంలోనే. కవితా ప్రక్రియ కష్టమైనదే కాని కథా రచన అంతకన్నా కష్టతరమైనదనీ అంబల్ల గారికి తెలుసు. వీరి 26 కథల సంపుటి 'బొంబాయి' కథలు 1998లో వెలుగుచూసింది. ఈ కథాసంపుటి నిజంగా ఓ వెలుగు వెలిగింది. అంబల్ల జనార్ధన్ గారిని సాహితీశిఖరాలకు చేర్చింది. ఈ సంపుటి విడుదలైన తొలిరోజుల్లో కథా ప్రియులంతా ఈ సంపుటి గురించే చర్చించుకున్నారు. నిజానికి ఈ కథాసంపుటి కథా ప్రియులకొక బహుమతి. ముంబాయి నగర చిత్రణ, అక్కడ ప్రజల కష్టాలు, కన్నీళ్ళు, సుఖాలు, సంతోషాలు ఇలా... వీరిని స్పందింపజేసిన అంశాలను 'కథావస్తువులు'గా తీసుకొని కథలల్లారు. స్పందించే హృదయమున్న కథకునికి యిక కథల కొరతేముంది. బొంబాయి నగరానికి అంజలి ఘటింపుగా 'బొంబాయి కథలు' ముద్రించారు.

యువ ఉగాది కథల పోటీలో రెండవ బహుమతి పొందిన అంబల్ల జనార్ధన్ కథ 'చమురు దీపం' పరిశీలిస్తే.. స్వయం ఉపాధి పథకాల గురించి ఆలోచించమని, యువకథ మిత్రులను ప్రేరేపిస్తుంది. చిత్త శుద్ధితో, సేవా భావంతో పనిచేసే 'చమురు దీపం', రజాక్ బాబా, చిన్న పనులని ఆలోచించక సర్వరుగా, సైకిల్ రిపేరర్‌గా, సైకిల్‌పై తిరిగి గాజులు, ఐస్‌ఫ్రూట్ అమ్మేవాడిగా, ఎలక్ట్రికల్ అసిస్టెంట్ గా అంచలంచలు ఎదిగి ఎలక్ట్రీషియన్‌గా సౌదీ అరేబియాకెళ్ళిన పజాజ్ లాంటి వారి నుండి నిరుద్యోగులైన యువత స్ఫూర్తిని పొందాలని కథానాయకుడు ప్రతిపాదిస్తాడు. తెలంగాణా మాండలికంలో సాగిన కథ ఇది. నిజానికి తెలంగాణా మాండలికంపై వీరికి మంచి పట్టు వుంది.

బొంబాయిలో పెరిగి పెద్దవాడైన జనార్ధన్ 43 ఏళ్ళ వయసువచ్చినా మాతృభాష తెలుగును బాగా చదువుకొని కథలు, కవిత్వాలు రాసి మెప్పించటం విశేషం. బొంబాయి నగర జీవన సంక్లిష్టతలను వివరిస్తూ రచించిన బొంబాయి కథలు తెలుగు కథా పూతోటలో విరబూసిన పుష్పాల్లా సుగంధాన్ని వెదజల్లుతూనే వున్నాయి. వీరిని గురించి ప్రముఖ కథకులు మునిపల్లె రాజుగారు "తను పుట్టిన పల్లెనో మహానగరాన్నో త్రికరణ శుద్ధిగా ప్రేమించినవాడే వాటి మీద కథలు రాయగలడు, కవితలల్లగలడు. మార్క్‌ట్వైన్ మిసిసిపీ నదీతీర ప్రాంతాన్ని, ఓ హెన్రీ న్యూయార్క్ నగరాన్ని, మొపాసా పారిస్ పట్టణాన్ని, ఎడ్గార్ వాలెస్ లండన్ వీధుల్ని కథల్లో కెక్కించి మాతృరుణం తీర్చేసుకున్నారు. మూడేళ్ళ క్రితం బొంబాయి కథలు సంపుటిని ప్రచురించిన శ్రీ అంబల్ల జనార్ధన్ గూడా ఆ దోవలో పయనిస్తున్న సత్యగుణ సంపన్నుడే" అంటారు. వీరి మాటలు అక్షర సత్యాలు.


రచయిత చిరునామా
**అంబల్ల జనార్ధన్**
బి - 204, ధీరజ్ కిరణ్, చించోలీ,
బందర్ రోడ్, మాలాడ్ (వెస్ట్),
బొంబాయి - 400064

# అల్లీ రామకృష్ణ



చిత్తూరు జిల్లా 'కలికిరి'కి చెందిన కథకులు 'అల్లీ రామకృష్ణ' ఒకవైపు సాంఘీక కథల్ని, మరోవైపు బాలలకు పిల్లల కథల్ని పౌరాణిక కథల్ని అవలీలగా రాసే సామర్థ్యం వుంది. ప్రపంచాన్ని పరిశీలించటం, అందులోని మనుషులను గూర్చి ఆలోచించటం, ప్రేమించటం దేవుడిచ్చిన వరాలు.

సాంఘిక కథలు అందరూ రాయగలిగినవే. కానీ పౌరాణిక కథలు అందునా పండితులు, సామాన్యులు ఆ కథలు చదివి ఆశ్చర్యపోవటం, ఎన్నో తెలియని విషయాలు తెలుసుకొని అబ్బుర పడటం... ఇలా రాయ గలగటం ఒక్క అల్లీ రామకృష్ణగారికే చెల్లింది.

'బుజ్జాయి' బాలల పత్రికలో వరుసగా ప్రచురితమైన వీరి వినాయకుడి కథలు పుస్తకరూపం దాల్చటం, ఆ వెంటనే కాణిపాకం దేవస్థాన పాలక మండలి ఆధ్వర్యంలో చిత్తూరు జిల్లా రచయితల సంఘంవారిచే కాణిపాకం ఆలయం లోనే ఆవిష్కరణ గావింపబడటం విశేషం. ఈ వినాయకుడి కథల్లో చాలా కథలు మనం ఎక్కడా విననివి వుంటాయి. ఆ కథలు చదివి ఓ కొత్త అనుభూతి పొందుతారు పాఠకులు. దీని వెనుక రచయిత పరిశీలన, పరిశోధన, శ్రమ, దీక్ష, పట్టుదల, కృషి మనకు యిట్టే తెల్సిపోతాయి.

అడపాదడపా బాలల పత్రికల్లో అనేక సాంఘిక పిల్లల కథలు రాస్తున్నా, పురాణ గాథల్ని రాయటంలోనే ఎక్కువ తృప్తి పొందుతారు రామకృష్ణ. కథా రచయితగానే కాక నాటక రచయితగా కూడా అల్లీ రామకృష్ణ గారు అద్భుతమైన నాటికలందించారు. ఆ నాటికలు కూడా కాలక్షేపానికో, తనకు పేరు రావటానికో రాసినవి కావు. ఇంతవరకూ ఏ రచయిత జరపని అద్భుత పరిశోధన చేసి రాసినట్లుగా వుంటాయి. ఓ వినూత్న కోణంలో ఆయన రాసిన 'కుమ్మరి భీమన్న' అను 'కురువరతి నంబి కథ' నాటకాన్ని పరిశీలిస్తే ప్రతి ఒక్కరూ ఈ విషయాన్ని అంగీకరించక తప్పదు. శ్రీవెంకటేశ్వర స్వామివారిని భక్తిరసధారలతో అభిషిక్తుని చేసిన ప్రథమ సంకీర్తనాచార్యుడైన తాళ్ళపాక అన్నమాచార్యుడు భవిష్యోత్తర పురాణంలో పేర్కొబడిన 'కుమ్మరి భీమన్న'ను గురించి కీర్తనలో 'కుమ్మర దాసుడైన కురవరతి నంబి - ఇమ్మన్నా వరములెల్ల నిచ్చినవాడు-కొండలలో నెలకొన్న కోనేటి రాయడు' అని ప్రస్తావించినాడు. కానీ నిజానికి ఈ కుమ్మరిదాసుడెవరో చాలా మందికి తెలియదు. ఆ కథా వస్తువుతీసుకొని గొప్ప నాటకాన్ని రాసారు. ఓ వినూత్న కథా రచయిత ఇతడు అంటే అతిశయోక్తి కాదు.

సాహిత్య ప్రక్రియలన్నింటిలోకి బాల సాహిత్యం రాయటం, పిల్లలకు కథను అరటిపండు వలిచి తినిపించినట్లు చెప్పటం ఎంతో కష్టం. కానీ అల్లీ రామకృష్ణ గారు తెలుగులో నేడు వస్తున్న అన్ని బాలసాహిత్య పత్రికల్లోనూ తన కలం నుంచి బాలల కొరకు ప్రత్యేకంగా కథలు అందిస్తూ, చిత్తూరు జిల్లా నుంచి కథకులుగా ఎదుగుతూ వస్తున్నారు. కథా ప్రక్రియలోనే కాకుండా, కవిత, నవలా, విమర్శ, పద్యం వంటి అన్ని సాహిత్య ప్రక్రియల్లో ప్రవేశమున్న అల్లీ రామకృష్ణ గారికి ఆకాశవాణి తిరుపతి కేంద్రం ప్రత్యేకంగా కేంద్రానికి ఆహ్వానించి వీరి రచనలను ప్రసారం చేస్తున్నది.


రచయిత చిరునామా

**అల్లీ రామకృష్ణ**

క్రాస్‌రోడ్స్, కలికిరి,

చిత్తూరు జిల్లా - 517 234.



# అమ్మిన శ్రీనివాస రాజు

"ఒక మంచి రచయితగా స్థానం సంపాదించాలంటే నిత్యం మంచి శ్రోతగా పాఠకుడిగా వుండాలి. ప్రతికొత్త విషయాన్ని గమనిస్తూ వుండాలి" అంటారు ఖమ్మం జిల్లా వాజేడు మండలం 'లక్ష్మీపురం' కి చెందిన కథకులు అమ్మిన శ్రీనివాస రాజు.

వృత్తిరీత్యా ఖమ్మం జిల్లా చర్లప్రభుత్వకాలేజీలో తెలుగు ఉపన్యాసకులుగా వుంటూ, ప్రవృత్తిరీత్యా యిప్పటివరకు సుమారు 80 కథలు రచించారు. భద్రాచలం డివిజన్ శాఖ 'సాహితీ స్రవంతి' సాహిత్య సంస్థ ద్వారా సాహితీ కార్యక్రమాలు ప్రతినెలా నిర్వహిస్తుంటారు.

శ్రీనివాస రాజు కథలు ఉదయం ఆదివారం, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి ఆంధ్రభూమి, వార్త, చతుర, చెకుముకి వంటి సాంఘీక పత్రికల్లోనే కాంకుండా బుజ్జాయి, బాలజ్యోతి వంటి పిల్లల పుస్తకాల్లో కూడా ఎక్కువగా రాసారు. బాల సాహిత్యం సాహిత్య ప్రక్రియల్లోకి కష్టతరమైనప్పటికీ శ్రీనివాస రాజు మాత్రం పిల్లలకు కథలు చెప్పట మన్నా, రాయటమన్నా ఎంతో ఆసక్తి కనపరు స్తుంటారు.

ఆకాశవాణి కొత్తగూడెంలో సుమారు 30 ప్రసంగాలు, కథానికలు, గల్పికలు ప్రసారం కాబడ్డాయి. ఆధునిక ప్రపంచానికి పరిచయం చేసే ఉద్దేశ్యంతో గిరిజనులకు చెందిన ప్రసంగాలు, కథలు వారు రాసి తన ప్రత్యేకతను చాటుకున్నారు. కథల్లో గిరిజనుల, బడుగువర్గాల జీవన స్థితిగతులు ప్రధానవస్తువులుగా ఉంటాయి. అలాగే మూఢనమ్మకాల నిర్మూలన దిశలో సైన్సు పరిజ్ఞానాన్ని సామాన్య జనావళికి చేర్చే సదుద్దేశంతో వ్యాసాలు, కథలు, రేడియో ప్రసంగాలు రాసారు.

అమ్మిన శ్రీనివాస రాజు మరి కొంత మంది యువరచయితలు కలిసి త్వరలో ఖమ్మం జిల్లా నుంచి ఓ కథా సంకలనాన్ని తియ్యాలన్న ఆలోచనతో వున్నారు. వృత్తిరీత్యా లెక్చరర్‌గా ఎంతో బిజీగా వున్నా, కథా రచనకొరకు ప్రతి రోజు కొంత సమయాన్ని కేటాయిస్తూ రాష్ట్ర నలుమూలల వున్న కథకులందరికీ ఉత్తరాలు రాస్తూ అంచలంచలుగా ఖమ్మం జిల్లా నుంచి కథ కొరకు శ్రమిస్తూ, పలువురి ప్రముఖ కథకుల మన్ననలు అందుకుంటున్నారు. త్వరలో సాహితీ స్రవంతి ఖమ్మం జిల్లా శాఖనుండి ఓ కథా సంకలనాన్ని తీసే ప్రయత్నంలో వున్న వారికి యువకథకులు 'దోరవేటి' మంచి మిత్రులు.

"కథలో చదివించేపట్టు, చివరికంటూ చదివించే నైపుణ్యం, చమక్కున మెరిచే ముగింపు తప్పని సరిగా వుండాలి" అనే అమ్మిన శ్రీనివాసరాజుకు ఆకాశవాణి ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ సుమనస్పతి రెడ్డి, యల్లం రాజు సరోజా నిర్మల గార్లు ఎంతో ప్రోత్సహించారంటారు. ఆకాశవాణి కార్యక్రమాలకోసం వీరు ప్రత్యేకంగా స్క్రిప్ట్లు రాసారు. త్వరలో ఖమ్మం జిల్లా కథారచయితల సంకలనం తమ సాహితీ సంస్థ ద్వారా తీయాలన్న ఆలోచనతో ఉన్న వారికి కథకులకు లేఖలు రాస్తూ అభిప్రాయాలు పంచుకోవటం మరో హాబి.


రచయిత చిరునామా

**అమ్మిన శ్రీనివాస రాజు**

పేరూరు - 507136.

వాజేడు మండలం

ఖమ్మం జిల్లా.



# ఆర్. యస్. సుదర్శనం



వృత్తిరీత్యా ఉపాధ్యాయుడిగా, ప్రొఫెసర్‌గా, ప్రిన్సిపల్‌గా పనిచేసిన సుదర్శనం గారికి **1982** సం॥లో 'బెస్ట్ కాలేజ్ టీచర్' అవార్డు వచ్చింది. ఢిల్లీకి చెందిన ఓ ప్రముఖ సంస్థ ఆర్.యస్. సుదర్శనం గారిని 'బెస్ట్ సిటిజన్ ఆఫ్ ఇండియా' అవార్డుకు ఎంపిక చేసింది.

"రచనలో రచయిత అంతస్సత్వం, కనీసం నిజాయితీ వ్యక్తం కావాలి. కానప్పుడది సాహిత్యస్థాయిని అందుకోలేదు" అనే ఆర్. యస్. సుదర్శనం గారు కథకుడిగా 17 కథలే రాసినా అన్ని కథలూ ఆణిముత్యాలవలె వుంటాయి.

1927 డిసెంబరు 13న 'మదనపల్లె' లో జన్మించిన సుదర్శనం భౌతిక, మానసిక స్థాయిలనుదాటి, ఆధ్యాత్మిక అన్వేషణా, విజిగీషలతో తెలుగు కథలు అనేకం రాసారు. అందుకే సుదర్శనంగార్ని తాత్విక కథా చక్రవర్తిగా, తపస్విగా కథకులు భావిస్తారు.

సుదర్శనం గారి కథల్లో ముఖ్య పాత్రలన్నీ జీవితాన్ని గురించీ, మనిషి అస్తిత్వసాఫల్యాన్ని గురించీ లోతుగా ఆలోచిస్తాయి. ఇప్పటివరకు సుదర్శనంగారు రెండు కథా సంపుటాలు ప్రచురించారు. అవి 'కాలం తెచ్చిన మార్పు', 'మధుర మీనాక్షి'. ఈ రెండు కథాసంపుటాలు కూడా వీరికి ఎంతో గుర్తింపు తీసుకొచ్చాయి. వెలుగలిపువ్వు, ఎరుపు, అమృతుడు, సమర్థుడు, ఆత్మజ్ఞానం, ఏకాంతం, ప్రతిబింబం, కన్నెల వెలుగు కథలు అన్నీ కూడా స్త్రీ పురుష సంబంధాల పరమార్థం తెలియజేస్తాయి.

కథకుడిగానే కాకుండా ఓ గొప్ప విమర్శకుడిగా, నవలా రచయితగా, కవిగా కూడా గుర్తించబడ్డ సుదర్శనంగారు అనుబంధాలు, మళ్లీ వసంతం, అసుర సంధ్య, సంసారవృక్షం నవలలు రాసారు. 'నిశాంతం' అనే కవితా సంపుటి ప్రచురించారు. విమర్శకుడిగా, 'సాహిత్యంలో దృక్పదాలు, సాహిత్యనే పద్యం, కవిహృదయం, చలం, గోపీచంద్‌లపై విమర్శనా గ్రంథాలు రాసి జాతీయస్థాయిలో గుర్తింపు పొందారు.

సుదర్శనంగారికి జిజ్ఞాస జన్మతః సంక్రమిస్తే, అన్వేషణ సహజ ప్రవృత్తయింది. రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, ఠాకూర్ రచనలు, దివ్యజ్ఞాన సమాజ సిద్ధాంతాలూ ఆయన ఆలోచనాలోచనాలను తెరిపించాయి. ఆంధ్ర, ఆంగ్ల సాహిత్యాలను చదివారు.

సుదర్శనంగారి కథల్లోని పాత్రలు లోతుగా పరిశీలిస్తే మధ్యతరగతి కుటుంబాలకు చెందిన వారికోరికలూ, సుఖదుఃఖాలు, ఆశనిరాశలు వీటికి కనిపిస్తాయి. వివాహితులైన ప్రధాన పురుష పాత్రలకు, పరస్త్రీలతో సంబంధాలుంటాయి. పరస్త్రీలతో ప్రేమా, ప్రయాణమూ, వాటిని గురించిన రకరకాల ఆలోచనలూ సుదర్శనంగారిలో తొలగిపోని భావ కవిత్వ ధోరణికి ఛాయలుగా కనిపిస్తాయి. ఇటీవలే వీరు మరణించడం కథా ప్రియులకు, విమర్శకులకు తీరని లోటు.

రచయిత చిరునామా
ఆర్. యస్. సుదర్శనం
9-258, కమ్మవీధి,
మదనపల్లి - 517325.



# ఆనందారామం

**1935** ఆగష్టు 20వ తేదీన జన్మించిన ప్రముఖ కథారచయిత్రి 'ఆనందలక్ష్మి'గారు 'డాక్టర్ ఆనందారామం'గా తెలుగు సాహితీలోకానికంతటికీ పరిచయమే!

సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లోనూ ప్రవేశమున్న ఆనందారామంగారికి యిష్టమైన ప్రక్రియ మాత్రం కథానిక, కథ తరువాత నవలా ప్రక్రియను ప్రేమిస్తారు.

ఇప్పటి వరకు వీరు ప్రచురించిన కథాసంపుటాల్లో వీరికి విశేష కీర్తిని తీసుకు వచ్చినవిగా 'దశావతారాలు'' పెండ్లెందుకు?' 'పోనీ నేనురాసిపెట్టనా?', 'ఎస్సెన్నో కాంప్లెక్సెస్' లు చెప్పుకోవచ్చు. 'టెలిరాగిణీ', 'మహతీ' అనే పెద్ద కథలు... దాదాపు నవలకు సరిపడే కథావస్తువుతో పెద్దకథలు పుస్తకాలుగా తెలుగు సాహితీ లోకానికి అందించారు.

ఆనందారామంగారు ఎన్నో నవలలు రచించారు. అందులో కొన్ని నవలలు సినిమాలుగా విడుదలయ్యాయి. వీరినవలలు సినిమాలుగా తియ్యబడ్డవాటిని చెప్పుకోవాలంటే... ప్రేమసూత్రం నవల 'జీవితం' సినిమాగానూ, మమతల కొలువు నవల జ్యోతి సినిమాగానూ, అనిత నవల 'ప్రేమదీపాలు' సినిమాగానూ, జాగృతి నవల 'త్రిశూలం' సినిమాగానూ విడుదలయ్యాయి.

ఈ త్రిశూలం సినిమాని హిందీలో 'నయాకదం' పేరుతో సినిమాగా విడుదలై డాక్టర్ ఆనందారామం గారికి విశేషకీర్తి ప్రతిష్టలు తీసుకొచ్చాయి. ఇక సినిమాగాక పుస్తకరూపంలోనే ఉన్న నవలలు రిసెర్చ్‌కు సంబంధించిన నవలలు ఇంకా అనేక అంశాలకు సంబంధించిన నవలలు వీరు పుస్తకరూపంలో ప్రచురించారు. తత్వం, వేదాంతం స్పృశిస్తూ 'తపస్వీ', 'ఎంతెంత దూరం' నవలలు రాయగా తెలుగు సాహితీ ప్రియులు వీరిని ఆకాశానికి ఎత్తారు.

తెలుగులో ప్రముఖ వార, దిన, మాస, పత్రికలైన ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, స్వాతి, పల్లకి, ఇండియాటుడే, సుప్రభాతం, యువ, చతుర, విపుల, ఈనాడు, వార్తా ఆదివారం అనుబంధాల్లో వీరి కథలు, సమీక్షలు, విమర్శలు, నవలలు, వ్యాసాలు, గల్పికలు, ఆర్టికల్స్ పుంఖానుపుంఖాలుగా ప్రస్తుతం కూడా ప్రచురించబడటం మనమంతా గమనించాల్సిన విషయం. ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి వీరి కథానికలు అనేకం ప్రసారమయ్యాయి. నేడు ఇంకా ప్రసారమవుతూనే వున్నాయి. నేటి యువ కథారచయిత్రులకు సూచనలనందిస్తూ, రాష్ట్ర సాంస్కృతిక మండలి, యువజన సర్వీసుల శాఖ సంయుక్తంగా నిర్వహించిన 'నవరచయితల అధ్యయన శిబిరం - కథానిక'లో కథ గురించి టెక్నిక్స్ సూచించారు.

డాక్టర్.సి. ఆనందారామం గార్కి 1972లో 'గృహలక్ష్మి స్వర్ణ కంకణం' అవార్డు మద్రాసు వారు అందజేసారు. 1979లో తుఫాన్ నవలకు 'రాష్ట్ర సాహిత్య' అవార్డు, 1987లో మాదిరెడ్డి సులోచనా 'గోల్డ్‌మెడల్', 1989లో 'తెలుగు యూనివర్సిటీ' అవార్డు, ఆ సంస్థనే 1991-92 'ఉత్తమ రచయిత్రి' అవార్డు ఇంకా 2000 సంవత్సరంలో హైదరాబాదు యువకళాసమితి వారు 'గోపీచంద్' అవార్డు ఇచ్చి వీరిని గౌరవించారు. ఎన్ని అవార్డులు సన్మానాలు పొందినా ఏమాత్రం గర్వపడని డాక్టర్ ఆనందారామంగారు మంచి మనస్కులు కూడా.


*రచయిత్రి చిరునామా*

**డాక్టర్.సి. ఆనందారామం**

*ఎస్.ఎమ్. సి-5, మారెడ్‌పల్లి,*

*సికిందరాబాద్ - 500026.*



# ఆచార్య శ్రీవత్స

కృష్ణా జిల్లా పమిడి ముక్కల మండలం 'శ్రీరంగాపురం' గ్రామంలో **5-2-1955** న జన్మించిన 'కోగంటి వేంకట అప్పలాచార్యులు' రచయితగా 'ఆచార్య శ్రీవత్స' పేరుతో సాహితీ ప్రియులందరికీ పరిచయమే. వృత్తిరీత్యా ఉపాధ్యాయులైన శ్రీవత్స గారు 'తెనుగు భారతి సాహిత్య పరిషత్' వ్యవస్థాపకులు.

ఈనాటి రచయిత భావాలకు తగిన పదజాలం, భాషలేక పోవటం వల్ల తమరచనలను చక్కగా వ్యక్తీకరించలేకపోతున్నారని శ్రీవత్స ఆవేదన వ్యక్తపరుస్తారు. తెనుగు సాహిత్యంలో ఎన్ని ప్రక్రియలున్నాయో అవన్నీ కూడ తెనుగుతల్లి శరీరంలోని అవయవాలేనని, ఏ ఒక అవయవము దెబ్బతిన్నా శరీరమంతా దెబ్బతింటుందనే వీరి మాటలు అక్షర సత్యాలు.

తెలుగు సాహితీ సంపదపై మమకారం సడలుతున్న నేడు తెలుగు భాష ఔనత్యాన్ని ముందుతరాకు అందిచేందుకు వారధిగా, సారధిగా పనిచేయటం కోసం ఆంధ్రప్రదేశ్ తెలుగు భారతీ సాహిత్య పరిషత్ కృష్ణా జిల్లా ఉయ్యూరు ప్రధాన కేంద్రముగా స్థాపించి సాహితీ సేవలందిస్తున్నారు. ఈ సంస్థ ద్వారా అనేక సాహిత్య సభలు, కవిసమ్మేళనాలు, అవధానాలు ఎన్నింటినో నిర్వహించారు. రాష్ట్రవ్యాప్తంగా అన్ని జిల్లాల్లోని వివిధ వ్యక్తుల వైశిష్ట్యాన్ని గుర్తించి వారి జీవిత విశేషాలను సేకరించి ప్రత్యేక సావనీర్‌లో నిక్షిప్తం చేస్తున్నారు.

2000 సంవత్సరానికిగాను కృష్ణాజిల్లా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డును శ్రీ కోగంటి అప్పలాచార్యులుకు అప్పటి కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ బి. ఆర్. మీనా ప్రదానం చేసారు. శ్రీ అప్పలాచార్యులు తేజస్వి అనే పద్య కావ్యం, తాపసేంద్రుడు, వ్యాసరత్నాకరం తదితర రచనలు చేసారు. వీరు రచించిన మణికింకణులు సాంప్రదాయ సాంస్కృతిక వ్యాస సంపుటిని 2000 సంవత్సరానికిగాను ఉత్తమ గ్రంధంగా తెలుగు విశ్వవిద్యాలయం ఎంపిక చేసింది. వీరు 'ఆచార్య శ్రీవత్స' బిరుదు పొందారు. వీరికి 1992 వ సంవత్సరం లో తేజస్వి కావ్యావిష్కరణ సందర్భంగా పండిత పురస్కారం, 1977 న ది.కె.సి.పి లిమిటెడ్ జనరల్ మేనేజర్ శ్రీ బి. ఆంజనేయులుగారిచే ఉపాధ్యాయ సత్కారం అందుకున్నారు.

'తెనుగు భారతి' పేరిట ఒక మాస పత్రికను, 'ఉగాదిహేల - 99' పేరిట ఒక ప్రత్యేక సంచికను వెలువరించారు. తెనుగు భారతి సాహిత్య పరిషత్‌కు ప్రధాన సలహాదారుడిగా డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య, డాక్టర్ యం.నాగఫణి శర్మ, డాక్టర్ మేడసాని మోహన్ వ్యవహరిస్తున్నారు. ప్రముఖ రచయిత వేమూరి దుర్గా ప్రసాద్ శర్మగారు వీరిగురించి "కె.వి. అప్పలాచార్యులు చిన్న చిన్న రచనలు చేస్తూ అనేక పత్రికల్లో ప్రచురిస్తూ ఆకాశవాణిలో సాహితీ ప్రసంగాలు చేస్తూ, చాలా కాలంగా సాహిత్య తపస్సు చేస్తూ కృషి చేసి నేడు రచయితగా తనకంటూ ఒక స్థానాన్ని సంపాదించారు" అంటారు. ఒకవైపు వృత్తిరీత్యా పిల్లలను ఉత్తమ విద్యార్థులుగా తీర్చి దిద్దుతూ, సమాజంలో మంచి మార్పు కోసం సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తూ, చక్కటి రచనలు సాహితీ ప్రియులకందిస్తున్న ఆచార్య శ్రీవత్సను మనమంతా అభినందిద్దాం!

రచయిత చిరునామా
**ఆచార్య శ్రీవత్స**
తెనుగు భారతి సాహిత్య పరిషత్,
ఉయ్యూరు - 521165.

# ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి



"కొన్ని రాసినా పాఠకుల మనస్సుల్లో నిలిచే కథలు వ్రాయాలనుకోవటం నా ఆశయం" అంటారు ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మిగారు. బాలసాహిత్యం రాయాలంటే చాలా కష్టపడాలి. ప్రస్తుతం మనకున్న అతి కొద్ది బాలసాహితీ రచయిత్రులలో 'ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి' ముఖ్యులు.

వృత్తిరీత్యా కేంద్ర ప్రభుత్వ కార్యాలయంలో పనిచేస్తూ, హైద్రాబాద్‌లో స్థిరనివాసం ఏర్పరచుకున్న ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మి గారు ఇప్పటివరకు సుమారు 45 చిన్న పిల్లల కథలు, 40 మామూలు కథలు, 10 వ్యాసాలు, 20 కవితలు రచించారు. నిజానికి 'రాశి' లో తక్కువే అయినా 'వాసి' లో ఆణిముత్యాలు ఈ రచనలు. వీరి కథలు బొమ్మరిల్లు, బుజ్జాయి, బాలభారతి, ప్రియమైన చెల్లెలు మరియు ఆంధ్ర భూమి, ఆంధ్ర జ్యోతి, ఆంధ్ర ప్రభ, మయూరి, వనితా జ్యోతి, విశ్వరచన, ప్రమదలలో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

శ్రీమతి ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మి చక్కటి కథలు వ్రాసారు. కథలలో బాల బాలికలకు చైతన్యం, విజ్ఞానం కలిగించే ఇతివృత్తాలు ఎన్నుకున్నారు. దెయ్యాల కథల ద్వారా భయం పోగొట్టి, దైవసహాయాలు గుర్తు చేసారు. భారతీయ సంస్కృతి, వాతావరణం వీరికథల్లో అక్కడక్కడ ప్రతిబింబిస్తాయి. ఒకేవిషయాన్ని పలుకోణాల నుంచి పరీక్షించి కథలుగా అల్లడం ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మి గారికి వెన్నతో పెట్టిన విద్య. 'మూర్ఖత్వం' కథావస్తువుగా తీసుకొని 'సుందర తీర్థయాత్ర' కథలో మూర్ఖుడే నష్టపోతాడని, 'వెంకన్న వెర్రి' కథలో మూర్ఖుడికి తప్పుడు సమాచారం అందించినవారికుండే ప్రమాదం సూచించటం జరిగింది. మూర్ఖుణ్ని మార్చలేమని 'పిడివాదం' కథలో చెబితే, మూర్ఖుడివల్ల కూడా ప్రయోజనం పొందడం ఎలాగో 'మూర్ఖుడితో స్నేహం' కథ ద్వారా తెలియజేస్తారు.

'తిక్క కుదిరింది' హాస్య కథలో... 'ఆ' అన్నా 'ఊ' అన్నా ఇంట్లోంచి వెళ్ళిపోయే మనస్తత్వం అప్పారావుది. ఒకరోజు భార్య ఏదో షన్నదని ఇల్లు వదిలి బయటకు వెళ్ళి ఆరోజు రాత్రి ఎలా ఇబ్బందులు ఎదుర్కొని ఇల్లు చేరాడో చూపించారు. 1999 సం. లో 'బాల మందారం' కథా సంపుటి, 2000 సంవత్సరంలో కథా మందారం కథా సంపుటి ప్రచురించి తెలుగు కథాప్రియులకు కానుకగా అందించారు ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మి. వీరి బాల మందారం కథా సంపుటికి 'విశ్వ సాహితీ' అవార్డు లభించడం విశేషం.

ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రం నుండి అనేక కథానికలు, ప్రసంగాలు వీరివి ప్రసారమయ్యాయి. కేంద్ర ప్రభుత్వ కార్యాలయంలో బాధ్యతాయుతమైన ఉద్యోగ మొకవైపు, రచనా రంగంలో మరోవైపు, కుటుంబ గృహిణిగా తీరికలేకుండా పనులు చక్కబెడ్తున్న ఆకెళ్ళగారు, సాంస్కృతిక సంస్థ కార్యక్రమాలలో కూడా బాధ్యులుగా వున్నారు. విశ్వసాహితి సాంస్కృతిక సంస్థ 'కార్యదర్శి'గా పనిచేస్తున్న ఆకెళ్ళగారు తన భర్త 'శ్రీ ఆకెళ్ళ వెంకట సుబ్బారావు' ప్రోత్సాహం తన విజయాల వెనుక ఎంతైనా వుందంటారు.


రచయిత్రి చిరునామా

**ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి**

ఇ.నెం. 24-4-30/1, సఫిల్‌గూడ,

హైదరాబాద్ - 500 047.

# ఇచ్ఛాపురపు రామచంద్రం





రామచంద్రంగార్కి చిన్న కథలు రాయటం వెన్నతో పెట్టిన విద్య. ఓ హెన్రీ మపాసాల కథలు ఎక్కువగా చదవటంతో చిన్న కథల టెక్నిక్‌ను సులభంగా కనుగొన్నారు. మధురాంతకం రాజారాం గారితో స్నేహం వీరికి ఎంతో తోడ్పడింది. ఇచ్ఛాపురపు జగన్నాధరావు గారు వీరికి కథలు ఎలా చెప్పాలో నేర్పించారు.

1940వ సంవత్సరంలో విశాఖజిల్లా 'నరసీపట్నం'లో జన్మించిన ఇచ్ఛాపురపు రామచంద్రం మనకున్న ప్రముఖ కథకుల్లో ఒకరు. 400కు పైగా కథలు ప్రచురించబడినా ఇంకా ఏదో కొత్తగా కథ చెప్పాలన్న తపన వీరిలో వుంది. రామచంద్రం గారు వుద్యోగరీత్యా అనకాపల్లి ఎల్.ఐ.సి. ఆఫ్ ఇండియాలో పని చేసి 30-6-2000 నాడు పదవీ విరమణ చేశారు.

రామచంద్రం గారు తన కథల్లో వాస్తవికత ఎక్కువ పాళ్ళలోనూ, కల్పన తక్కువ పాళ్ళలోనూ, కలుపుతూ కాకతాళీయాన్ని అతి అరుదుగా మాత్రమే వినియోగించుకుంటూ, సమేతుకంగా, తర్కబద్ధంగానూ, కార్యకారణ సంబంధం కలిగివుండే లాగానూ ప్రాత్రేచిత్యాన్ని పాడుచేయనంత మేరకు ఎక్కువ మందికి తెలిసే భాషలో నడిచినట్లు కనిపిస్తుంది. పాఠకుల ఊహాశక్తినీ, ఆలోచనాపటిమని జాగృతం చేసేందుకు సజీవ మానవ రేఖా చిత్రాలను అక్షరరూపంలో చిత్రించినట్లు కనిపించే వీరి కథలన్నీ ఆణిముత్యాలే.

రామచంద్రం గారి కథలు ఎక్కువగా ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రప్రభ, జ్యోతి, స్వాతి, యువ, విజయ, ఈనాడు ఆదివారం విపుల, వనిత, పల్లకీ, ఉదయం, నీలిమ, ఆంధ్రభూమి, జాగృతి, కృష్ణా పత్రిక మొదలగు వాటిలో ప్రచురించబడ్డాయి.

ఆకాశవాణి విశాఖపట్నం నుండి వీరి కథానికలు అనేకం ప్రసారమయ్యాయి. ఓ హెన్రీ కథలకీ, సాక్షి వ్యాసాలకీ నాటికరూపం యిమ్మని ఆకాశవాణి వారు కోరగా వీరు అందించారు.

సాంఘిక కథలోనే కాకుండా బాల సాహిత్యంలో కూడా విరివిగా కృషిచేసిన రామచంద్రం గారికథలు 30 ఒక పుస్తక రూపంలో త్వరలో ప్రచురించబడనున్నాయి. వీరి కథను ఓ సినిమా కు 'మూల కథ' గా తీసుకోవటం విశేషం. వీరికి మిత్రుల నుండి, పాఠకుల నుండి కథావస్తువులు తీసుకొని కథలుగా మలచటం ఎంతో యిష్టం. వీరి కథ గిన్నిల బుక్కులో... గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ గురించి టీ.వీ. లో వచ్చే అర్థం పర్థం లేని గిన్నీస్ బుక్ రికార్డు గురించి చూసి... చూసి చివరకు ఒక అంట్లు తోమే పనిమనిషి తాను కూడా తన పని నైపుణ్యాన్ని, వేగాన్ని ప్రదర్శించి గిన్నీస్ బుక్కులో ఎక్కాలనుకోవటం హాస్యంగా చిత్రీకరించారు. ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రం నుంచి ప్రతి మూడు మసాల కొకసారి ఇచ్ఛాపురపు రామచంద్రం గారి కథానికలు తప్పక ప్రసారం కావాలసిందే. వినూత్న కథా వస్తువు కొరకు తన పదునైన నేత్రాలతో పరిశీలించే వీరికి స్పందించే హృదయం ఉండటం దేవుడిచ్చిన వరాలు.

ప్రచారానికి అంతగా విలువనియ్యని ఇచ్ఛాపురపు రామచంద్రం కథకుడిగా సాహితీ శిఖరాలు అందుకోవడానికి ఎంతో సమయం పట్టదు.


రచయిత చిరునామా
ఇచ్ఛాపురపు రామచంద్రం
వైష్ణవీ ఎంక్లేవ్, బాలాజీ దాస్ వీధి,
వుడ్ పేట, అనకాపల్లి - 531 001.





# ఐతా చంద్రయ్య

మెదక్ జిల్లా సిద్ధిపేట మండలం 'చింత మడ్క గ్రామం'లో 1948లో జన్మించిన ఐతా చంద్రయ్యగారు, తెలంగాణా ప్రాంతానికి చెందిన ప్రముఖ కథారచయిత.

వృత్తిరీత్యా తపాలా శాఖలో పని చేస్తున్నా ప్రవృత్తిరీత్యా కథాసాహిత్యాన్ని ఎన్నుకొని, తెలంగాణా ప్రాంత ప్రజలపై, జీవన సరళిపై, కష్టాలపై, కన్నీటిపై తన కలం నుంచి ఎన్నో కథలు రచించారు. తెలంగాణా మండలికంలో కూడా కథలు రాసి ఆ ప్రాంత ప్రజలనేకాక రాష్ట్ర నలువురాలలా అభిమానులను సంపాదించుకున్నారు.

తెలంగాణా పనివాళ్ళను అరణంగా పంపించే క్రూరాచారాన్ని కథావస్తువులుగా తీసుకొని, తెలంగాణా మాండలికంలోనే అందంగా కథలు అల్లారు. వీరి కథల్లో కొత్తమెరుపు మనకు కనిపిస్తుంది. అరణంగా వచ్చిన 'వాణి' వంటపనులు, ఇంటిపనులు ఒంటి పనులు అన్నీ పాపం చేస్తూనే వుంటుంది. జానెడు కడుపు కోసం అటువంటి 'వాణి' యాదృచ్ఛికంగా బీడీలు కట్టటం నేర్చుకుంది. ధాన్యం బాగుచేస్తూ, పప్పురుబ్బి, నాలుగు రూపాయలు సంపాదించగలుగుతుంది. రెక్కలు వచ్చిన పని తెలుసుకొని వెట్టిచాకిరి పంజెరంనుంచి ఎగిరిపోతుంది. పతిత జనోద్ధరణకు ఒకే ఒక ప్రభావశాలిమార్గం, వారలకు బ్రతుకుతెరువు మార్గం తెలియజేయుటకు అన్న సందేశమున్న గొప్పకథ రచించారు ఐతా చంద్రయ్యగారు.

ఐతా చంద్రయ్యగారు కథలకు టైటిల్స్ ఒక వినూత్న కోణంలో పెడతారు. పల్లేటి బాలాజీ సంకలన కర్తగా 'అభినందన' కథా సంకలనం వెలువడింది. అందులో వీరు 'అభూత వైద్యం' అన్న కథను రాసారు. నిజానికి భూత వైద్యం వుంటుంది. వైద్యం వుంటుంది. మరి ఈ 'అభూత వైద్యం' ఏమిటి? అని పాఠకుడు తప్పక ప్రశ్నించుకుంటాడు. ఇలా పాఠకుడిని మొదటి నుంచి చివరివరకు పిలక పట్టుకొని చదివించేలా కథలు రాస్తారు చంద్రయ్యగారు.

ఇప్పటి వరకూ ఐతా చంద్రయ్య సుమారు 8 కథాసంకలనాలు ప్రచురించారు. 'వరవిక్రయం', 'ఊహల ఊయల', 'కథా మంజూష', 'ఐదునిముషాలు', 'కుంకుమరేఖ', 'చిలుకపచ్చచీర', 'సౌందర్యలహరి' మరియు 'స్వేచ్ఛాజీవులు' ఇప్పుడు మనకు మార్కెట్లో లభించడం తెలుగు కథా పాఠకుల అదృష్టం.

కథా రచనపై విశిష్ట సేవ చేసిన ఐతా చంద్రయ్య గారికి, ఎన్నో పత్రికల్లో కథలకు అవార్డులు, బహుమతులు లభించాయి. అమెరికా తెలుగు సంఘము 1996లో నిర్వహించిన కథల పోటీల్లో వీరి కథ 'తేనె కుండలో ఈగ' మొదటి బహుమతి పొందింది. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో వీరి నాటికలు కూడా ప్రసారమయ్యాయి.

రచయిత చిరునామా
ఐతా చంద్రయ్య
4-4-11, శేర్‌పురా,
సిద్ధిపేట - 502 103



# ఐ.ఎ. నరసింహం

శ్రీకాకుళం జిల్లా 'కల్లేపల్లి' అనే గ్రామనికి చెందిన ప్రముఖ కథకుడు ఐ.ఎ. నరసింహం. వృత్తి రీత్యా విజయనగరం జిల్లా 'గుమ్మలక్ష్మీపురం' అనే గ్రామంలో నివసిస్తున్నారు.

1978 నుండి నరసింహం గారికథలు అనేక ప్రముఖ వార, దిన, మాస పత్రికల్లో ప్రచురించబడుతున్నాయి. ఇప్పటివరకు సుమారు 118 కథలకు పైనే రాసిన ఐ.ఎ. నరసింహం గారి మొదటి కథ 1978 జూలైలో 'వెన్నెల లేని రాత్రి' ఓ ప్రముఖ పత్రికలో అచ్చులో చూసుకున్నారు.

కథ అనేది ఏదో ఒక చిన్న సంఘటనో, అంశమో, తీసుకుని ఆసక్తికరంగా చదివింపచేసే ప్రక్రియ కాబట్టి, కథ ద్వారా సామాజిక ప్రయోజనం సాధించే అవకాశం ఎక్కువ. అందువల్ల కథ ద్వారా మానవత్వం వైపు నడిపించే విలువలను అందిచాల్సిన బాధ్యత నరసింహంగారు గుర్తించి కథాప్రియులకు చక్కటి కథలు అందించారు.

1999లో ఐ.ఎ. నరసింహం గారు తనకు ఎంతో గుర్తింపు తీసుకొచ్చిన ఓ 10 కథలతో 'రెక్కలపాము' కథాసంపుటిని 2000 సంဃలో 25 మినీ కథలతో 'పరామర్శ' అనే మరో కథా సంపుటి ప్రచురించి తెలుగు సాహితీ ప్రియులకు అందించారు. త్వరలో వరకట్నం ఇతివృత్తంగా వున్న మరో పది కథల సంపుటిని 'సున్నితపు త్రాసు' పేరుతో ప్రచురించబోతున్నారు. వీరికథలన్నీ కన్నడ భాషలోకి, మరికొన్ని ఇంగ్లీష్ లోకి అనువదించబడ్డాయి.

కథకు వీరు ఎన్నుకున్న ఇతివృత్తాలను పరిశీలిస్తే వీరి అంతర ప్రవృత్తి అర్థమవుతుంది. కథాకథన శిల్పనైపుణ్యంతో తమచెప్పదలుచుకొన్న అంశాన్ని పాఠకుల గుండెల్లోకి తీసుకెళ్తారు. కంటతడిపెట్టిస్తారు. ఐ.ఎ. నరసింహంగారు స్త్రీ వాద రచనలుకూడా చేసారు. నేడు స్త్రీ వరకట్నం పేరిట ఎలా అణగద్రొక్కబడుతుంది. వరకట్నపు ఉక్కుపాదాల క్రింద నలగకుండా స్త్రీని కాపాడాలంటూ తన 'సున్నితపుత్రాసు' కథా సంపుటిలోని కథల్లో చెబుతున్నారు.

కథారచనతో పాటు జ్యోతిష్యశాస్త్రంలో కూడా ప్రవేశమున్న నరసింహం ఆ శాస్త్రం లోనూ పోశ కృషి చేస్తున్నారు. అయితే జ్యోతిష్య శాస్త్రం పైనే ఎక్కువ సమయం కేటాయించటంతో ఇటీఃల కథలు ఎక్కువగా రాయలేకపోతున్నారు. ప్రతి సంవత్సరం కథా సంకలనాలు తీసుకు రావాలన్న లక్ష్యంతో వున్న వీరు నాటక ప్రక్రియలో కూడా మంచిప్రావీణ్యం చూపారు. వీరినాటికలు ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రంద్వారా పలుమార్లు ప్రసారమయ్యాయి. అలాగే ప్రతి మూడు నెలలకొక సారి వీరి కథానిక ఆకాశవాణిలో తప్పక ప్రసారమవుతుంది. ఐ.ఎ. నరసింహంగారి కథా సంకలనాలు, సంపుటాలు రాష్ట్రంలోని అన్ని ప్రముఖ గ్రంథాలయాలలోనూ మనం గమనించవచ్చు.

రచయిత చిరునామా
ఐ.ఎ. నరసింహం
కైలసనాథ దేవాలయం, గుమ్మలక్ష్మీపురం,
విజయనగరం జిల్లా.





# కప్పగంతుల మల్లికార్జునరావు

"నేను రచయితను కావాలనుకోలేదు. కథలు చదివి చదివి నేనెందుకు రాయకూడదు... అని కథలు రాయటం మొదలుపెట్టాను" అంటారు ప్రముఖ కథా, నాటక, నవలా రచయిత శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు.

1936 డిసెంబరు మాసంలో జన్మించిన కప్పగంతుల, రాజమండ్రి పట్టణానికే కాక, రచయితగా యావత్ ఆంధ్రదేశానికి చిరపరిచితులు. 1966 లోనే వీరి నాటకం సప్తపది రాజమండ్రి 'లలిత కళానికేతన్' నాటక పోటీలో 'ఉత్తమరచన' బహుమతితో పాటు అనేక బహుమతులను పొందింది. 1968 లోనే నాటకరచయితగా వీరికి 'శ్రీ తన్నీరు బుల్లెయ్య' గారి అధ్యక్షతన రాజమండ్రిలో సన్మానం జరిగింది.

"కథలు రాయాలంటే కళ్ళు విప్పి చూడాలి... మనసు విప్పి మనసుతో చూడాలి!" అనే కప్పగంతుల మల్లికార్జున రావుగారు వృత్తిరీత్యా ప్రభుత్వ కాలేజీలో చరిత్ర ఉపన్యాసకులుగా పనిచేసారు.

శ్రీ మల్లికార్జునరావుగారి నాటకాల మీద, కథలపైన యమ్.ఫిల్ డిగ్రీ కొరకు పరిశోధనలుచేసి యిద్దరు విద్యార్థులు యమ్.ఫిల్ పొందారు. వీరి నాటకాలను, కథలను, నవలలను విశ్లేషిస్తూపత్రికల్లో వ్యాసాలు అనేకం వచ్చాయి. ఇంటర్వ్యూలు ప్రచురింపబడ్డాయి.

కేంద్ర సాహిత్య అకాడమీ గ్రాంట్‌తో కేరళరాష్ట్రంలో సాహిత్యపర్యటన జరిపి వచ్చిన శ్రీ మల్లికార్జునరావు గారు రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డుతో పాటు, కథలకు నాటకాలకు అనేక అవార్డులను పొందారు.

సుమారు 300లకు పైన కథలు ప్రచురించబడ్డ సందర్భాన్ని పురస్కరించుకొని వారిని అభినందించటానికి శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు కథా త్రిశతి అభినందన సంచికను ప్రచురించాలని, వివిధ పత్రికల్లో వచ్చిన వీరి 300 కథల్లో సాధ్యమైనంత ఎక్కువ సంఖ్యలో ఎంపిక చేసి రెండు సంపుటాలుగా గ్రంథరూపంలో ప్రచురించాలని పాఠకులు భద్రపరుచుకోటానికి, మళ్ళీ, మళ్ళీ చదువుకోటానికి వీలుగా ప్రయత్నాలు ఈ సంఘం చేస్తుంది.

పాలిగాడు, జ్వాల, శిక్ష, సప్తపది, నీలినీడలు, యాచకుడు, అడవిగాలి వీరి ప్రముఖరచనలు. 'మన కథకులు' పేరిట సీనియర్ కథారచయితల పరిచయ శీర్షిక, ఓ ప్రముఖ వారపత్రికలో నిర్వహించారు. దూరదర్శన్‌లో గురజాడ నుంచి అనేక మంది ప్రముఖ కథా రచయితల గురించి ప్రేక్షకులకు పరిచయ కార్యక్రమం నిర్వహించి తమ వంతు కృషిని కథాసాహితీ రంగంలో నిర్వహించిన ఘనత దక్కించుకున్నారు. కథలు చదువుతూ ఆనంద పారవశ్యాన్ని ఆపుకోనపుడు వీరి శ్రీమతి లక్ష్మీకాంతాదేవి గారు ఏం పనిచేస్తున్నా ఆపి వారి ఆనందాన్ని చెప్పేవారు. కథలు చదివే అలవాటు ఉన్న ఆవిడ వీరి వెర్రి ఆనందాన్ని చూచి విస్తూపోతూ చూచి వినేదని కప్పగంతులవారే చెప్పుకున్నారు. వీరు మరిన్ని కథా సంపుటాలు ప్రచురించి సాహితీలోకానికి అందిచాల్సిన అవసరం ఎంతైనా వుంది.

రచయిత చిరునామా
**కప్పగంతుల మల్లికార్జునరావు**
*104, కళ్యాణ్‌నగర్, ఫేస్ III,*
*హైదరాబాద్ - 500 018.*



# కలువకొలను సదానంద

ఫిబ్రవరి 22, 1939 లో చిత్తూరు జిల్లా పాకాలలో జన్మించిన 'కలువకొలను సదానంద' కథకుడిగా తెలియని తెలుగువారుండరంటే అతిశయోక్తికాదు. వృత్తిరీత్యా 36 సం.లు ఉపాధ్యాయుడిగా పనిచేసి 1997లో పదవీ విరమణ పొంది ప్రస్తుతం కథా రచనలతో కాలం గడుపుతున్నారు.

సదానందగారు 1957లో కార్టూన్లతో, బాలగేయాలతో, పిల్లల కథలతో రచనావ్యాసంగం ప్రారంభించారు. తెలుగు స్వతంత్ర, సైనిక్ సమాచార్, ప్రవంతి, జయంతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, భారతి, విజయ, ఆంధ్రజ్యోతి, ఆంధ్ర భూమి, స్వాతి ఇండియాటుడే వగైరా పత్రికలలో దాదాపు 150 కథలు రాసారు. పిల్లలకోసం పిల్లల పత్రికలన్నిట్లోనూ కథలు రాశారు. 8 నవలలు పత్రికలలో ప్రచురించబడ్డాయి. వీరి కథలలో చాలాభాగం కడప ఆకాశవాణిలో ప్రసారమైనాయి.

సదానందగారు కొన్ని కథాసంపుటాలు ప్రచురించారు. 1965లో వీరి కథాసంపుటి 'రక్తయజ్ఞం' వెలుగు చూసింది. ఆ తరువాత 1967లో 'పైరగాలి' 1975లో 'నవ్వే పెదవులు - ఏడ్చేకళ్ళు' 1995లో 'రంగురంగుల చీకటి' కథా సంపుటాలు వరుసగా పాఠకులకు అందించారు.

కలువకొలనుగారు కవితా రచనలో కూడా గొప్పపేరు సంపాదించారు. 1995లో వెలువడిన వారి కవితాసంపుటి 'వెల్లువలో మనం' వీరికి గొప్పపేరు సంపాదించింది. పలువురి మన్ననలు అందుకొంది. నవలా రచనలో కూడా ప్రవేశమున్న వారు 1972లో 'గాడిద బ్రతుకులు' 1976లో 'గందరగోళం' నవలలు పాఠకులకు అందించారు. సాహిత్య ప్రక్రియలన్నింటిలోకి అతి కష్టమైన బాల సాహిత్యంలో వీరు ప్రవేశించి విశేషంగా కృషిచేసారు. పిల్లలంటే వీరికి ఎనలేని ప్రేమ. పిల్లలకోసం కథలు రాయాలని ఎప్పుడూ ఆరాటపడుతుండేవారు.

మనకున్న బాలసాహితీమూర్తులలో కలువకొలను సదానందగారు ముందువరుసలో వుంటారు. పిల్లలకోసం వీరు 1965లో 'బంగారు నడచిన బాట' నవల ప్రచురించారు. అంతేకాకుండా పిల్లల కథాసంపుటాలు అనేకం ప్రచురించి బాలలకు అందించారు.

1964లో పిల్లల కథా సంపుటి 'సాంబయ్య గుర్రం', 'చల్లని తల్లి', 'నీతికథా మంజరి' (1966), 'విందు భోజనం' (1967), 'శివానందలహరి' (1983) వరుసగా అందిస్తూ వచ్చారు. ఇంకా అనేక కథానికలు, పిల్లల కథలు, బాలగేయాలు, నవలలు పుస్తకరూపంలో రావలసివున్నాయి. 'బంగారు నడిచినబాట' నవలకు 1966లో ఉత్తమబాలసాహిత్య గ్రంథంగా కేంద్రప్రభుత్వ విద్యాశాఖ వారి అవార్డు లభించింది. 'నవ్వే పెదవులు - ఏడ్చే కళ్ళు' కథానికల సంపుటికి 1976లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. 1996లో ఉగాదినాడు హైదరాబాదు తెలుగు విశ్వవిద్యాలయం వారి 'ధర్మనిధి పురస్కారం' సృజనాత్మక సాహిత్యానికి గాను అందుకున్నారు. ఇంకా అనేక సాహితీ సంస్థల నుంచి పలు అవార్డులు అందుకున్న సదానందగారు 1990, 92లలోఉత్తమ ఉపాధ్యాయ అవార్డు కూడా అందుకోవటం విశేషం.


రచయిత చిరునామా
కలువకొలను సదానంద
భారతం మిట్ట, పాకాల-517112.
చిత్తూరు జిల్లా.



# కస్తూరీ ప్రసాద్

'రాధిక' కలం పేరుతో గొప్ప కథలనందిచిన కథకురాలు శ్రీమతి కస్తూరీ ప్రసాద్. "అప్పట్లో నా అక్షరాలు పెంపుడు పావురాలు, బియ్యంలో తీసి పారేసిన రాళ్ళు" అంటూ తనుకథకురాలిగా ప్రారంభ రోజులు గుర్తుచేసుకుంటారు.

శ్రీమతి సరిపెల్ల సావిత్రి, శ్రీ సూర్య ప్రకాశం గార్లకు 7-8-1949న తూ.గో. జిల్లా కొత్తపేట తాలూక 'గంటి' లో జన్మించిన కస్తూరీ ప్రసాద్ నా మొదటి కథ అచ్చయినపుడు 'నా సంతోషం వర్ణనాతీతం' అంటారు. చిన్న కథలు రాయడంలో సిద్ధహస్తం వీరిది.

రాధిక గారి 'నలుగురు కలసి నవ్వేవేళ' కథ ప్రముఖ కథకులందరి మన్ననలందుకుంది. శిల్ప ప్రభావాన్ని బట్టి చూస్తే అద్వితీయ మనిపించే గొప్ప కథగా గుర్తించారు. గడచిన అర్థ శతాబ్దిలో తెలుగు మహిళ ఎదుర్కొన్న దుర్భర, దుస్సహాయ పరిస్థితుల్ని చిత్రించే కథలు ఎక్కువగా రాసారు.

వీరి కథలు విశ్లేషిస్తూ ప్రముఖ కథకులు మధురాంతకం రాజారాం గారు "రాధిక గారి కథల్లో నలుగురు కలసినవ్వే" వేళ శిల్ప ప్రభావాన్ని బట్టి చూస్తే అద్వితీయమనిపించే కథ. వినీలాకాశంలో విహరించే అందమైన పావురాళ్ళలో ఒక్కటి ఇంకాస్సేపట్లో వేటగాడి క్రూర బాణానికి బలై భూపతనం కాగలదని ఎవరూహించగలరు? ఇంతకూ ఆ వేటగాడు, ఆమే పెళ్ళాడినవాడా, కుటుంబ సభ్యుడా, లేక వాళ్ళ ఆటల్ని అలాసాగనిచ్చే సమాజమా! అన్నది బుద్ధి జీవులు ఆలోచించగలిగే విషయం. వికృత మనస్తత్వం వున్న వ్యక్తుల మధ్య ఎదురయ్యే జీవితకాలపు వేటకన్నా, మనసెరిగి మన్నన చేసే మంచి స్నేహితురాళ్ళతో సరసల్లాపాలాడే కొన్ని నిమిషాలే ఈ జీవితానికి చాలునన్నట్లుగా నాశనమైన జీవితాన్ని, అటువంటి అకృత్యానికి పాల్పడిన కర్కోటపు సమాజం ముఖం మీద విసిరేసి పోయిన ఈ ధీనురాలి కథ, తెలుగు కథా సాహిత్యం గర్వించతగ్గ కథల్లో ఒకటిగా ఉంటుంది" అంటారు. వీరిమాటలు అక్షర సత్యాలు మరి!

రాధిక గారి కథల్లో లోక పరిశీలనా సామర్థ్యం విలక్షణమైనది. సంఘటనలని, పాత్రలనీ, ప్రదేశాలనీ తను ఎంత నిశితంగా పరిశీలించారో తెలియ పరిచేవిగా వుంటాయి. రాధిక గారి 'చిన్న ఆశ' కథలో 'ప్రమద'కు చిన్నప్పటి నుంచి జాజులు, గాజులు, పసుపు, కుంకుమ అంటే చాలా ఇష్టం. ఇద్దరు పిల్లల తల్లి అయిన తరువాత ఆమె భర్త శంకరం రోడ్డు ప్రమాదంలో మరణిస్తాడు. వితంతువైన ప్రమద బొట్టు తీయదు. గాజులు, పూలు ధరిస్తుంది. 'మా ఆయన తను చనిపోయినా, నన్ను ఎప్పటివలే వుండమన్నారు' అని మనసులోనే భర్తకు క్షమార్పణ చెప్పుకుని ఒక అబద్ధం ఆడుతుంది. ది. 27-01-2002 నాడు కాకినాడలో రాధిక గారి నలుగురు నవ్వినవేళ, జీవిత చక్రం పుస్తకాలు 'శ్రీగెద్దాడ బ్రహ్మయ్య మెమోరియల్ ట్రస్ట్' ఆద్వర్యంలో ఆవిష్కరించబడ్డాయి. ప్రముఖ కథకులు శ్రీ కాళీపట్నం రామారావు దీవెనలు అందించారు.

ప్రముఖ రచయిత మిరియాల రామకృష్ణ, భరాగో లాంటి కథల మన్ననలందుకున్న కస్తూరీ ప్రసాద్ గొప్ప రచయిత్రి అనడంలో సందేహం లేదు.

రచయిత్రి చిరునామా
కస్తూరీ ప్రసాద్
70-3-3, విద్యానగర్, డాక్టర్స్ కాలనీ,
రమణయ్యపేట, కాకినాడ - 533 003.







# కట్టా వెంకటేశ్వరరావు

'ఉష' కలం పేరుతో విరివిగా కథలు రాస్తున్న కట్టా వెంకటేశ్వరరావు వృత్తి రీత్యా డివిజనల్ కో-ఆపరేటివ్ ఆఫీసర్, గుంటూరు వారి కార్యాలయంలో కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రార్ గా పనిచేస్తున్నారు.

కట్టా వెంకటేశ్వరరావు గారు డెబ్బైయ్యవ దశకంలో కథల్ని ఓ యజ్ఞంలా రాసారు. వీరి కథలన్నీ మనింట్లోనో, మన పక్కింట్లోనో జరిగినట్లుంటాయి. అలాంటి కథా వస్తువులు తీసుకొని కథలు అల్లటం ఉష గారికి వెన్నతో పెట్టిన విద్య. ప్రతి కథలోనూ వాస్తవికత చోటు చేసుకుంటుంది.

విద్యార్థి దశనుండే కథలు రాస్తున్న ఉష గారు, తమ సమకాలీకులైన ప్రముఖ కథకులు సుగమ్‌బాబు, దేవిప్రియ, కిరణ్‌బాబు, ఓల్గా, వివేకానంద మొదలైన వారితో గుంటూరులో యువసాహితీ శిక్షణ కేంద్రం స్థాపించి సాహిత్య సేవకు చక్కని కృషిచేసారు.

ఉష రాసిన 'నూకలు' కథలో..... వీరిగాడు శ్మశానంలో శవాలు కాల్చేవృత్తి. శవం వచ్చినరోజు డబ్బులు దొరుకుతాయి. రాని రోజు పస్తులుండాలి. ఆ వూరిలో ఆ రోజు ఎవరు శవంగా మారి శ్మశానానికొస్తారా అని, ఆ రోజు కడుపు ఎలా నిండుతుందా అని ఆసక్తితో ఎదురుచూస్తుంటాడు. కాని విధి విచిత్రం మరోలా వుంటుంది.

'రాతి విగ్రహాలు' కథలో చెప్పులు కుట్టే పేదవాడి జీవిత చిత్రణ. ఓ రోజు తన చెప్పులే అమ్ముకుంటాడు. వాటిపై మమకారం చంపుకోలేక తిరిగి వాటిని సాధించే కృషిలో దొంగగా ముద్ర వేయించుకుని దెబ్బలు తిన్న వైనం బాధకల్గిస్తుంది.

సమాజంలో అట్టడుగు వర్గాల జీవితాలను కథలుగా మలచిన ఉష గారు 'వారసత్వం' అనే కథా సంపుటి ప్రచురించి పాఠకులకు కానుకగా అందించారు. 1968లో వీరు నిర్మించిన యువసాహితీ శిక్షణ కేంద్రానికి ప్రిన్సిపల్‌గా వుండి ఎందరో యువకథకుల్ని తెలుగు సాహితీ ప్రియులకందించారు.

"నవలలు, గల్పికలు ఇంకా కొన్ని కథల సంపుటాలు వెలువరించి, తనను కని పెంచిన తల్లి దండ్రులకు అంకితమివ్వడం ఉష చేసిన మంచి పని ఇందుకు ప్రతి రచయిత గర్వించక తప్పదు" అంటారు సీనియర్ జర్నలిస్ట్, కథకులు తాడిశెట్టి.

గుంటూరు నాగార్జునా బుద్ధవిహార్ వారు 'ఉష' గార్ని సన్మానించి 'సాహితీ బంధు' బిరుదు ప్రదానము చేసారు. ఇటీవలి కాలంలో ఎందుచేతనో ఉషగారు కథలు అంతగా రాయుటంలేదు. ఎందరో యువకథకుల్ని అందించిన వీరు మరిన్ని మంచి కథలు తెలుగు కథా ప్రియులకు అందించాల్సిన అవసరం ఎంతైనా వుంది. మరి వీరి నుంచి సాహితీ విలువలున్న గొప్ప కథలు మరిన్ని మనం కోరుకుందాం.


రచయిత చిరునామా
**కట్టా వెంకటేశ్వర రావు**
ఇ.నెం. 5-58-20, 3వ లైను,
కొబాల్డు పేట, గుంటూరు.



# కన్నా అనంత వేంకటేశన్

"సంగీత, సాహిత్య, నృత్యాలలో లీనమై ఈ అనంత విశ్వంలో కలిసిపోవాలన్న ఆశయం నాది" అంటారు కన్నా అనంత వేంకటేశన్.

'మచిలీపట్నం' కు చెందిన యువకథకుడు వేంకటేశన్. "స్పందించినపుడు మాత్రమే రాయగలగడం నా బలహీనత" అంటారు. వృత్తిరీత్యా కృష్ణాజిల్లా మల్లవోలు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో గ్రేడ్ 2 హిందీ పండిట్‌గా పనిచేస్తున్నారు. తెలుగు, హిందీ, ఆంగ్లంతో పాటు సంస్కృత భాషలో కూడా ప్రవేశమున్న, కన్నా అనంతవేంకటేశన్ ఇప్పటి వరకు ముప్పైకిపైగా కథలు రాశారు. ఒక నవల, నూరుకుపైగా కవితలు, కొన్ని వ్యాసాలు వీరివి ప్రచురించబడ్డాయి.

రేఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ నుండి యాక్టింగ్‌లో డిప్లొమా, మూడు భాషల్లో టైప్‌రైటింగ్ హయ్యర్ గ్రేడ్ చేశారు. ప్రవృత్తిరీత్యా కథలు రాస్తూనే మరోవైపు న్యూస్‌రీడర్‌గా కూడా లోకల్ ఛానల్‌లో పనిచేస్తున్నారు.

మంచికథ, రాయాలంటే జీవితాన్ని చదవాలి. మంచి కథా సాహిత్యాన్ని చదవాలి. మనషిలో మనిషిని చదవగలగాలి. జనం పులకుబడినీ, ప్రజల నుడికారాన్ని తెలుసుకోగలగాలి. అందుకనే, మంచి కథ రాయడం తపస్సు లాంటిది. కన్నా అనంత వేంకటేశన్ ఒక తపస్సులా కథలు రాస్తున్నారు. డా. సంజీవదేవ్ వారి ఆరాధకుడు.

కన్నా అనంత వేంకటేశన్ గారి భార్య శ్రీమతి తారకేశ్వరీ దేవిగారు కూడా కన్నా గారి కథా రచనలలో సహకారం అందిస్తున్నారు. ఆవిడ వత్తిరీత్యా ఎ.పి.ఎస్. ఆర్.టి.సి.లో కండక్టర్‌గా సేవలందిస్తున్నారు.

కన్నాగారి కథలు అన్ని ప్రముఖ పత్రికల్లోను ప్రచురించబడ్డాయి. స్వాతి, భూమి, మయూరి వంటి వార పత్రికల్లో చోటచేసుకున్నాయి. ఆకాశవాణి విజయవాడ కేంద్రం నుండి వారి కథానికలు, కవితలు, ప్రసంగాలు ప్రసారమయ్యాయి.

నిత్య జీవితంలో వృత్తిరీత్యా జరిగే పరిచయాలను కథావస్తువులుగా తీసుకుని, కథ కల్పనిక సాహిత్యం కాదని - అది వలుగుర్ని ఆలోచింపచేసే విధంగా కథలను అల్లినట్లయితే వారి కథలు చిరస్థాయిగా గుర్తింపు పొందడమే కాకుండా యువ రచయితలకు మార్గదర్శకంగా మిగలాలి. కవిగా ఆర్ద్రత నిండిన అతడి గుండె చప్పుడు....

గుక్కెడు నెత్తురు
గుప్పెడు మాంసము
నాగుండె అనుకోకు

అందు -

ఈ విశ్వమంతా ఇముడుతుంది అంటారు కన్నా అనంత వేంకటేశన్.


రచయిత చిరునామా
కన్నా అనంత వెంకటేశన్
18/337-1, ఇంగ్లీషుపాలెం,
మచిలీపట్నం - 521 001.

# కాళీపట్నం రామారావు



"నేను రాసే కథల ప్రభావం పాఠకులమీద ఉంటుందో లేదో గాని నా మీద మాత్రం ఖచ్చితంగా ఉంటుంది" అంటారు 'కా.రా'.మాష్టారుగా పేరుపొంది, ఎందరో శిష్యులని తయారు చేసిన ప్రముఖ కథకులు కాళీపట్నం రామారావు.

78 సం.రాల వయసులో కూడా ఇంకా కథకోసం శ్రమిస్తున్న కథా శ్రామికుడితడు. శ్రీకాకుళంలో 22 ఫిబ్రవరి 1997 నాడు కథానిలయం ఆవిష్కరించారు. ఈ కథానిలయం తెలుగు కథకి రిఫరెన్స్ లైబ్రెరీ. 1910కి ముందూ వెనుకా ఉండిన పెక్కు కథలూ, కథానికలు, కథా సంపుటాలు సేకరించి ఈ లైబ్రెరీ (కథానిలయం)లో పదిలపరుస్తున్నారు. ప్రస్తుతం రాస్తున్న కథకులు కూడా తమ కథా సంపుటాలు కథానిలయానికి అందజేస్తున్నారు.

1966లో కాళీపట్నం రామారావు గారు రాసిన 'యజ్ఞం' కథ, తెలుగు కథా ప్రపంచాన్ని కదిలించింది. ఆ కథ పాఠకుల మన్ననలు విశేషంగా పొందింది. దోపిడి స్వరూప స్వభావాలను నగ్నంగా, సరళంగా, సహజంగా కమ్యూనిష్టు సిద్ధాంతాన్ననుసరించి శాస్త్రీయంగా చిత్రీకరించారు. 'ఆర్తి', 'తీర్పు' కథలు కూడా సరికొత్తకోణంలో చెప్పబడ్డకథలు.

కా.రా.మాష్టారుగారిని అప్పుడప్పుడూ అనారోగ్యం పలకరించినా ఖాతరు చేయకుండా కథకోసం ఏదో చేయాలని ఆరాటపడుతుంటారు. తెలుగు కథకు శాశ్వతత్వాన్ని చేకూర్చాలని ఆలోచనలు చేస్తుంటారు. కాళీపట్నం గారు యువ కథకులను ఎందరినో ప్రోత్సహించి వారి నుంచి మంచి కథలు రాబట్టారు. ఆంధ్ర భూమి దినపత్రికలో 'నేటి కథ' శీర్షికను నిర్వహించి క్రొత్తరచయితలకు అవకాశమిచ్చారు. ఈ శీర్షిక ఎందరో యువకథకులకు స్ఫూర్తినిచ్చింది.

కా.రా.గారి కథలు ఆలోచింపజేస్తాయి, అనుభూతికోసం రాసే కథలు మంచికథలు కాలేవని ఆయన అభిప్రాయం. అందుకే వీరి కథలను లోతుగా పరిశీలిస్తే చాలాకథలు పెద్దగా అనుభూతిని కలిగించలేకపోయినా.... తీవ్రంగా ఆలోచింపజేస్తాయి. 'మానవమనస్తత్వం' గురించి కొత్త అవగాహన కలిగించేది మంచి కథ లక్షణం అని, ఆ దిశగా కథలు రావాలని యువకథకులకు సలహానిస్తారు.

కాళీపట్నం రామారావు గారు వృత్తిరీత్యా ఉపాధ్యాయులు. ఆయన అజాత శత్రువు. శత్రువులను కూడా క్షమించి వారికి సహకరించే మంచి మనస్కులు. యాభై ఆరేళ్ళ కాలంలో కాళీపట్నం వారు కేవలం యాభై వొక్కకథలను మాత్రమే పాఠకులకందించినా... అన్ని కథలూ ఆణిముత్యాలే. రాయడానికి కాగితము-కలమూ వున్నా, కథావస్తువులు కూడావున్నా, ఆయన కథలు రాస్తే పత్రికలు కళ్ళు మూసుకొని వేసుకోగలిగినా ప్రస్తుతం కథా రచనకు దూరంగా వుంటూ 'కథానిలయం' కోసం శ్రమిస్తున్నారు. 623 కథకుల 1,235 కథా సంపుటాలు సేకరించారు. అలనాటి కథలు, అనువాద కథలు 310 పుస్తకాలు సేకరించారు. కథే ప్రాణవాయువుగా జీవిస్తున్న ఆయన 'యజ్ఞం' విజయవంతం కావటానికి కథకులందరూ సహకరించాలి.

రచయిత చిరునామా
**కాళీపట్నం రామారావు**
కథానిలయం సూర్యానగర్ ఎక్స్‌టెన్షన్,
విశాఖ బ్యాంక్ 'ఏ' కాలనీ,
శ్రీకాకుళం - 532 001.



# కాకాని చక్రపాణి

చుట్టూవున్న సమాజాన్ని చూసినప్పుడు హృదయంలో కలిగే స్పందనలకు చక్కని కథలుగా మలిచే గొప్ప రచయితల్లో కాకాని చక్రపాణి ఒకరు. చక్రపాణి గారు **1942** ఏప్రిల్ **26**న జన్మించారు.

వీరు వృత్తిరీత్యా ఆంగ్ల ఉపన్యాసకులుగా పలుకళాశాలలో పనిచేసి ప్రస్తుతం రిటైర్అయ్యారు. వీరి కథలను లోతుగా పరిశీలిస్తే ఒక ఒడుపు, ఒక చాతుర్యము, భావుకత్వంతో కూడిన ఒక వేగము కన్పిస్తాయి. ఆత్మవిస్వాసము, సంస్కారపూరిత ధిక్కార స్వభావము వుండే స్త్రీ పాత్ర చిత్రణ ఆయన కథల్లో కనిపిస్తుంది.

చక్రపాణి కథల్లో వీరికి మంచి పేరు తీసుకొచ్చినవిగా 'మరమరాలు-బఠానీలు -అందులో సామ్యవాదం', 'మహాపర్వతం -మరుగుజ్జు', 'పతితపావని', 'రెండుముఖాల చంద్రుడు', 'దూలాల మీద దొడ్డరాజు', 'రురో' చెప్పుకోవచ్చు.

చక్రపాణిగారు శిల్పంలోనేకాదు కథకు టైటిల్ పెట్టడంలో కూడా ఓవినూత్న కోణం చూపిస్తారు. సుమారు ముప్పయి సంవత్సరాలుగా రాస్తూ వచ్చిన కథల్లో పదిహేనింటిని కూర్పుగా 'ధిల్లింత' అనే కథా సంపుటి ఇటీవల తీసుకొచ్చారు. అందులో 'ఇదీ స్నేహ మే', 'తాకట్టు', 'చుక్కల్లో చంద్రుడు', 'నిస్వార్థం', 'కాస్టలెస్ మామయ్య' కథలు పాఠకుల విశేష ఆదరణ పొందాయి.

వీరు కొన్ని నవలలు కూడా రాసారు. 1988లో 'వేగుచుక్క', 1991లో 'ఏడడుగులు', 1991లోనే 'గోరంత దీపం', 1995లో 'జోదలో, 1998లో 'దిగోస్ట్' నవలలు ప్రచురించబడగా, 1998లో పతితపావని, ధిల్లింత కథాసంపుటాలు వెలుగు చూసాయి. వీరు 1998 నుండి ఆంధ్రభూమి దినపత్రికలో 'కథలు-కాకరకాయలు' శీర్షిక నిర్వహిస్తున్నారు.

డాక్టర్ కాకాని చక్రపాణి కథానికలు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి పలుమార్లు ప్రసారమయ్యాయి. కథను కొత్త కోణంలో చెప్పాలని ఆరాటపడే వీరికి కథా వస్తువులన్నీ జీవితం నేర్పిన పాఠాలే. కథా కిరణాలు మన తెలుగు కథకులు సంకలన రూపంలో తీసుకువస్తున్నామని తెలిపిన వెంటనే స్పందించి రచయితగా తనవంతు సహకారాన్ని అందించిన కథకుల్లో వీరూ ఒకరు.

కాకాని చక్రపాణి గారికి కథలు రాయడమే కాకుండా, ఇతర భాషా రచనలను తెలుగులోకి అనువదిస్తూ, మిత్రులతో మాట్లాడటం తృప్తి నిచ్చేపనులు. ఇంగ్లీషు లిటరేచర్‌లోనూ, ప్రాచీన భారతదేశచరిత్ర, సంస్కృతి, పురాతత్వ శాస్త్రంలోనూ ఎం.ఏ పట్టా పుచ్చుకొని 'తెలుగు సాహిత్యంపై సోమర్‌సెట్ మామ్ ప్రభావం' అన్న విషయంమీద పరిశోధనాత్మక వ్యాసం 1998లో సమర్పించి 'డా. కాకాని చక్రపాణి' అయ్యారు. వీరు మరిన్ని మంచి కథలు తెలుగు పాఠకులకు అందించాల్సిన అవసరం ఎంతైనా వుంది.


రచయిత చిరునామా
**డా. కాకాని చక్రపాణి**
561,101 విశ్వంభర అపార్ట్‌మెంట్స్,
పద్మారావునగర్,
సికింద్రాబాద్ - 500 025

# కాలువ మల్లయ్య





కరీంనగర్‌లో ఓ మారుమూల కుగ్రామంలోని ఓడిగువ మధ్యతరగతి కుటుంబంలో **12-01-1953**లో జన్మించిన డాక్టర్ కాలువ మల్లయ్యగారు వృత్తిరీత్యా ఫెర్టిలైజర్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ రామగుండం యూనిట్ డిప్యూటీ చీఫ్ కెమిస్ట్‌గా పనిచేస్తున్నారు.

ప్రవృత్తిగా రచనా వ్యాసంగాన్ని ఎన్నుకొన్న కాలువ మల్లయ్య మొదటిసారిగా 1983లో 'వెల' కథను అచ్చులో చూసుకున్నారు. 1982-83 ప్రాంతంలో రాయడం ప్రారంభించినప్పటినుండి నేటివరకు నిర్విరామంగా రాస్తూ, సుమారు 400పైగా కథలు, 8 నవలలు, కొన్ని కవితలు, వ్యాసాలు రాస్తూ వస్తున్నారు.

తెలంగాణా ప్రాంతంలోని పల్లెపల్లెకు తిరిగిన మల్లయ్యగారు ఆ ప్రాంత 'మాండలికం'పై మంచి పట్టును సాధించారు. పల్లె ప్రజల బ్రతుకులు, కష్టాలు, వృత్తులు, సమస్యలు, మారుతున్న విలువలు సొంతంగా అనుభవించిన వీరు కథావస్తువులుగా ఆ ప్రాంతసమస్యలనే తీసుకోవటం గమనించతగ్గ విషయం.

కాలువ మల్లయ్య రాసిన 'ఊరుమ్మడి బతుకు' తెలుగుకథ. దళిత చైతన్యంతో ఇంకా ముందుకు పోవాల్సిన అవసరాన్ని గూర్చితెలిపే కథ. తెలంగాణా గ్రామాల్లో దళిత వర్గాలపై జరుగుతున్న ప్రత్యక్ష, పరోక్ష దోపిడిని వివరించే కథ. తెలుగు కథల్లో ఇంతవరకు రాని గీత కార్మికుడి బ్రతుకులోని విషాదాన్ని ఈ కథద్వారా అద్భుతంగా చెప్పారు.

కాలువ మల్లయ్య 'మమ్మీ మమ్మీ... డాడీ డాడీ!' అనే కథలో మమ్మీ డాడీల సంస్కృతి మనల్నెంతగా ముంచేస్తున్నదో తెలిపారు. ఇంగ్లీషు వాడి ఇంపీరియలిజం మనల్ని ఎంత ముంచేస్తుందో చెప్పిన కథ ఇది. గతంలో మల్లయ్య గారు బీదల పాట్లను చిత్రించిన కథలెన్నో రాసారు. 'ఆత్మవత్సర్వ భూతాని' అన్న సిద్ధాంతాన్ని విశ్వసించారు. వర్గపోరాటాన్ని కూడా సమానత్వానికి ఆశించారు.

కాలువ మల్లయ్య మరో కథ 'బాకీ బతుకులు' గ్రామాల్లో తండ్రి చేసిన స్వల్పమైన అప్పుకింద తరతరాలుగా పాలేరుగా బతికిన క్రమాన్ని రైతు కూలీల మధ్య సంబంధాలను, కాల గమనంలో వచ్చిన మార్పులవల్ల తరాలమధ్య ఏర్పడిన భావజాలంలోని అంతరాలను వివరిస్తుంది.

చాలా కథలను తెలంగాణా మాండలికంలో రాసి 'భేష్' అన్పించుకున్నారు మల్లయ్య. "పుస్తక భాషకు భిన్నంగా ఉండే మాండలికాన్ని పాఠకుడు చదివినప్పుడు ఓ చక్కటి అనుభూతిని పొందుతాడు. అంతే కాక వేరే ప్రాంత పాఠకులకు ఈ ప్రాంతంలో వాడే పదాలు గమనించే అవకాశం కూడా ఉంటుంది" అంటారు డా. కాలువ మల్లయ్య.

1983లో 'కట్నం కథలు', 1993లో 'రాజుకోడి', 1998లో 'అవ్వలోరు గిది తెలంగాణ', 'మాకథలు', 1999లో 'కాలువ మల్లయ్య కథలు'. 1982లో 'కవితాసౌరభం', 1983లో 'కవితాఝురి' 'కవితా సంపుటాలు' వెలుగు చూసాయి. వీరి కథలకు లెక్కకు మించి బహుమతులు, సన్మానాలు అవార్డులు లభించాయి.


రచయిత చిరునామా
కాలువ మల్లయ్య
బి-37, ఫర్టిలైజర్ సిటీ,
కరీంనగర్ జిల్లా - 505 210.



# కాటూరు రవీంద్ర త్రివిక్రమ్

"సాహిత్యం మత్తును విడగొట్టాలి తప్ప, మత్తును కలిగించకూడదు. భావకాలుష్యానికి గాక భావ పటిమకు మనోలాలిత్యానికి, మానవత్వానికి ప్రేరణ కలిగించటానికి సాహిత్యం ఉపయోగపడాలి" అంటారు ప్రముఖ కథా రచయిత కాటూరు రవీంద్ర త్రివిక్రమ్.

సాహిత్య కులపతి కాటూరు వేంకట సుబ్బారావు గారైన వీరి తండ్రే, రవీంద్ర త్రివిక్రమ్‌కు సాహిత్య గురువులు.

విజయవాడ లోనే పుట్టి, పెరిగి, ప్రస్తుతం నివసిస్తున్న త్రివిక్రమ్ వృత్తిరీత్యా 1964 సం.లో భారతవైమానిక దళంలో 'ఎలక్ట్రానిక్స్' విభాగంలో చేరి, రెండు యుద్ధాల్లో (1965, 1971) పాల్గొన్నారు. 1979 డిసెంబరులో ఉద్యోగవిరమణచేసి, 1981లో పంజాబ్‌నేషనల్ బ్యాంక్‌లో చేరారు. ప్రస్తుతం వాలెంటరీ రిటైర్ మెంట్ తీసుకొని లాయర్‌గా ప్రాక్టీసు చేస్తున్నారు.

కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ తొలిరచన 1955లో వెలుగు చూసింది. అప్పట్నుంచీ నిర్విరామంగా కథలు, నాటికలు, కవితలు, గేయాలు, వ్యాసాలు, నవలలు రాస్తూ వచ్చారు. ఇప్పటి వరకు కొన్ని వందల కథలు వివిధ ప్రముఖ పత్రికల్లో ప్రచురించబడ్డాయి.

కాటూరు రచించిన కథల్లో గొడుగు (ఆంధ్రపత్రిక) 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' (జాగృతి), 'ఎలుగెత్తి జై కొట్టు తెలుగోడా' (జాగృతి) కథలు విశేషంగా పేరు ప్రఖ్యాతలు తీసుకురావటమే కాకుండా, వీటన్నిటికీ బహుమతులు లభించాయి.

1960లో ఆకాశవాణిలో అడుగుపెట్టి 'కథానికలు', 'నాటికలు' శ్రోతలకు అందజేస్తున్నారు. 1999 సం.లో ఆకాశవాణి నాటక పోటీల్లో వీరి రచన "జురాహవం" హాస్యనాటకానికి జాతీయ అవార్డు లభించింది. ఈ అవార్డు క్రింద ఆకాశవాణి వీరికి రూ 10,000 బహుమతి అందజేసి గౌరవించింది.

త్రివిక్రమ్ గారు కథ, నాటక రచనతో పాటు నవలా ప్రక్రియలో కూడా గొప్ప పేరు సంపాదించారు. జగన్నాటకం, వెలుతురు మంటలు, పరిష్కృతి, ఆకాశదీపాలు నవలలు వీరివి వెలుగు చూసి తెలుగు సాహితీ ప్రియుల మన్ననలందుకున్నాయి. ప్రస్తుతం మరో నవల 'గిరిజన్' ప్రచురణలో ఉంది.

త్రివిక్రమ్ గారి నాటకం 'ప్రగతి భారతం' టి.వీ. సీరియల్‌గా ప్రసారమైంది. 'అస్తదేవతలు' అనే నాటిక దూరదర్శన్‌లో శ్రీ ఆచంట వెంకటరత్నం నాయుడు, శ్రీ బాలాజీ నాయుడు గార్ల పాత్రధారణలతో ఇటీవలె ప్రసారమైంది. పద్యరచనతప్ప సాహిత్యంలో అన్ని ప్రక్రియలూ విజయవంతంగా చేయగలిగిన త్రివిక్రమ్ రెండు హరికథలు, బుర్రకథలు కూడా రాసి 'భేష్' అనిపించుకున్నారు.


రచయిత చిరునామా
**కాటూరు రవీంద్ర త్రివిక్రమ్**
41-16-42, కాటూరి వారి స్ట్రీట్,
కృష్ణలంక, అగ్రహారం,
విజయవాడ - 520013.



# కె.ఆర్.కె.మోహన్

18-01-1933లో 'మచిలీపట్నం' నందు జన్మించిన శ్రీ కె.ఆర్.కె.మోహన్ ఆంధ్ర యూనివర్సిటీ నుండి బి.ఏ.డిగ్రీ పొందారు. 1953లో పోస్టల్ శాఖలో చేరి 1991 లో హెడ్ పోస్టుమాస్టర్‌గా పదవీ విరమణచేసారు.

కె.ఆర్.కె.మోహన్ తొలిక థానిక 'అనుబంధం' 1962 ఆంధ్రపత్రిక దీపావళి పోటీలలో ద్వితీయబహుమతి పొందింది. రెండవ కథానిక 'గాలివాన' 1963 'జాగృతి' దీపావళి పోటీలలో రెండవ బహుమతి పొందింది. అప్పటినుండి సుమారు 300పైగా కథలు వివిధ పత్రికలలో తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రచురించబడ్డాయి. వివిధ రచనలకు ఇప్పటికీ 46 బహుమతులు వచ్చాయి.

1976 ఇంటర్నేషనల్ పి.ఎన్. (కొరియా) వారు అన్ని ఆసియా దేశాల నుంచి ఎంపిక చేసిన రచనలను 'ఆసియన్ లిటరేచర్' అన్న గ్రంధంలో ప్రచురించారు. అందులో భారత దేశం నుంచి ఎంపిక చేసిన ఐదు కథలలో కె.ఆర్.కె.మోహన్ రచించిన 'ది గాడ్‌పర్సెకన్' అన్న కథ ఒకటి. మిగిలిన నలుగురు జ్ఞానపీఠ అవార్డు విజేతలే. తకళి శివశంకర పిళ్ళై (మళయాళం), గులాబ్‌దాస్ బ్రోకర్ (గుజరాత్), పంచాక్షరి హిర్వేద్ (కన్నడ), రవి.ఎస్.వర్మ (హింది), పాలగుమ్మి పద్మరాజు 'గాలివాన' తర్వాత అంతర్జాతీయ స్థాయిలో ఎంపికైన తెలుగు కథ ఇదే. దీని మాతృక మోహన్ రచించిన 'దైవపక్షులు' అన్న తెలుగు కథానిక. ఒక్కటేమిటి ఎన్నో కథానికలు, కవితలు వీరివి తెలుగులోనేకాదు. ప్రపంచ భాషలకు చెందిన పలుపత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. 'విక్టోరియాశేషప్పయ్యర్' అనే వీరి కథ మన పురాణాలకు కావ్యాలకు వక్రభాష్యాలు చెప్పటం ఆ వక్రీకరణలను వ్యాపించచేయటం తప్పని హెచ్చరిస్తుంది. ప్రాచీన సాహిత్యాన్ని మన తెలివితేటలతో కల్తీ చేయకుండా సరిగా అర్థం చేసుకుంటూనే దాని ఔన్నత్యం తెలిసి వస్తుందని తెలియ చెప్పే కథ.

1971లో కె.ఆర్.కె.మోహన్ రచించిన 'వక్రించిన సరళరేఖలు' ఉర్దూఅనువాదం 'రోషన్‌సాయె'కి భారత ప్రభుత్వ విద్యాశాఖ వారి జాతీయ బహుమతి లభించింది. ఈ ఉర్దూ అనువాదాన్ని ఎ.పి. ఉర్దూ అకాడమీప్రచురించింది. ఇదే నవల 'వక్రసి దరేఖెగాలు' అన్న పేరుతో కన్నడంలో అనువాదమై 'సొగసు' పత్రికలో ప్రచురించబడింది. ఈనవల ఆధారంగానే నటశేఖర కృష్ణను పరిచయం చేసిన 'తేనె మనసులు' చిత్రం ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వంలో నిర్మితమైనది.

కె.ఆర్.కె.మోహన్ తెలుగులో సైన్సుఫిక్షన్ అత్యధికంగా రాసినవారిలో ఒకరు. ఆయన రెగ్యులర్‌గా ఆకాశవాణినుంచి అందించే శాస్త్రీయ రూపకాలు, ప్రసంగాలు, సైన్సుఫిక్షన్ నాటికలు బహుళ ప్రశంసలు పొందాయి. 2002అక్టోబర్‌లో వీరు రాసిన 'హాస్య కథలు' పుస్తకం విడుదలైంది.

దూరదర్శన్‌లో పలు సాహిత్య కార్యక్రమాలు ఇచ్చిన మోహన్ సాహిత్య కృషిని గుర్తించి 1996లో కలకత్తాలోని ఇండియన్ బోర్డ్ ఆఫ్ ఆల్టర్‌నేటింగ్ మెడిసిన్ వారి డాక్టరేట్ లభించింది.

*రచయిత చిరునామా*
*కె.ఆర్.కె.మోహన్*
*ఇం.నెం.11-19, ప్లాట్.నెం.101,*
*పి.టి.కాలని, మెయిన్‌రోడ్, దిల్‌సుఖ్‌నగర్,*
*హైదరాబాదు - 500 650.*



# కె.కె. మీనన్

కె.కె. మీనన్ వృత్తిరీత్యా ఎకౌంటెంటు జనరల్, ఆంధ్ర ప్రదేశ్ హైదరాబాదులో అసిస్టెంటు అకౌంట్సు ఆఫీసరుగా పదవీవిరమణచేసి యిప్పుడు కథారచనపై మరింత ఆసక్తి చూపిస్తున్నారు.

తూర్పు గోదావరి జిల్లా మలకిపురం మండలం, 'రామరాజులంక' లో 18-03-1938 న జన్మించిన "కానేటి కృష్ణమూర్తి' గారు 'కె.కె.మీనన్' పేరుతో కథలు రాస్తూ తెలుగు కథా సాహిత్యంలో తనకంటూ ఓ ప్రత్యేకస్థానాన్ని ఆక్రమించుకున్నారు. వీరు రాజకీయ కుటుంబం నుంచి వచ్చారు.

ప్రవృత్తిరీత్యా సాహిత్య పఠనమన్నా, రచనావ్యాసంగమన్నా ఎనలేని ప్రీతి. వీరివి రెండు కథాసంకలనాలు వెలుగు చూసాయి. అవి, ఒకటి 'ఇది స్ట్రీకింగ్ కాదు', కాగా 'పులికూడు' రెండవది. ఈ రెండు కథా సంకలనాలు వీరికి మంచి పేరు తీసుకొచ్చాయి. ఇవికాక పత్రికలలో ప్రచురితమైన కథలు ఎన్నో వున్నాయి. రేడియో కథానికలు, నాటికలు రచించారు. కె.కె.మీనన్ నవలా రచనలో కూడ ప్రసిద్ధులు. 'బాకీ బతుకులు.', 'క్రతువు' నవలలు విశాలాంధ్ర పత్రికలో ప్రచురితం కాగ, 'రాగతరంగాలు' స్వాతి మాస పత్రిక లో 'ప్రతిధ్వని' చతుర మాస పత్రిక లో 'భగ్న ప్రతిమలు' ఉదయం వార పత్రికలో వెలుగు చూసాయి.

కె.కె. మీనన్ ఎన్నో బహుమతులు కథారచనలో అందుకున్నారు. వీరి 'ఎర్ర త్రికోణం' కథకి రంజని బహుమతి, 'ఇది స్ట్రీకింగు కాదు' ఆంధ్రజ్యోతి బహుమతి, 1993 లో తెలుగు విశ్వవిద్యాలయం బహుమతి పొందారు.

కె.కె.మీనన్ గారి అవతలి గట్టు చక్కని శైలి, హృద్యమైన వర్ణనలు, విషయ, సామాన్యమైనదే అయినా నిర్వహణ రమ్యముగా ఉంది.

కె.కె. మీనన్ ఎన్నో బహుమతులు కథారచనలో అందుకున్నారు. వీరి 'ఎర్రత్రికోణం కథకి రంజని బహుమతి', 'ఇది స్ట్రీకింగు కాదు' కథకి ఆంధ్రజ్యోతి బహుమతి, 1993లో తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతి పొందారు.

"మంచి రచన చేయాలంటే మంచి భాష నేర్చుకోవాలి. కథను క్లుప్తంగా చెప్పాలి. ఎత్తుగడ, ముగింపు ఎలా చెప్పాలన్నది శైలి. కథ కన్నాశైలి, ముఖ్యం" అంటారు కె.కె.మీనన్.

కథ, నవలా రచయితగా కొన్ని దశాబ్దాలుగా పాఠకుల ఆదరాభిమానాలను అందుకొంటున్న కె.కె.మీనన్ 'క్రతువు' నవలతో మంచి సంచలనాన్ని సృష్టించారు. అటు విజ్ఞాన శాస్త్రానికి, ఇటు మానవ సహజ ప్రవృత్తికి సమన్వయ హేతువుగా నిర్మించిన ఈనవల, ధారావాహికంగా వస్తున్నప్పుడే ప్రముఖ సాహితీ వేత్తలతో పాటుగా సాధారణ పాఠకులను కూడా ఆకట్టుకుంది.

ఒకవైపు అతికీలకమైన శాస్త్రవిషయాలను సామాన్య పాఠకుడికి అర్థమయ్యేరీతిలో సాధ్యమైనంత సరళంగా వివరిస్తూనే, ఇంకొకవైపు కథాగమనంకాని, పాత్రల వ్యక్తిత్వం కాని దెబ్బతినకుండా ఉదాత్తంగా ఉత్కంఠ కల్గించేలా నైపుణ్యంతో రచించారు. మనం కె.కె.మీనన్ నుంచి మరిన్ని మంచి కథానికలు, నవలలు ఆశిద్దాం!

రచయిత చిరునామా
కె.కె. మీనన్
'స్మిత', 15, కాకతీయనగర్,
హైదరాబాదు - 500 008.



# కె.కె. రఘునందన



విజయనగరం జిల్లా నెల్లిమర్ల మండలంలోని 'రామతీర్థం'లో జన్మించిన కథా రచయిత శ్రీ కె.కె. రఘునందన వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు. ప్రవృత్తిరీత్యా కథా రచయిత.

సాహిత్య ప్రక్రియల్లోకెల్లి అతికష్టమైన బాలసాహిత్యంలో వీరికి ప్రవేశముంది. సుమారు 125 బాలల కథలు రాసి ఎంతోమంది చిన్నారులకు దగ్గరయ్యారు కె.కె. రఘునందన.

విజయ మాస పత్రికలో, 1979 ఫిబ్రవరి సంచికలో కె.కె. రఘునందన తొలికథ 'పాపం రాజిగాడు' ప్రచురింపబడింది. అప్పటినుండి ఒక ప్రక్క బాలసాహిత్యం, మరో ప్రక్క సాంఘీక కథలు రాస్తూ తన కలానికి మరింత పదును పెడుతున్నారు. ఇప్పటివరకు సుమారు 200పైగా సాంఘీక కథలు రచించిన ఎన్నో సాహితీ సన్మానాలు, బహుమతులు, మన్ననలు పొందటమేకాకుండా విజయనగరం జిల్లా రచయితల సంఘానికి ప్రధాన కార్యదర్శిగా వ్యవహరిస్తున్నారు.

కె.కె. రఘునందన గారి 'రెండో రిటైర్‌మెంట్' సందేశాత్మక కథ. ఉద్యోగమున్నాళ్ళు లంచాలతో పీడించిన ఒక వ్యక్తి రెండో రిటైర్‌మెంట్ (మరణం) నాటికి సామాన్యుడిగా మారిన తీరు కథ చివరలో బావుంటుంది. వీరి కథల్లో చక్కటి కొసమెరుపు వుంటుంది. మరో కథ 'పుణ్యానికిపోతే'లో మంత్రిగారి బంధువైన కథానాయకుడు 'పుణ్యానికిపోతే', ఆ మంత్రిగారి రాజకీయాలలో చిత్తయిపోతాడు. తగునా దినాధా సమాజంలో ఉండే అన్ని విషయాలకు రియాక్టు అయ్యే వ్యక్తి కథ. హాస్య కథనంతో సాగుతుంది. ప్రపంచంలో మనకళ్ళ ఎదుట ఎన్నో విషయాలు అన్యాయాలుగా, అక్రమాలుగా కన్పించవచ్చు. కానీ అంత మాత్రం చేత ప్రతి విషయాన్ని పట్టించుకుంటే మనకు జగమంతా శత్రుమయంగా కన్పిస్తుంది అంటూ వివరించారు.

ఒకవైపు పెద్దవారికి సాంఘీక కథలు, పిల్లల కోసం బాలల కథలు రాస్తూ, మరోవైపు ఉత్తమ ఉపాధ్యాయుడిగా పలువురి మన్ననలు పొందారు. కె.కె. రఘునందన 'బాలజ్యోతి' కథలపోటీల్లోనూ బహుమతులు అందుకున్నారు.

కథారచనతోపాటు నవలా సాహిత్యంలో కూడా ప్రవేశమున్న రఘునందన, ఆంధ్రపత్రికలో 'హిందోళ' అనే నవలను డైలీసీరియల్‌గా పాఠకులకు అందించారు. వీరి నవల 'సావేరి' 'యువ' అనుబంధ నవలగా వెలుగుచూసింది. ఈ మధ్య నాటకరచనపై అమితాశక్తిచూపుతున్న రఘునందన, అందులోనూ విజయం సాధించారు. ఇటీవల 'గోడు' అన్న వీరి నాటిక విజయ నగరంలో జరిగిన నాటక పరిషత్ పోటీల్లో రెండుసార్లు 'ఉత్తమ రచన' అవార్డు సాధించింది. దాదాపు అన్ని పత్రికల్లోనూ విరివిగా వీరి కథలను మనం గమనించవచ్చు.

మంచి శిల్పచాతుర్యతతో, సరళమైన శైలిలో కథను చెప్పి, చెప్పిన దానిని తేలికగా చదివించగలిగిన కథ, మంచి కథ అనిపించుకుంటుంది. అటువంటి కథలు ఎన్నో కె.కె. రఘునందన కలం నుంచి జాలువారాయి. మరిన్ని రీడబులిటీ ఉన్న కథలు వీరి నుంచి మనం కోరుకుందాం!

రచయిత చిరునామా
కె.కె. రఘునందన
రామతీర్థం (పోస్ట్), నెల్లిమర్ల మండలం,
విజయనగరం జిల్లా - 535 218.



# కె.వి. నరేందర్

కరీంనగర్ జిల్లా గొల్లపెల్లి మండలం 'చిల్వాకోడూర్' గ్రామంలో కందుకూరి వెంకట రెడ్డి, సుశీలకు చిన్న కుమారుడుగా జన్మించిన తెలంగాణా యువ కథకుడు కె.వి. నరేందర్.

నరేందర్‌కు ఎనలేని శక్తి, స్పందించే గుణం మెండుగా వున్నాయి. తన విద్యాభ్యాసమంతా జగిత్యాల లోనే జరగటంతో ప్రతి కథానికలోనూ జగిత్యాల తదితర ప్రాంతాల పేర్లు వాడుతూ, తన ప్రాంతానికి పేరు తీసుకు రావాలని ప్రయత్నిస్తుంటారు.

కథారచయితగానే కాకుండా, నవలా రచయితగా, టీ.వీ.రచయితగా మంచి గుర్తింపు పొందిన నరేందర్ మొదటి కథ జగిత్యాల నుండి వెలువడే చాటింపు అనే పత్రికలో 'నిరీక్షణ' టైటిల్ తో ప్రచురించబడింది. ఇప్పటివరకు నరేందర్ సుమారు 150 కథలు ప్రచురించారు. పల్లకి, ఉదయం, స్వాతి, ప్రభ, స్రవంతి, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి వీక్లీలలో నరేందర్ కథలు విరివిగా ప్రచురించబడ్డాయి.

నరేందర్ కథలు కేవలం పత్రికలకే పరిమితంకాలేదు. కన్నడ, తమిళ, మళయాళ, ఒరియా భాషల్లోకి కూడా అనువదింపబడ్డాయి. నరేందర్ కథల్లోని ముప్పయ్ కథల్ని ఎన్నుకొని విజయవాడ జె.పి.పబ్లిషర్స్ 'మనోగీతం' కథల సంపుటిగా ప్రచురించారు. జిల్లా, రాష్ట్రస్థాయిలో పదమూడు అవార్డుల్ని అందుకున్న మనోగీతం పుస్తకం కరీంనగర్ కవితా సాహిత్యంలో సంచలన కెరటంలా ఎగసిపడింది. 'ఆకురాలిన వసంతమై' అనే కథ 'బొమ్మ' పేరుతో టెలీఫిల్మ్‌గా రూపొందించటం విశేషం. నరేందర్ కథా సంపుటాలు 'అమ్మ', 'నాన్న', 'బురదలో జాబిల్లి', 'యుద్ధం' పాఠకుల విశేష ఆదరణ పొందాయి.

టెస్ట్ ట్యూబ్ బేబీలపై వున్న అపోహల్ని తొలగిస్తూ 'ఉదయం' దినపత్రికలో కె.వి.నరేందర్ రాసిన నవల 'బేబీ ఓ బేబీ' 36 వారాలు ప్రచురించబడింది. ఈ నవలకు 'ఉత్తమ సైన్సు' నవలగా పలుసాహితీ సంస్థలు గుర్తించి వీరికి అవార్డు అందించారు. బెంగుళూరుకు చెందిన ప్రముఖ కన్నడ రచయిత 'శారద తనయ' బేబీ ఓ బేబీ ని కన్నడంలోకి అనువదించటం విశేషం.

ప్రముఖ టి.వీ. ఛానల్ ఈనాడు టెలివిజన్ లో నరేందర్ 280 ప్రోగ్రామ్‌లకి స్క్రిప్ట్ రాసారు. ప్రవృత్తి రీత్యా ఉపాధ్యాయుడైన నరేందర్ '1998 ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు' అందుకొని బోధనా రంగం లోనూ ప్రతిభ కనపరిచారు.

కె.వి. నరేందర్ కథలు మెరుపుతీగల్లా వుంటాయి. టీ.వీ., సినిమా, సాహిత్యరంగాల్లో తనసత్తా ఏమిటో, స్థానమేమిటో పరీక్షించుకోవాలన్న తపన నరేందర్‌లో అధికం. మానవీయ అంశాల్ని పట్టుకోవడంలో క్రమంగా పట్టుసాధిస్తున్నారు. తనకేమీ అసాధ్య కావని నిరూపిస్తున్నారు.

రచయిత చిరునామా
కె.వి. నరేందర్
చిల్వాకోడూర్, గొల్లపల్లి మండలం,
కరీంనగర్ జిల్లా - 505532.



## కె.యన్.పలమనేరు బాలాజీ

మనిషి గురించి మనస్సుతో విశ్లేషించడం కొందరికి మాత్రమే సాధ్యం. అలాంటి అరుదైన కథకుడు కె. యన్. పలమనేరు బాలాజీ. చిత్తూరుజిల్లా 'పలమనేరు'లో జన్మించిన బాలాజీ 'పి. మంజరి' అనే కలం పేరుతో కొన్ని కథలు రాసారు.

"మనిషి కాలం చేతిలో చిక్కిన సీతాకోకచిలుక... మనిషి ముఖం నిండా బాధ తాలూకు మచ్చలే ఇందుకు ఉదాహరణ" అంటూ మనిషిని మనోహరంగా వీరు వివరిస్తారు.

బాలాజీ రాసిన కథలు పలుపత్రికల్లో అచ్చయినాయి. ఎగురలేని విహంగం, నిరీక్షణ, ప్రవహించే జ్ఞాపకం, శీనూ గుడ్‌నైట్, ఎంతెంత దూరం, మూడోమనిషి, ప్రయాణం, మలుపు, కొత్తనడక, అయినా వసంతం కోసం, జీవితం, కథలు బాలాజీకి మంచి పేరు తీసుకొచ్చాయి.

మలుపుకథలో "ప్రపంచంలో ఏదీ శాశ్వతమైనది కాదు. మార్పు ఒక్కటే శాశ్వతం. నువ్వు మారాలి, నీ అభిప్రాయం మార్చుకోవాలి. నేను చావుకు భయపడేవాడ్నికాను. ఎంతకాలం బ్రతికామనేది ముఖ్యం కాదు, ఎంత నిర్మలంగా, ఎంత ఆనందంగా వున్నామనేది ముఖ్యం" అంటారు.

ఎంతెంత దూరం? అనే కథలో "ప్రేమతో నింపాల్సిన ఇంటిని పరికరాలతో నింపేస్తూ మనుషుల మధ్య దూరాన్ని పెంచుకుంటూ ఎటో వెళ్ళిపోతున్నాం. ఇరుకుగదులు, ఇరుకు మనసులు ప్రేమించడం ఎంత ముఖ్యమో, ప్రేమను వ్యక్తం చేయడం కూడా అంతే అవసరమని ఎంతమందికి తెలుసు?" అని వీరు ప్రశ్నిస్తారు.

బాలాజీ మొదటి కథ 1991లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రచురింపబడింది. వీరి అభిమాన కథారచయితలు సొదా, పాపినేని శివ శంకర్, చాసో. వీరి అభిమాన విమర్శకుడు వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారు. 'ఆకాశవాణి తిరుపతి కేంద్రం' నుండి వీరి కథానికలు పలుమార్లు ప్రసారమయ్యాయి.

రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ, రాష్ట్ర సాంస్కృతిక మండలి సంయుక్తంగా నిర్వహించిన 'నవరచయితల అధ్యన శిబిరం- విమర్శ'కు చిత్తూరు జిల్లా నుంచి ఎన్నిక కాబడి హైదరాబాదులోని బోట్స్‌క్లబ్బులో 15 రోజుల పాటు ప్రముఖ విమర్శకులతో అభిప్రాయాలు పంచుకున్నారు. కథా రచనతో పాటు విమర్శలో కూడా ప్రవేశమున్న వీరు ప్రముఖ విమర్శకులు వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారి సలహాలు స్వీకరిస్తుంటారు. వీరి శ్రీమతి కూడా కథా రచయిత్రి కావడం చేత ఆవిడ సహకారం కూడా వీరు తీసుకుంటున్నారు.

"నేను నా జీతంలో సగం డబ్బులు పుస్తకాలు కొనటానికే ఖర్చుపెడతాను" అనే బాలాజీ బైరెడ్డిపల్లి ఎమ్.పి.డి.ఓ. కార్యాలయంలో జూనియర్ అసిస్టెంట్‌గా పనిచేస్తున్నారు. "ఉత్తమ సాహిత్యకారుడి ముఖ్య కర్తవ్యం మంచి 'జీవన విధానం'" అని నమ్మే వీరికి సాహిత్యంలో మంచి భవిష్యత్ అంగీకరించక తప్పదు.

రచయిత చిరునామా
కె. యన్. బాలాజీ
డో.నెం. 6-63, గుడియట్టాం రోడ్,
పలమనేరు - 517408..
చిత్తూరు జిల్లా.





# కొలకలూరి ఇనాక్

ఒకవైపు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్స్‌లర్‌గా మరోవైపు ఉత్తమ కథారచయితగా కీర్తి గడించిన కొలకలూరి ఇనాక్ గారి 'ఊరబావి' కథాసంపుటి ఓ వెలుగు వెలిగింది.

సృజనాత్మకత రచయితగా గుర్తించబడ్డ కొలకలూరి ఇనాక్ కథానిక, నవల, కవిత, నాటక, వ్యాస ప్రక్రియలన్నీ చేపట్టారు. కొందరు ఏదో ఒక సాహిత్య ప్రక్రియలోనే రచనలు సాగిస్తారు. కొందరు రెండు, మూడు ప్రక్రియల్లో ప్రవేశించి దేనికీ న్యాయం చేయలేకపోతారు. కానీ, కొలకలూరి ఇనాక్‌గారు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలకు చక్కటి న్యాయాన్ని చేకూర్చారు.

కొలకలూరి ఇనాక్ ఇప్పటివరకు ఐదు కథాసంపుటాలు ప్రచురించారు. 1960లో 'గులాబి నవ్వింది', 1969లో 'భవాని', 1976లో 'ఇదా జీవితం', 1983లో 'ఊరబావి', 1989లో 'సూర్యుడు దళితుడు' వీరికి గొప్పకథారచయితగా పేరు తీసుకొచ్చాయి. దీనిలో 1983లో వీరు ప్రచురించిన 'ఊరబావి' కథా సంపుటికి 1986లో, తెలుగు యూనివర్సిటీ సాహిత్య అకాడమీ వారు అవార్డు ఇచ్చి గౌరవించారు.

కొలకల్మూరి ఇనాక్ కొన్ని నవలలు కూడా రాసారు. 1960 లో 'సమత', 1961లో 'అనంత', 1968లో 'సౌందర్యవతి', 1966లో 'సౌభాగ్యవతి', 1969లో 'ఎక్కడుంది ప్రశాంతి' 1972లో 'రెండుకళ్ళు-మూడుకళ్ళు' ప్రచురించారు. వీటిలో 1961లో ప్రచురించిన 'అనంత' నవలకు ఆంధ్రప్రదేశ్ వీక్లీవారి అవార్డు లభించింది.

వృత్తిరీత్యా ఉపన్యాసకుడిగా, ప్రొఫెసర్‌గా, వైస్ ఛాన్స్‌లర్‌గా ఉన్న కొలకలూరి ఇనాక్ కథల్లోకూడా నేర్పరి అయిన కథకుడితోపాటు, బోధకుడూ స్పష్టంగా కనిపిస్తాడు. అందుకే ఆయన కథలు, రచయిత ఎదుట నిలబడి మాట్లాడుతూ ఉన్నట్లు ఉంటాయి. కథల్లో రకరకాల మెలికలు పెట్టి చివరికి పెద్ద మెలికతో కథను సమాప్తం చేస్తారు. అందరికీ తెలిసిన అంశాన్ని తిరగేసి చెప్పటం వీరి కథాశిల్పంలో మరో లక్షణం. కథ చెప్పటంలో సంభాషణలో శ్లేష, వ్యంగం, చమత్కారం పుష్కలంగా వుంటాయి. వీరి ఇనాక్ గారి 'ప్రయాణం' కథ పాఠకులని విశేషంగా ఆకర్షించినది. ఈ కథలో మానవ స్వభావాన్ని అద్భుతంగా చిత్రీకరిరంచినారు. ఇద్దరి ప్రయాణికుల మధ్య నడిచే కథ ఇది.

కొలకలూరి ఇనాక్ కొన్ని నాటికలు కూడా రాసారు. వీరు 1983లో రాసిన 'మునివాహనుడు' నాటిక తమిళ, కన్నడ, హిందీ బాషల్లోకి కూడా అనువదించబడినది. ఈ నాటికకు అవార్డులు కూడా లభించాయి. మరో నాటిక 1963లో రాసిన 'జైహింద్'కు కూడా అవార్డులు లభించాయి. 1960లో వీరు తీసిన 'దిష్టి' నాటికల సంపుటికి ఆకాశవాణివారి అవార్డు లభించింది. ఇంకా ఎన్నో కథానికలు వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి. ప్రచురించబడుతూనే ఉన్నాయి.

రచయిత చిరునామా
**ప్రొఫెసర్ కొలకలూరి ఇనాక్**
వైస్ ప్రెసిడెంట్,
శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ,
తిరుపతి - 517 502.







# కొత్త రవీంద్రబాబు

**1987** ఆంధ్రభూమి వారపత్రిక ఉగాది నవలల పోటీల్లో 'మొగలిపువ్వంటి' నవలకు మొదటి బహుమతి లభించింది. ఈ నవల ఆ రోజుల్లో ప్రముఖ రచయితల, పాఠకులమన్ననలు అందుకొని కొత్త రవీంద్రబాబు గారికి విశేష కీర్తినార్జించిపెట్టింది.

గుంటూరు జిల్లా తెనాలి తాలుకాలోని 'కొత్తపేట' కు చెందిన డా. కొత్త రవీంద్రబాబు గారు వైద్యులుగా ఎంత ప్రముఖులో, సాహిత్యరంగంలో కూడా అంతగా గుర్తించబడ్డారు. వృత్తిరీత్యా వైద్యులుగా రోగులకు సేవచేస్తూ మరోవైపు కథకులుగా తన కథల ద్వారా సమాజసేవచేస్తూ ఆరోగ్యవంతమైన వాతావరణాన్ని సృష్టిస్తున్నారు.

డా. కొత్త రవీంద్రబాబు రచనా వ్యాసంగం 1981 జూన్‌లో మొదలయింది. అప్పటినుండి వేయి కథలు, 35 నవలలు రచించారు. అయితే ఎక్కువగా సీరియల్స్, వందకు పైగా పుస్తక పరిచయాలు, వందకుపైగా రివ్యూలు, రేడియో నాటికలు, రేడియో వ్యాసాలు-విజ్ఞాన విషయకంగా సాహిత్యపరమైనవి, చారిత్రక విషయ ప్రధానమైనవి, మెడికల్ టాపిక్స్ మీద సర్జన్ సలహాలుగా, 'ప్రశ్నలు-జవాబులు' శీర్షికలు నిర్వహించారు.

డా. కొత్త రవీంద్రబాబు గారి కథలు అన్ని ప్రముఖ వార, మాస, దిన పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. ఆంధ్రజ్యోతి డైలీలో 7 సంవత్సరాలు, ఆంధ్రపత్రికలో, ఆంధ్ర జ్యోతి, ఆంధ్ర భూమి వీక్లీస్‌లో 'ప్రశ్నలు-జవాబులు' శీర్షిక 6 సంవత్సరాలు నిర్వహించి వైద్యుడిగా, సాహిత్యకారుడిగా ఎనలేని సేవలందించారు.

1983 'దీపావళి'కి ఆంధ్రజ్యోతి వారపత్రిక వారి నవలల పోటీలో 'డాక్టర్ ఇన్ లవ్' ఉత్తమ ప్రణయ నవలగా ప్రథమ బహుమతి పొందింది. అలాగే 1985లో ఆంధ్రజ్యోతి వార పత్రిక 'ఉగాది' నవలల పోటీల్లో 'బెస్ట్ సస్పెన్స్ థ్రిల్లర్' గా 'అమృత కలశం' నవలకు ప్రథమ బహుమతి లభించింది.

కథలు, నవలలు రాయటమేకాదు రాయాలని ఉత్సాహమున్న యువతకు వీరు ప్రోత్సాహం అందించేవారు. వివిధ సాంస్కృతిక, సాహిత్య సంస్థలు నిర్వహించిన కథల, నవలల పోటీలకు, వివిధ వార పత్రికలు నిర్వహించిన కథల పోటీలకు ఎన్నోసార్లు జడ్జిగా బాధ్యతలు స్వీకరించారు.

ఇటీవలి కాలంలో డాక్టర్ కొత్త రవీంద్రబాబు వృత్తి రీత్యా బిజీగా వుంటూ కథా రచనలను కొనసాగించటంలో అంతగా ఆసక్తి చూపటం లేదనిపిస్తుంది. వైద్యపరమైన ఎన్నో కేసులను అవలీలగా ఎదుర్కొనే వీరు నేటి పాఠకుల కొరకు ప్రత్యేకంగా వైద్య పరమైన సమస్యలను కథా వస్తువులుగా తీసుకొని తనదైనశైలి, శిల్పంతో ఓ కథా సంపుటిని తీయాల్సిన అవసరం ఎంతైనా వుంది. వృత్తి రీత్యా వైద్యుడు ప్రవృత్తిరీత్యా కథకుడు ఐన కొత్త రవీంద్రబాబు గారికి ఇది ఏమాత్రం అసాధ్యం కాదు.


రచయిత చిరునామా

**డా. కొత్త రవీంద్రబాబు**

దేవినర్సింగ్ హోం,

తెనాలి - 522201.



## కోలపల్లి ఈశ్వర్

'కోల్లపల్లి కొసమెరుపులు' పేరిట 'జయంతి' మాసపత్రికలో కొసమెరుపు కథలు రాసి, తెలుగు పాఠకులను విశేషంగా ఆకట్టుకున్న కోలపల్లి ఈశ్వర్ గారు వృత్తిరీత్యా నెల్లూరులో వస్త్రవ్యాపారం చేస్తూ సుమారు 160 కథలకుపైగా సాహితీ ప్రియులకు అందించారు.

మనకున్న కొద్దిమంది 'హ్యూమర్ రచయిత'ల్లో కోలపల్లి ఈశ్వర్ ప్రముఖులు. "కథ సరదాగా నవ్వుకోటానికే..!" అంటారు కోలపల్లి. హాస్యంతో పాటు ఓ చక్కటి సందేశం, కొసమెరుపు వీరి కథల్లో తప్పక కనిపిస్తుంది.

'హరిశ్చంద్రుడు అబద్ధమాడితే' అన్న వీరి నవల 'ఏప్రిల్ 1 విడుదల' అన్న పేరుతో సినిమాగా వచ్చింది. దాన్ని 'వంశీ' డైరెక్టు చేసాడు.

'భూమి' మంత్లీలో వస్తున్న కోలపల్లి సీరియల్ 'నిను వీడని నీడను నేనే' వీరికి మంచి పేరు తెచ్చిపెడుతున్నది. అలాగే 'జనగర్జన' మాసపత్రికలో వస్తున్న 'ప్రేమవిందుకు వేళయ్యింది' కామెడి సినిమా సీరియల్ మంచి రెస్పాన్స్‌తో సాగుతుంది.

ఆకాశవాణిలో వచ్చిన 'సోడాబుడ్డి కళ్ళద్దాలబ్బాయ్', 'వంట వాడు కావలెను' నాటికలు కోలపల్లికి ప్రత్యేక గుర్తింపును తీసుకొచ్చాయి. వీరి కథలు చదివితే కథ చదివినట్లనిపించదు. ప్రేమతో కబుర్లు చెప్పినట్లుంటుంది.

కోలపల్లి కథలు లోతుగా పరిశీలిస్తే హాస్యమే కనిపిస్తుంది. కథచదువుకొని ఆ రోజుకు తృప్తిగా గడపొచ్చు. విచారంతో ఉన్న వారు వీరి కథచదివి ఆనందంగా ఉండొచ్చు. 'శనిగాడిచావు', 'విషకన్య', 'ఇచ్చట వెన్నెల అమ్మబడును', 'వాళ్ళు', 'మల్లెమొగ్గ', 'అమ్మా పెళ్ళి చేసుకోవే', 'నథింగ్ బట్ ట్రూత్', 'పరాజిత్', 'వేరుకాపురం', 'చేదు', 'ప్రేమంటే ఇదేరా', 'ప్రకృతి మనిషిని తరిమేసింది', 'ఆశ్రమం' కథలు జీవితపు లోతుల్ని స్పృషిస్తూ చక్కటి హాస్యాన్ని, తృప్తిని అందిస్తాయి.

కోలపల్లి ఈశ్వర్ నాలుగు కథలు, ఒక సీరియల్ ఇంటర్‌నెట్ లో సెలెక్ట్ అయ్యాయి. 'స్వాతి' వార పత్రిక నిర్వహించిన 'పదివారాల సీరియల్ పోటీ లో కూడా బహుమతి పొందారు. అఖిల భారత స్థాయిలో నిర్వహించిన 'కూ రెళ్ళసోమేశ్వరరావు కథానికల పోటీ' లో వీరి 'మూగోడు' కథకు అవార్డు లభించింది.

"సరదాకైన ఒక్క కథల సంపుటి ప్రచురించలేదు నేను" అంటూ తన మీద తను జోక్‌వేసుకోగల కోలపల్లి నిజానికి వృత్తిరీత్యా బిజీగా ఉంటూ, చక్కటి హాస్యకథలు మనకు అందించ గలగడం తెలుగు పాఠకులుగా మనమంతా గర్వించాలి. వీరిని అభినందించాలి. "తన రచనమీద ఏ ప్రభావం లేని ఈశ్వర్ తన ప్రభావం తరువాతి వాళ్ళు అనుకరింపజేయగల రచనా శిల్పి" అంటూ అభినందించారు డా.నాగభైరవ కోటేశ్వరరావు. ఇది అక్షర సత్యం. కోలపల్లి కథా సంపుటి కోసం మనమంతా ఎదురుచూద్దాం.


రచయిత చిరునామా
**కోలపల్లి ఈశ్వర్**
C/o. కోలపల్లి కాంప్లెక్స్,
స్టోన్ హౌస్ పేట, నెల్లూరు - 524002.



# గంధం యాజ్ఞవల్క్య శర్మ

**16.8.1937** న గుంటూరు జిల్లా అప్పటి బాపట్ల తాలూకా 'రేగంగుంట పాలెం' గ్రామంలో జన్మించిన గంధం యాజ్ఞవల్క్య శర్మ గారు ఇప్పటివరకు దాదాపు **120** కథలు, అయిదు నవలికలు, రెండు నవలలు కొన్ని రేడియో నాటికలు రాసారు.

వృత్తిరీత్యా శర్మ గారు సహకార శాఖలో కోపరేటివ్ సబ్‌రిజిస్ట్రారుగా పనిచేసి 1995 జులై మాసంలో పదవీ విరమణ చేసారు.

బి.యస్.సి చదువుతుండగా అంటే 1956 లో వీరి మొదటి కథ ప్రచురించబడింది. 1970 వరకూ శర్మగారి కథల్లో మానసిక సంఘర్షణలు-అప్యాయతలు, స్త్రీ సమస్యలు, సంగీతం, వివాహ వ్యవస్థ, ఆధ్యాత్మిక చింతన, సాంఘిక దురాచారాల మీద తిరుగుబాటు, గ్రామీణ రాజకీయాలు చోటుచేసుకున్నట్లు మనకు అవగతమవుతుంది. అవి... మనల్ని విపరీతంగా ఆకర్షిస్తాయి, ఆకట్టుకుంటాయి, మనసు చెమ్మగిలచేస్తాయి, ఆర్ద్రత కలిగిస్తాయి, కంటతడి పెట్టిస్తాయి.

"నా రచనలకు ముందు, వీటిలోని పాత్రలు ఎవరినీ ఉద్దేశించినవి కావు అని వ్రాయలేను. నా కథలలోని చాలా పాత్రలు, నాకు ఎదురైన కొందరి ప్రతిబింబాలు" అంటారు శర్మగారు.

గంధం యాజ్ఞవల్క్య శర్మగారు 'నీడలూ-నీజాలు', 'వెలుగులో వెలది' అనే రెండు నవలలు పుస్తకరూపంలో పాఠకులకు అందించారు. 'సెలవయింది' అనే కథా సంపుటి ప్రచురించి పాఠకుల మన్ననలు పొందారు. శర్మగారు తరచుగా 'గంధం యాజ్ఞవల్క్య శర్మ', 'యాజ్ఞవల్క్య', 'జి.వై.వి.శర్మ' అనే పేర్లతో రచనలు చేస్తున్నారు. శర్మగారి కొడుకు, 'నాగరాజు-గంధం' గారు కూడా కథలు రాయటం మనం గమనించవచ్చు. వీరి వారసత్వాన్ని నాగరాజు గంధం గారు పుణికి పుచ్చుకున్నారు.

వీరి కథల్లో మనం ఎన్నటికీ మరిచిపోలేనివి కొన్ని ఉన్నాయి. అవి 'సెలవయింది', 'చరణాలు (శ్రీ చరణాలు)', 'రేపటి సూర్యుడు', 'బంగారయ్య చచ్చాడు', 'వైతరణి', 'ఓటమి', 'దాక్షిణ్య లాభం', 'కందాల కథ', మొదలైనవి.

1965లో శ్రీ భమిడిపాటి రామగోపాలన్ని కల్సుకున్న శర్మగారు ఆ తరువాత మంచి మిత్రులుగా నరసరావుపేటంతా తిరిగారు. శ్రీ భరాగో గారి సహకారంతో 'నీడలూ-జాడలూ' అన్న నవల ప్రచురించారు.

ఒక నిబద్ధతకు కాని, సిద్ధాంతపరమైన అవగాహనకు గాని, కట్టుబడి కథలురాయకున్నా ఏది వారికి కథ అనిపిస్తే అది వ్రాసారు. తనచుట్టూ ఉన్న వాతావరణం మనుషులు, వాళ్ళ చిత్త ప్రవృత్తులు, వీరికి అర్థమైన రీతిలో రాసారు. వీరిచుట్టూ జరిగిన సంఘటనలను, తన అనుభవాలను, వారి పరిధిలోని సంయోగ, వియోగ అనుభూతులను, సంకల్ప, వికల్పాలను ఎక్కువగా కథల్లో చేర్చి రాస్తున్నారు శర్మగారు.


రచయిత చిరునామా
గంధం యాజ్ఞవల్క్య శర్మ
10-9-21, అరండల్ పేట,
నరసరావుపేట - 522601.



# గోవిందరాజు రామకృష్ణారావు

"సమాజ పరిస్థితులకు ప్రతిబింబంగా వున్నా, ఎక్కువగా అంతరంగాల్లో వున్న విలువలు, మానవతా విలువలతో కూడిన కథలు, ముఖ్యంగా లలిత భావాలు కల గుండెను కదిలించే లోలోపల దాగిన రసార్థతో కూడిన కథలు రాయండి" అంటారు ప్రముఖ కథకులు గోవిందరాజు రామకృష్ణారావు.

కృష్ణాజిల్లా 'అవురుపూడి' గ్రామంలో నవంబర్ 14, 1929 సం. లో జన్మించిన రామకృష్ణారావు బాల్యం నిడుమోలు, ఎలకుర్రు, పామర్రు, అవనిగడ్డలలో గడిచింది. కళాశాల విద్య మచిలీపట్నంలోనూ, పి. జి. ఆంధ్రవిశ్వవిద్యాలయం లోనూ, ఎల్.ఎల్.బి, ఎల్.ఎల్.ఎమ్ ఉస్మానియా యూనివర్సిటీలోనూ చేసారు.

రామకృష్ణారావు మొదట బాల సాహిత్యం విరివిగా రాసి, ఆ తరువాత పెద్దల సాంఘిక కథలు అనేకం రాసారు. 1950లోనే చిన్నపిల్లలకథలు రాసినా, 1951లో చిత్రగుప్తలో ప్రచురించబడిన 'బస్తీటక్కర్' (బస్తీమోసం) వీరి మొదటి సాంఘిక కథ. వీరి కథలు అన్ని ప్రముఖ పత్రికల్లోనూ ప్రచరించబడ్డాయి. ఆనాటి భారతి పత్రికలోనే కాకుండా ఆంధ్రజ్యోతి , ఆంధ్రప్రభ, జయశ్రీ, ప్రజామాత, కృష్ణాపత్రిక, విపుల, స్వాతి, ఉదయం, ఈనాడు వంటి వాటిల్లో కూడా వీరి కథలు చోటుచేసుకున్నాయి.

చిన్నపిల్లలకోసం వికటకవికథలు, ధర్మదేవత, రాజుగారి ఆకలి కథాసంపుటాలు ప్రచురించారు. పెద్దలకోసం శిల్పి, చింతతోపు ఎర్రబడింది కథాసంపుటాలు ప్రచురించారు. ప్రస్తుతం ఇరవై కథలతో కూడుకున్న 'గోవిందరాజు రామకృష్ణారావు కథలు' కథాసంపుటి విశాలాంధ్ర వారు ముద్రిస్తున్నారు. అతి త్వరలో ఈ కథా సంపుటి పాఠకులకు అందబోతున్నందుకు కథాప్రియులంతా ఆనందించాలి. అనేకం కథలు తెలుగునుండి ఇతర భాషల్లోకి, ఇతరభాషల కథలు తెలుగులోకి అనువాదం చేసారు. వీరి అనువాద కథలు విపులలో ప్రచురించబడ్డాయి. ప్రముఖ కథకురాలు శ్రీమతి శారదా అశోకవర్ధన్ గారి కథల్ని 'ది పెరినియల్‌లైట్' పేరుతో ఆంగ్లంలోకి అనువాదం చేసారు.

విపులలో ప్రచురించబడిన 'విస్తరి' కథలోకి తొంగిచూస్తే మనం భోజనం చేసిన తరువాత విస్తరిలో అన్నం మిగిల్చి వేయటంమనే సాంప్రదాయాన్ని వివరిస్తుంది. ఈ కథ నేపాలీ భాషలోకి అనువాదం చేయబడింది. అంతే కాకుండా భారతీయ జ్ఞానపీఠ్ ఢిల్లీవారు తీసిన కథాసంకలనంలో ప్రచురించారు. వీరు పదినిమిషాల సన్నివేశముంటె కథనుకూడా అంతేరాస్తారు. అంతేగాని కథని పొడిగించి రాయాలనుకోరు. వీరు రాసిన కథల్ని లోతుగా పరిశీలిస్తే ఈ విషయం స్పష్టంగా తెలిసిపోతుంది.

ప్రస్తుతం వృత్తిరీత్యా రాష్ట్ర సాంస్కృతిక మండలిలో 'ఓ.యస్.డి'గా బాధ్యతలు నిర్వహిస్తున్న గోవిందరాజు రామకృష్ణారావు గారిని రాష్ట్ర సాంస్కృతిక మండలి, యువజన సర్వీస్‌ల శాఖ నిర్వహించిన 'నవరచయితల అధ్యయన శిబిరం-విమర్శ'లో పాల్గొన్న రాష్ట్ర నలుమూల నుంచి వచ్చిన అభ్యర్థులు వీరి మంచి మనస్సుకు స్పందించి శిబిరం చివరి రోజు ఘనంగా సన్మానించారు. 1999సం.లో వీరి కథలకు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు ఇచ్చి గౌరవించింది.


రచయిత చిరునామా

**గోవిందరాజు రామకృష్ణారావు**

183, సిరిపురం కాలనీ, మలకపేట కాలనీ (పోస్ట్)

హైదరాబాద్ - 500 036.



# గోవిందరాజు సీతాదేవి

గృహలక్ష్మి పురస్కార గ్రహీత శ్రీమతి గోవిందరాజు సీతాదేవి మనకున్న అతి కొద్ది ప్రముఖ కథా రచయిత్రులలో ఒకరు. కృష్ణాజిల్లా 'కాజ' లో జన్మించిన గోవిందరాజు సీతాదేవి గారు, ఇప్పటి వరకు సుమారు 300 పైగా కథానికలు, 21 నవలలు రాశారు.

సీతాదేవిగారు రాసిన కథల్లో ప్రముఖులచే గుర్తించబడిన ఉత్తమ కథల్ని 8 కథాసంపుటాలుగా తెలుగు సాహిత్య లోకానికి అందించారు.

శ్రీమతి గోవిందరాజు సీతాదేవి రాసిన 'నేలతల్లి' కథ తరాల అంతరం, మారుతున్న విలువలు చర్చించిన కథ. ఈ కథలో ... వృద్ధురాలైన తల్లి బాధ్యతను స్వీకరించలేని కొడుకు, కోడల్ని, కూతుళ్ళు ఆమెకు నిలువనీడలేకుండా ఉన్న ఇల్లు కూడా అమ్ముకుని డబ్బులు పంచుకోవాలని చూస్తారు. అయితే చనిపోయిన తండ్రి తన వీలునామాలో ఇంటిని ఒక ఆసుపత్రిగా గాని, పాఠశాలగా గాని మార్చాలని, అది ప్రజలకు ఉపయోగపడే విధంగా చేయాలని, నేలతల్లి ఋణం తీర్చుకునేది కాదని రాస్తాడు. ఈ కథ ముగింపు అద్భుతంగా వుంటుంది. తన కథల్లో కొసమెరుపు తప్పనిసరిగా సృష్టిస్తారు.

శ్రీమతి గోవిందరాజు సీతాదేవి 8 కథా సంపుటాలు.... 'ఒంటి స్తంభం మేడలో ఒకటిన్నరగది' కొత్తబంధం, పాఠకులారా... జహాపనాక్, సిరి, రాజీ, ది లిటిల్ ల్యాంప్ అండ్ అదర్ స్టోరీస్ (ఆంగ్లంలోకి అనువదించబడిన కథలు), గోవిందరాజు సీతాదేవి కథలు, దోస్త్ రాజీనా, నీకోసం మొదలగు 8 కథాసంపుటాలు వెలుగు చూశాయి. ఈ కథల్లో స్త్రీ సమస్యలు, కష్టాలు, కన్నీళ్ళు, వాటికి పరిష్కారాలు, మధ్యతరగతి కుటుంబాల బాధలు, భాగోతాలు, సామాజిక సమస్యలు ఎత్తి చూపుతూ వాటికి జవాబులూ అందించారు.

కథాప్రక్రియలోనే కాకుండా నవలా సాహిత్యంలో కూడా అందెవేసిన చెయ్యి గోవిందరాజు సీతాదేవిగారిది. ఆవిడ రాసిన 21 నవలలు అచ్చయ్యాయి. 'తెలుగువెలుగు'లో 'తాతయ్య గర్ల్ ఫ్రెండ్', 'కోటి వెలుగులు' పూలనావ, అపర్ణ, మిస్ మధుమతి, మొదలైనవి వచ్చాయి. ఇలా అనేకం నవలలు పాఠకుల మెప్పు పొందినవే! వాటిలో 'తాతయ్య గర్ల్ ఫ్రెండ్' నవల సినిమాగా చిత్రించబడి అన్ని కేంద్రాలలోను వంద రోజులు ప్రదర్శింపబడింది. ఈ నవల కన్నడంలోకి కూడా అనువదించారు.

రాష్ట్ర సాంస్కృతిక మండలి, యువజన సర్వీసుల శాఖ సంయుక్తంగా నిర్వహించిన నవరచయితల అధ్యయన శిబిరం-కథానికలో వివిధ జిల్లాల నుంచి వచ్చిన నవ రచయిత, రచయిత్రులకు కథ గురించి సూచనలందిస్తుండగా, వారు రచయిత్రిగా సాహిత్య లోకానికి అందించిన సేవలకు గాను స్వర్ణకంకణం అవార్డు ప్రకటన అప్పుడే వెలువడంతో ఆ శిబిరంలో పాల్గొన్న నవకథకులందరూ గోవిందరాజు సీతాదేవి గారిని వెంటనే పూలమాలలతో సత్కరించి అభినందించారు.

సుశీలా నారాయణరెడ్డి సాహితీ అవార్డు, మద్రాసు తెలుగు అకాడమీ ఉగాది పురస్కారం, దుర్గాభాయి దేశ్‌ముఖ్ అవార్డు, పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటీ అవార్డులు అందుకున్న వీరు ప్రముఖ రచయిత్రి 'యద్దనపూడి సులోచనారాణి' గారి సొంత అక్కగారని చాలా మందికి తెలియదు.

రచయిత్రి చిరునామా
గోవిందరాజు సీతాదేవి
6-3-903/4-బి, సోమాజిగూడ,
హైదరాబాద్ - 500 082.



# ఘండికోట బ్రహ్మాజీరావు

వృత్తిరీత్యా రైల్వేశాఖకు చెందిన ఘంటికోట బ్రహ్మాజీరావు గారు, ప్రవృత్తిరీత్యా రచయితగా కొనసాగుతూ, రైల్వేవారి జీవితాలనే కథానస్తువులుగా తీసుకొని పాఠకులను రంజింపజేసిన ప్రముఖ కథారచయిత.

శ్రీ ఘంటికోట బ్రహ్మాజీరావు 23-12-1922లో 'పాండూరు' గ్రామం, శ్రీకాకుళంలో జన్మించారు. రచయితగా 1938 నుండే కలం పట్టారు. 1941లో ఉద్యోగంలో చేరి 40 సంవత్సరాల తరువాత విరమించారు. బహుమతి పొందిన కొన్ని నవలలు, కథానికలు, రైల్వే పనివాళ్ళకు చెందినవే.! రైలింజను డ్రైవరు గురించి, ఒక రైల్వే కార్ఖానా గురించి, ఒక పెద్దరైలు ప్రమాదం గురించి, దేశానికి బ్రిటీష్ వారు స్వాతంత్ర్యం యిచ్చినప్పుడు యాంత్రిక విభాగంలో కలిగిన లోటుపాట్లు గురించి, తెలుగులో నవలలు రాసిన వారిలో ఈ రచయిత మొదటి వాడు.

మూడు సంవత్సరాలు ప్రొఫెసరు 'తూమాటి దోణప్ప' గారి దగ్గర రచయిత శ్రీ ఘంటికోట తెలుగు కథానిక మీద పరిశోధన చేసారు. సుమారు తొంభై కథానికలు, పదిహేను నవలలు రచించారు. వీటిలో కొన్నిటికి బహుమతులు కూడా లభించాయి.

ఘంటికోట రచించిన కథానికల్లో ఉత్తమమైనవిగా 'కారడవిలో గంధపుమాను,' 'విధి వరించినతీర్పు', 'మలుపు', 'ఎండ', 'గైడ్ డాగ్', 'సప్తపది', 'ఆరోహణ-అవరోహణ', 'తాబేళ్ళు', 'ఫ్లాట్ ,ఫారమ్-15', 'ఇదీ కథ', చెప్పుతినేడు కుక్క, మొదలైనవి చెప్పుకోవచ్చు.

1996లో వీరి కథాసంపుటి 'మయూరాక్షి' విడుదలై పాఠకులను విశేషంగా ఆకట్టుకుంది. కేంద్రసాహిత్య అకాడమీ కోసం 'బర్టను అరేబియన్ నైట్సు' నుండి 1988లో 'వేయి నొక్కరాత్రులు' అని తెలుగు కథా సంపుటి విడుదల చేశారు. సరళ వ్యాఖ్యానంతో 'శ్రీమద్వాల్మీకి రామాయణం' సుందరాకాండను 1988లో విడుదల చేయగా, అది విశేషంగా పాఠకుల ఆదరణ పొందింది. జాతకాల పేర స్త్రీ జీవితంలో చిచ్చు ఎలా పెడతారో ఘండికోట బ్రహ్మాజీరావు 'విముక్తి' కథలో కనబడుతుంది. కొడుకు జాతకంలో ద్వితీయ వివాహం ఉందని తెలుసుకున్న తల్లి, కోడలును వదిలించుకోలసి వస్తుంది. అత్తగారి ఎత్తుగడ తెలిసిన ప్రియంవద, అభ్యుదయవాదాల సహకారంతో కూతుర్ని తీసుకుని పుట్టిల్లు చేరుతుంది. విద్యా సంపన్నురాలు కావటం వలన ఘోరమైన ప్రమాదం నుండి బయటపడగల్గింది. కూతుర్ని తండ్రిదగ్గరకు పంపించి తాను విముక్తి పొందుతుంది.

ఘంటికోటగారు కథావస్తువు కోసం కష్టపడ్డది ఏమాత్రం లేదు. మనసువిప్పి చూసారు. స్పందించారు. నిజజీవితంలోని వాస్తవ సంఘనలు తీసుకొని కల్పన జోడించి తనదైన శైలిలో చక్కటి శిల్పంతో ఒక శిల్పిలా మలచి, పాఠకులకు అందించారు. రైల్వేకార్మికుల కష్టసుఖాలు గమనించారు. స్పందించే హృదయమున్న వీరికి కథావస్తువుకు ఇక కొదవేముంది. అందుకే వీరి కథానికలు, నవలలు, సాహిత్య రంగంలో విశేషకీర్తిని తీసుకొచ్చాయనడంలో అతిశయోక్తి లేదు.

రచయిత చిరునామా
**ఘంటికోట బ్రహ్మాజీరావు**
డో.నెం. 46-18-11/6,
మండవారి పేట, దొండపర్తి,
విశాఖపట్నం - 530016



# చలసాని ప్రసాదరావు

"కథలో మొదటి వాక్యం చదివింపజేసేదిలా వుండాలి. కథలో ఒక రసానుభూతి వుండాలి. అది శృంగారం గాని, కరుణ, హాస్యం ఏదైనా..." అంటారు చలసాని.

ది. 27-10-1939లో కృష్ణా జిల్లాలో జన్మించిన చలసాని ప్రసాదరావుగారు తెలుగు పాఠకులకు ఎన్నో మంచి కథానికలు అందించారు. 1951-56 సం॥ల మధ్యకాలంలో వీరు ప్రజాశక్తి తెలుగు వీక్లీలోనూ, 'విశాలాంధ్ర' దినపత్రికల్లోనూ పనిచేశారు. 1956-58 సం॥ల కాలంలో వీరు తమ మకాంను వరంగల్లుకు మార్చి అక్కడ నుంచి ప్రచురించబడే 'కాకతీయ పత్రిక'కు అసోసియేట్ ఎడిటర్‌గా పనిచేశారు.

1969లో ఉస్మానియా యూనివర్సిటీ నుంచి బి.ఎ (లిట్) పట్టా పొందిన ప్రసాదరావుగారు ఒక సంవత్సరం పాటు హైదరాబాదు నుండి వెలువడే 'వసుధ' తెలుగు మాసపత్రికకు ఎడిటర్‌గా పనిచేశారు. ఆ తరువాత 1974లో 'ఈనాడు' దినపత్రికలో పార్ట్‌టైం ఎడిటర్‌గా 'ఆదివారం అనుబంధం'కు పనిచేసి 1975 నవంబరులో పూర్తి సమయం ఎడిటర్‌గా కొనసాగించారు. వీరు నిన్నటివరకు 'విపుల' 'చతుర' పత్రికలకు సంపాదకులుగా ఉన్నారు.

1970-75 కాలంలో ప్రచురింపబడిన వీరి ఆర్టికల్స్‌ను 'కబుర్లు' పేరుతో 1977లో ప్రచురించారు. 20 కథలతో భారతదేశానికి, యూరప్ దేశానికి చెందిన కథలను తెలుగులోకి అనువదించి 'ఆరడుగుల నేల' కథల సంపుటి ప్రచురించారు. కథా సాహిత్య ప్రక్రియలో విశేషకృషి చేసిన చలసాని అనేక కథలు ప్రముఖంగా ప్రచురింపబడ్డాయి. 1960లో 'రవికథ' రవీంద్రనాథ్ ఠాకూర్ జీవితచరిత్ర రచించారు. 1969లో 'కథలు కాకరకాయలు' శీర్షికతో ఓ కథాసంపుటిని పాఠకులకు అందించారు. ఆ రోజుల్లో ఈ కథాసంపుటి పాఠకులను బాగా ఆకట్టుకుంది. 1973లో 'మార్పు' పేరుతో ఓ కథా సంపుటి ప్రచురించారు. ఈ కథా సంపుటిలోని కథలన్నీ చైనాభాషలో ప్రచురించబడిన కథానికలను తెలుగులోకి అనువదించి వీరు పాఠకులకు అందించారు.

కథా రచనతోపాటు కమర్షియల్ ఆర్ట్స్‌లోనూ, ఫోటోగ్రఫీలోనూ డిప్లొమాలు సాధించిన చలసానిగారు, ఆ రంగాలలో కూడా విశేషకృషి చేసి గొప్పపేరు సంపాదించారు. 'కళ' అనే పత్రికకు ఎడిటర్ పనిచేస్తూ అందులో 'కమర్షియల్ ఆర్ట్స్'కు సంబంధించిన అనేక విషయాలు ప్రచురించారు.

అందరినీ కలుపుకొని, స్నేహహస్తం అందించే చలసానిగారు రచనా రంగంలోనే కాదు, ఇతర రంగాలలో కూడా అజాత శత్రువుగా గుర్తించబడ్డారు. 'కథారచనకు శైలి, శిల్పం, కొసమెరుపు, మలుపుతోపాటు టైటిల్ కూడా ఓ వినూత్నంగా పెట్టినపుడే ఆ కథ పాఠకులను ఆకట్టుకొని కలకాలం నిలుస్తుందని' విశ్వసించే కథా రచయిత చలసాని ప్రసాదరావు. ఇటీవలె వీరు మరణించడం కథాప్రియులకు తీరనిలోటు.


రచయిత చిరునామా
చలసాని ప్రసాదరావు
బి-76, జర్నలిస్ట్ కాలనీ,
జూబ్లీహిల్స్, హైదరాబాద్ - 500033.



# చావా శివకోటి

"తెలుగుతనం వెలుగులాంటిది. ఇది నిండిన కథయినా, కావ్యమైనా మరే రచనసైనా మన రిసీవింగ్ సేచర్ బట్టీ రచయిత గాని, పాఠకుడు గాని అందుకోగలడు" అంటారు ఖమ్మంజిల్లాకు చెందిన ప్రముఖ సీనియర్ కథకులు చావా శివకోటి.

1940న ఖమ్మం జిల్లా ముదిగొండ మండలం 'గోకినేపల్లి' గ్రామంలో జన్మించిన చావాశివకోటిగారు 1964 నుండికథలు రాస్తున్నారు. ఆంధ్ర పత్రికలో వీరి మొదటి కథ ప్రచురించబడింది. ఇప్పటి వరకు మొత్తం నూటయాభై కథలు రాసిన శివకోటి బి.ఏ. వరకు చదివారు. వృత్తిరీత్యా ఫోటో అకాడమీలో, సినిమాటోగ్రఫీలోను అటు తరువాత ఢిల్లీలో కొంతకాలం పని చేశారు. ప్రస్తుతం వ్యవసాయం వీరి వృత్తి. అయినా చేసింది చాలా తక్కువే నంటారు.

ఖమ్మం పట్టనానికి చెందిన కథకులు, ప్రముఖ వైద్యులు డా. హరీష్ గారు వీరికి బాల్య మిత్రులు. డా.హరీష్ లాంటి మిత్రులు చదివి చెప్పిన ప్రతి పుస్తకాన్ని చదవటం వీరికి అలవాటు.

చావాశివకోటికి వారు రాసిన కథల్లో ఆంధ్రజ్యోతిలో ప్రచురించబడిన 'పిచ్చి' అనే కథ చాలా ఇష్టం. చిన్న కథే అయినా సమాజం, పుట్టకనుండి (మాతృసామ్య వ్యవస్థ పోయాక) ఇప్పటి దాకా ఆడది ఆట బొమ్మే. శారీరకంగా భగవంతుడు పురుషుని కంటే శక్తి హీనంగా పుట్టించడం ఓ తప్పైతే దాన్ని పూర్తిగా వాడుకొని నియంతలా ప్రవర్తించడం, దాన్ని న్యాయంగా లోక ధర్మంగా చూపడం... అందరిలో తలలూపించడం ... అసలు మారేనా? ఒక నాడు అగ్నిసాక్షిగా పెళ్ళాడిన ఇల్లాలే అక్కర్లేదనుకుని ఆవిడని హింసించి, రెచ్చకొట్టి, తెగించిన తరువాత 'పిచ్చి'గా మల్చే మగ మహారాజు సహకారంతో మెంటల్ ఆసుపత్రిలో చేర్పించడం. అక్కడ ఆవిడ మరణించడం- దీనికి పరిష్కారం ఈ సమాజం చూపగలదా? సమాజం నుంచి న్యాయం అందని ద్రాక్షలాగానే మిగిలిందన్న వీరి ఆవేదనకు ప్రతి రూపమే పిచ్చి కథ.

మయూరి వార పత్రికలో 'ముత్యాలు- పగడాలు' శీర్షికన చావా శివకోటి ఎందరో ప్రముఖ కథకుల పాత కథలు సేకరించి ప్రచురించారు. ప్రతి కథకు రచయిత చిత్రం, రచయిత గురించి సంక్షిప్త వ్యాఖ్య ఇవ్వడం ఎంతో ఆకర్షణీయంగా ఉంది. వాటిల్లో చాలా అద్భుతమైనవీ, ఆర్ద్రత గలిగినవీ, ఆలోచింపచేసేవీ, రమ్యమైనవీ ఉన్నాయి.

చావా శివకోటి గారికి రచయితలుగా ఆరాధ్యులు శ్రీ గోపీచంద్, చలం, దాశరథి రంగాచారి, వాకాటి, పురాణం, కొ.కు, విశ్వనాథ శాస్త్రి, రంగనాయకమ్మ, డా. హరీష్‌లుగా పేర్కొన్నారు.

శివకోటి గారు కథావస్తువులను జీవితం నుండే తీసుకొంటారు. అందుకే వీరి కథలు మనల్ని ఆలోచింపజేస్తాయి. స్పందింపజేస్తాయి. చావా శివకోటి గారు ప్రముఖ కథకులు 'చావా రామకోటి' గారికి అన్నగారన్న విషయం నేటి యువకథకులకు చాలా మందికి తెలీదు.

రచయిత చిరునామా
**చావాశివకోటి**
గోకినేపల్లి (పోస్ట్) ముదిగొండ (మండలం)
ఖమ్మం జిల్లా





## చిలుకూరి దేవపుత్ర

అనంతపురం జిల్లా బెళుగుప్ప మండలం 'కాలువపల్లి' గ్రామంలో జన్మించిన 'చిలుకూరి దేవపుత్ర' తెలుగు పాఠకులకు ఎన్నో మంచి కథలు అందించారు. ఉద్యోగరీత్యా అనంతపురం కలెక్టరేట్‌లో సీనియర్ సహాయకులుగా పనిచేస్తూ ప్రవృత్తి రీత్యా కథారచనలు సాగిస్తున్నారు.

1977లో చిలుకూరి దేవపుత్ర మొదటికథ 'మానవత్వం' ప్రజా సాహితి సాహిత్య మాస పత్రికలో ప్రచురింపబడింది. అప్పటి నుండి దాదాపు వందుకు పైగా కథలు ప్రసిద్ధ పత్రికలలో అచ్చయ్యాయి. కొన్ని కథలకు బహుమతులు వచ్చాయి. కొన్ని కథలు ఇంగ్లీషు, హిందీ, కన్నడం, మరాఠీ భాషలలోకి అనువాదమయ్యాయి.

ఆంధ్రసాహిత్య అకాడమీ వారి 'ఒక తరం తెలుగు కథ' సంకలనంలోను 'సీమకథ', 'దళితకథ', కథా సంకలనాల్లోనూ, 'ఇంకానా ఇంక చెల్లదు', 'కొత్తకథ' సంపుటాలలోనూ వీరి కథలు చోటు చేసుకున్నాయి.

కర్నూలు పి. జి. సెంటర్ (ఎస్.కె. యూనివరియర్సిటీ) విద్యార్థులు కొందరు చిలుకూరి కథలపై ఎమ్. ఫిల్. చేసారు. వీరి నవలలపై పిహెచ్‌డి పరిశోధనలు యూనివర్సిటీలో జరుగుతున్నాయి.

చిలుకూరి దేవపుత్ర 'ఆరుగ్లాసులు' కథాసంకలనం కు 1990 సం.లో నూతలపాటి గంగాధరం సాహితీ పురస్కారం లభించింది. 1996 సం.లో 'ఏకాకినౌక చప్పుడు' కథా సంకలనానికి హిమబిందు (కాకినాడ) వారి అవార్డు లభించింది. వీరి శైలి కథకు అనుగుణంగా, సహజంగా, నిరాడంబరంగా ఉంటుంది. కథన కేశలం గొప్పగా ఉంటుంది. మునకే సుఖం కథలో యాభై ఏళ్ళ రమణయ్య భార్య, ఇద్దరు పిల్లలు ఉన్న చిన్న ఉద్యోగి. ఒక రోజు ఆఫీసులో ఉండగా కడుపునొప్పి వస్తుంది. ఏవో మాత్రలు వేసుకున్నా తగ్గదు. ఇంట్లో భార్య డాక్టరుకు చూపించుకోమన్నా మొదట నిర్లక్ష్యం చేసి చివరికి డాక్టరు దగ్గరకు ఒంటరిగా వెళతాడు. డాక్టరు అన్ని రకాల స్కానింగులు, టెస్టులు చేసి రెండు కిడ్నీలు పాడైనాయని, కిడ్నీ ఎవరైనా దానం చేస్తే రెండు లక్షలు ఖర్చు అవుతుందని చెబుతాడు. దాంతో... ఇంటికొచ్చిన రమణయ్య అన్ని టెస్టులు చేసి ఏరోగం లేదన్నారని అబద్ధం చెబుతాడు.

చిలుకూరి కథా రచనతో పాటునవలా సాహిత్యంలో కూడా విశేష కృషి చేసారు. స్వాతి మాస పత్రికలో 'అద్దంలో చందమామ', 'చీకటిపూలు' అనుబంధ నవలలుగా వచ్చాయి. 'పంచమం' నవల అమెరిగా తెలుగు అసోసియేషన్ (ఆటా) నవలల పోటీలో 30 వేల రూపాయల బహుమతి పొందింది. ఈ నవలకే 'ఉండేల అవార్డు' కూడా లభించాయి.

చిలుకూరి దేవపుత్ర కథానికలు కొన్ని ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. రేడియో కోసం కొన్ని నాటికలు కూడా రచించారు. ఇంకాకొన్ని రంగస్థల నాటకాలు కూడా రచించారు. 'మంత్రి వెడలె', 'వంకర టింకర ఓ', రంగస్థల నాటికలుగా 'మట్టిగాజులు', 'ప్రేమలేఖ', 'దిట్టా', 'దొంగయితే బాగుండు', 'తులసికోట', మొదలైనవి రేడియో నాటికలుగా వీరికి మంచి పేరును సంపాదించిపెట్టాయి. వీరు మరిన్ని మంచి కథానికలు తెలుగు పాఠకులకు అందించి మరిన్ని బహుమతులు, అవార్డులు పొంది సాహితీశిఖరాలు చేరుకోవాలని ఆశిద్దాం!


రచయిత చిరునామా
చిలుకూరి దేవపుత్ర
28/440 గవర్నమెంట్ క్వార్టర్స్-పి2,
బుడ్డప్పనగర్, అనంతపురం - 515 001.





# చొక్కాపు వెంకటరమణ

"కథ పాఠకుడిని ఆలోచింపచేయాలి. మనస్సుని తట్టాలి. శాశ్వత ముద్రవేయాలి. తన జీవితంలో ఏదో ఒక సంఘటనతో పోల్చి చూసుకొని స్పందించేలా పాఠకుని ప్రభావితం చేసేదే మంచికథ. ఏ ఇజమైనా, ఏవాదమైనా మానవతా విలువలు కలిగిన కథ పదికాలాలపాటు నిలుస్తుంది" అనే నిశ్చితాభిప్రాయం వ్యక్తంచేసే రచయిత చొక్కాపు వెంకటరమణ.

1949 ఏప్రిల్ 1న విజయవాడలో జన్మించిన రమణ 1962లో 'చంద్రభాను' పిల్లల మాసపత్రికలో మొదటి కథ ప్రచురణతో రచనా ప్రస్థానం ప్రారంభమైంది. ఇంత వరకు యాభైకి పైగా పిల్లల పుస్తకాలూ, ఐదువందలకు పైగా పిల్లల కథలు, వివిధ పత్రికలల్లో యువత, బాలలకోసం, హాస్య, వ్యక్తిత్వ వికాస శీర్షికల నిర్వహణతో పాటూ ఆంధ్రభూమి డైలీలో ఈ రోజె పుట్టారు డైలీ ఫ్యూచర్ ఏడాది పాటు నిర్వహించారు.

చొక్కాపు హాస్యరచనలల్లో 'ఫన్' డితుడు, విక్రమూర్ఖుడి విస్కీ కథలు శీర్షికన మయూరి వారపత్రికలో రాసిన కథలు ఒక్కొక్కటి ఒక్కోహాస్య రసగుళిక. కథలెంత చమత్కారంగా ఉన్నాయో ఆ కథలపేర్లు చెబుతాయి. తాగుడు కూతలు, మందుచూపు బీరబలుడు, టెన్ చీర్స్, విస్కీమేసవాల్ మందుబాగ్యుడు, మందు మారుజాలం, ద్రవం-ఉపద్రవం, బాటిల్ ఫీల్డ్, గ్లాస్‌మేట్స్, చుక్కభజన వార్తలో ఫీచర్‌గా వచ్చిన వ్యక్తిత్వ వికాస రచనలతో వెలువడిన సక్సెస్ సీక్రెట్స్ పుస్తకం యువతరంలో కొత్త చైతన్యాని కలిగించింది. హంగులరాట్నం, హ్యూమర్ హంగామా, ఛీటర్ ఢమాల్, హ్యూమర్ హేమర్ మరాష్ - శీర్షికల ద్వారా హాస్య రచనలల్లో చొక్కాపు వెంకటరమణ అనేక ప్రయోగాలు చేశారు.

1971-78 లో విజయవాడలో జయశ్రీ, శ్రీవంతులు, జనత పత్రికలల్లోనూ, 1978-79లో హైదరాబాద్ ఈనాడులో విపుల, చతుర పత్రికలల్లో సహాయ సంపాదకుడిగా ఉద్యోగం చేశారు. 1979-97 వరకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ (జవహర్ బాల భవన్) లో బాలచంద్రిక పిల్లల మాస పత్రిక, బాలసాహిత్య ప్రచురణల విభాగానికి సంపాదకుడిగా ఉద్యోగం (అనంతరం స్వచ్ఛంద పదవీ విరమణ) 1998లో తొలి తెలుగు వ్యక్తిత్వ వికాస మాస పత్రిక 'ఊయల' ప్రధాన సంపాద కుడిగా, పబ్లిషర్‌గా బాధ్యతలు నిర్వహించారు. అంతకు ముందు సరదా, క్రైం డైరీ, పదహారేళ్ళ వయసు మాస పత్రికలు ప్రచు రించి పత్రికా రంగంలో కొత్త కొత్త ఎక్స్‌పెర్మెంట్స్ చేసారు.

1980-90 అంగన్‌వాడిటీచర్ ట్రైనింగ్‌లో 'స్టోరీ టెల్లింగ్' అంశంపై టీచర్స్‌కు ప్రత్యేక తరగతులు నిర్వహించి అంగన్ వాడి 'ఆయా'లకు మూఢనమ్మకాలు దూరంచేసే అవగాహన తరగతులు నిర్వహించారు. 1999లో 'పాతనగరంలో పసివాడు' బాలల సినిమాలో మెజీషియన్‌గా ఒక ప్రత్యేక పాత్రలో నటించిన రమణ నిజానికి మ్యాజిక్, మిమిక్రీ, టాకింగ్ డాల్, మైమ్, ఫైర్‌డాన్స్, పుపెట్‌షో, షాడో ప్లే, జగ్లింగ్, స్టిక్‌వాకర్, క్లౌన్స్ వంటి కళా పక్రియల్లో ఆరితేరి వుండడమే కాకుండా ఎందరో బాలలకు, యువతీ యువకులకు శిక్షణనందిస్తున్నారు.

"1975లో కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి చివరి నవల కుక్కగొడుగులు జయశ్రీలో సీరియల్‌కోసం ఆయన డిక్టేట్ చేస్తుంటే, ఆయనతో కూర్చుని నేను రాయడం, ఆయనతో కలిసి గడిపిన ఆ ఇరవై రోజులు జీవితంలో మరపురాని అనుభూతి" అంటారు రమణ.


రచయిత చిరునామా

**చొక్కాపు వెంకటరమణ**

501, టెంపుల్ వ్యూ రెసిడెన్సీ,

లకడీకపూల్, హైదరాబాద్ - 500 004







# జయంపు కృష్ణ

సాహిత్యంలో నేషనల్ అవార్డు సాధించిన జయంపు కృష్ణ గారు 'నెల్లూరు' కు చెందిన ప్రముఖ కథారచయిత. తన స్నేహితుని కోరిక మేరకు కథ రాసి అతని పేరు మీదనే పత్రికకు పంపిన 'ఓ కథ రాయాలి' కథే జయంపు కృష్ణ మొదటి కథ.

విఖ్యాత దర్శకులు సత్యజిత్ రాయ్, గౌతమ్‌ఘోష్, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మహాకవి శ్రీశ్రీ, కొండవీటి వెంకటకవి, రావూరి భరద్వాజ లాంటి ప్రముఖులను వీరికి ఎమ్మెస్ రెడ్డి గారు పరిచయం చేసారు. కౌముదీ పిక్చర్స్ ఆఫీసులోనే జయంపు కృష్ణ, శ్రీశ్రీగారు కలిసి దాదాపు ఆరు నెలలు ఓ స్క్రిప్టును తయారు చేసారు.

తన స్నేహితుడి ప్రియురాలికి కథలు రాసే వారంటే ఇష్టం అందుకే అతను జయంపు కృష్ణ ద్వారా కథ రాయించుకొని అతని పేరుతో పత్రికకు పంపించి ప్రచురింపజేయటమే కాక వారిద్దరూ పెండ్లి చేసుకునేలా సహకారమందించిన జయంపు కృష్ణ అభినందనీయుడు.

ఇప్పటివరకు దాదాపు 75కి పైగా కథలు రాసారు జయంపు. నాలుగు నవలలు వీరివి వెలుగుచూసాయి. "నా సాహితీ జీవితాన్ని గొప్ప మలుపు తిప్పిన వ్యక్తి డాక్టర్ ఎమ్మెస్ రెడ్డి" గారు అంటూ పలు సందర్భాల్లో చెప్తుంటారు జయంపు కృష్ణ. ప్రముఖ నిర్మాత, సహజ కవి డా॥ ఎమ్మెస్ రెడ్డి గారు వీరిని మద్రాసుకు పిలిపించుకొని తమ కౌముదీ పిక్చర్స్ సంస్థలో స్క్రిప్ట్ అండ్ డైరెక్షన్ సెక్షన్స్‌లో శిక్షణ యిచ్చారు. శ్రమ శిక్షణే జీవితానికి 'శ్రీరామ రక్ష' అని ప్రభోదించారు.

అప్పట్లో 'ఆంధ్రప్రభ' వారపత్రికలో సీరియల్‌గా వచ్చిన వీరి తొలినవల 'ప్రేమపూజారి' పాఠకులను విశేషంగా ఆకట్టుకోవటంతో డాక్టర్ ఎమ్మెస్‌రెడ్డిగారు మనసారా ఆశీర్వదించి వారి నాలుగైదు చిత్రాలకు పని చూపించారు. ఆ తరువాత వీరి సొంత చిత్రం 'రామబాణం' సినిమాకు కథ రాసే అవకాశం కల్పించి, వెన్ను తట్టి ప్రోత్సహించారు.

వివిధ పత్రికల్లో ప్రచురింపబడిన వీరి కథల్లో ఓ 32 కథలను ఎంచుకొని 'జయంపు కృష్ణ కథలు' పేరిట ఓ కథల సంపుటి పాఠకులకు అందించారు. వీరినవల 'జాతీయస్థాయి' కి నేషనల్ అవార్డు అందజేసారు.

'ఏదయినా అడుగు ప్రేమ తప్ప' అనే వీరి కథను పరిశీలిస్తే కాలేజీ విద్యార్థి కృష్ణ సర్కస్‌లో పనిచేసే అమ్మాయిని ప్రేమిస్తాడు. ఆమెకోసం పదే పదే సర్కస్‌కు వెళ్ళి ఆమెతో పరిచయం పెంచుకుంటాడు. తల్లిదండ్రులను కోల్పోయిన ఆ సర్కస్ రింగ్ మాస్టరు పంచన చేరి సర్కస్ విద్య నేర్చుకొని అతని ఉంపుడుగత్తెగా ఉన్న ఆమె... కృష్ణతో "ఏదైనా అడుగు ప్రేమ తప్ప" అంటుంది. అతని భవిష్యత్తు గురించి గుర్తుచేస్తుంది. చివరికి అతడు తనకు ఇచ్చిన భగవద్గీత పుస్తకాన్ని అతని ఆరాధనకు కానుకగా యిచ్చిపోతుంది. కలలకూ నిజానికి మధ్య వుండే అంతరానికి అద్దంపట్టే కథ ఇది.

సినిమా పరిశ్రమ అనుభవంతో టి.వి., ఆకాశవాణిలలో కూడా అనేక కథానికలు, నాటికలు రచించి అందజేసారు. నిజానికి ప్రతి రచయిత క్రిందిస్థాయినుండి పై స్థాయికి ఎదుగుతారు. కాని జయంపు కృష్ణకు మొదటి సారే సినీ పరిశ్రమకు కథలు అందించే అవకాశాలు లభించాయి. ఆ తరువాతే ఆయన దూరదర్శన్, రేడియో వైపు దృష్టి సారించారు. మనం మరిన్ని మంచి రచనలు వీరి నుండి కోరుకుందాం!


రచయిత చిరునామా

జయంపు కృష్ణ

17/620, రజక స్ట్రీట్,

నెల్లూరు - 524001.







# జిల్లేళ్ళ బాలాజీ

"సంఖ్యాపరంగా ఎన్నో కథలు రాసినా సరైన గుర్తింపును పొందలేక పోయానన్న వెలితి ఉంది. అప్పుడప్పుడూ రాసినా మంచి కథల్నే రాయాలన్నది నా అభిమతం" అంటారు చిత్తూరు జిల్లాకు చెందిన కథకుడు జిల్లేళ్ళ బాలాజీ.

కథాప్రక్రియలో హాస్యానికి ప్రత్యేక స్థానం ఉంది. హాస్యకథలు రాయాలంటే కథకుడు చాలాకష్టపడాలి. తను సృష్టించే ఏ పాత్రలోనైనా హాస్యంపాలు అటూ ఇటూ ఐతే కథకుడు అపహాస్యపాలైయ్యే అవకాశముంది.

జిల్లేళ్ళ బాలాజీ కథలు మనం పరిశీలిస్తే అతనికి కథలో ఎంత పాళ్ళు హాస్యరసాన్ని నింపితే ఓ చక్కటి హాస్యకథ సృష్టించబడుతుందో తెలిసిన కథకుడని స్పష్టంగా తెలిసిపోతుంది. వీరి హాస్యకథలు అనేకం 'స్వాతి' వారపత్రికలోనూ, 'ఆంధ్ర భూమి' వారపత్రికలోనూ మనం గమనించవచ్చు. అయితే యర్రం శెట్టిశాయి, కోలపల్లి ఈశ్వర్ గార్ల శైలి అక్కడక్కడా వీరి కథల్లో మనం గమనించవచ్చు.

ఇప్పటివరకు సుమారు 40 పెద్దల కథలు. 35 పిల్లల కథలు అన్ని పత్రికల్లోను ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. 1985లో రసమయి సంస్థ నిర్వహించిన కథానికల పోటీలో ప్రథమ బహుమతి, 1990లో 'జాగృతి' వారపత్రిక నిర్వహించిన కథానికల పోటీలో కన్సోలేషన్ బహుమతిని, 2000 సంవత్సరంలో సుప్రభాతం వారపత్రిక నిర్వహించిన కథానికల పోటీలో మూడవ బహుమతి అందుకున్నారు.

ఆకాశవాణి తిరుపతి కేంద్రం నుండి వీరి కథానికలు విరివిగా ప్రసారమవుతుంటాయి. 1999లో రాష్ట్రసాంస్కృతిక మండలివారు హైదరాబాదులో నిర్వహించిన - 'నవరచయితల అధ్యయన శిబిరం - కథానిక'లో చిత్తూరు జిల్లానుండి పోల్గొన్నారు.

"రచనలు చేయాలన్న ఆసక్తి, తపన ఉన్నా, ఆర్థిక ఇబ్బందుల కారణంగా అడపాదడపా మాత్రమే రచనలు చేస్తున్నాను. నా రచనల్లోంచి బాగున్నవాటిలో పదిహేను కథల్ని ఓ సంపుటిగా తేవాలన్నది నా చిరకాల వాంఛ! అలాగే చిన్న పిల్లల కథల సంపుటి తేవాలన్నది నా కోరిక. మరి ఈ రెండు కోరికలు ఎప్పుడు తీరుతాయో ఆ భగవంతుడికే తెలియాలి!" అంటూ ఆవేదన వ్యక్త పరుస్తారు బాలాజీ.

తెలుగు భాషతో పాటు తమిళ భాషలో కూడా ప్రవేశమున్న బాలాజీ, తమిళంనుండి తెలుగులోకి రెండు నవలల్ని అనువదించారు. కథారచనతో పాటు కవితా రచనలో కూడా ప్రవేశమున్న వీరు ఇప్పటివరకు సుమారు 50 మినీకవితలు వెలుగు చూపారు. "భారతి మాసపత్రికలో నా కవితలు ప్రచురించడం అదృష్టంగా భావిస్తాను" అనే వీరికి ఆర్థిక సహాయం అందించే సంస్థలు ముందుకు వస్తే తనకథా సంపుటాలు వేంటనే వెలుగులోకి తెస్తారనటంలో సందేహం లేదు.


రచయిత చిరునామా
జిల్లేళ్ళ బాలాజీ
9-438, లింగేశ్వర నగర్,
బైరాగి పట్టెడ, తిరుపతి - 517501.



# జానమద్ది హనుమచ్ఛాస్త్రి

1926 సెప్టెంబరు 5వ తేదీన అనంతపురం జిల్లా 'రాయదుర్గం'లో జన్మించిన జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కడపజిల్లా రచయితల సంఘాన్ని ఒక ఉద్యమంలా నడిపారు.

తెలుగుభాషా సాహిత్యాల సముద్ధరణకు జీవితాన్ని ధారవోసిన బ్రౌన్ పండితున్ని తలచుకుంటే మనకు గుర్తొచ్చే మరో విశిష్ట పండితుడు, కథా రచయిత జానమద్ది హనమచ్ఛాస్త్రి. 1946లో 20వ ఏట బళ్ళారిలోని ప్రభుత్వ బోధనాభ్యాసన పాఠశాలలో సెకండరీగ్రేడు ఉపాధ్యాయునిగా ఉద్యోగజీవితం ప్రారంభించారు. కడపలో బ్రౌన్ స్మారకగ్రంథాలయ ట్రస్టును నెలకొల్పి ట్రస్టు కార్యదర్శిగా అహర్నిశలూపాటుపడి 10 లక్షల రూపాయలు పోగుచేసారు. ఊహల్లోని బ్రౌను స్మారక కేంద్రం వీరి కృషితో వాస్తవ రూపం ధరించింది. హనమచ్ఛాస్త్రిగారు ఈ కేంద్రానికి 15 వేల గ్రంథాలను సేకరించి, ఇటీవలే అక్కడ బ్రౌన్ ద్విశతి మహోత్సవాన్ని ఘనంగా నిర్వహించారు.

నిత్యసాహిత్య వ్యాపకుడు, బహుగ్రంథ కర్త, వక్త అయిన జానుమద్ది కేవలం కథారచనే కాకుండా వివిధ పత్రికలలో, సంచికల్లో 2,500పైగా వ్యాసాలు రాసారు. ఆకాశవాణిలో 120కిపైగా ప్రసంగాలు చేసారు. 16 గ్రంథాలు వెలువరించారు. 'మా సీమకవులు', 'నాట్యకళా ప్రపూర్ణ బళ్ళారి రాఘవ జీవిత చరిత్ర', 'కస్తూరి కన్నడ సాహిత్య సౌరభం 2', 'కడప సంస్కృతి - దర్శనీయ స్థలాలు రసవద్ఘట్టాలు', 'మన దేవతలు', 'భారతరత్న మోక్షగుండం విశ్వేశ్వరయ్య' జీవిత చరిత్ర, 'సి.పి. బ్రౌన్ చరిత్ర' మొదలైన గ్రంథాలు ప్రచురించారు.

శాస్త్రిగారికి అనేక అవార్డులు సాహిత్యంలో విశేషకృషి చేసినందుకుగాను లభించాయి. గుంటూరులో అయ్యంకి వెంకటరమణయ్య అవార్డు, అనంతపురం లలిత కళాపరిషత్ అవార్డు, ధర్మవరం కళాజ్యోతివారి సిరిసి ఆంజనేయులు అవార్డు, కడప సవేరా ఆర్ట్స్ వారి సాహితీ ప్రపూర్ణ అవార్డు, మదనపల్లి భరతముని కళారత్న అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయ ప్రతిభా పురస్కారం, బెంగుళూరులో అఖిల భారత గ్రంథాలయ మహాసభ పురస్కారం వంటి అనేక పురస్కారాలు వీరికి లభించాయి.

బ్రౌను గ్రంథాలయ ప్రారంభోత్సవ సందర్భంలో ముఖ్యమంత్రిగారి చేతుల మీదుగా, వార్త దినపత్రిక ప్రారంభోత్సవ వేదిక మీద ప్రధాన మంత్రి చేతుల మీదుగా, హనుమచ్ఛాస్త్రి గారికి సత్కారాలు జరిగాయి.

ఇలా అనేక సాహితీ ప్రక్రియల్లో విశేష కృషి చేస్తూ అనేక అవార్డులు, బహుమతులు సాధించిన జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారు కథానికలు కొన్నే రాసినా అవి పాఠకులకు హత్తుకునేలా, స్పందిచేలా ఉంటాయి. వారి నుంచి మరిన్ని మంచి కథానికలు మనం ఆశిద్దాం!


రచయిత చిరునామా
డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి
'మహతి', 1/1845, గాంధీనగర్,
కడప - 516 004.





# డి. కామేశ్వరి

"రచనకి ఓ సామాజిక ప్రయోజనం వుండితీరాలన్న సంకల్పంతో స్త్రీని కనుక నేను స్త్రీల సమస్యలని నా రచనల్లో ఎత్తిచూపాలన్నది నా ధ్యేయం" అంటారు ప్రముఖ కథకురాలు శ్రీమతి డి. కామేశ్వరిగారు.

1935 ఆగష్టు 25వ తేదీన 'కాకినాడ' లో జన్మించిన కామేశ్వరిగారు సుమారు 250 పైగా కథలు, 20 నవలలు రాసారు. 8 కథా సంపుటాలు, ఒక ట్రావెలింగ్ అనుభవం 'నా విదేశయాత్రానుభవాలు' ప్రచురించి పాఠకులకు అందించారు.

తల్లిమనసు, ఇది జీవితం, చీకటి తొలగిన రాత్రి, అతకని బతుకులు, కన్నీటికి విలువెంత, కాదేది కవితకనర్హం, కథా సంపుటాలు డి. కామేశ్వరిగారికి రచయిత్రిగా సాహితీశిఖరాలను చేర్చాయి. డి. కామేశ్వరి కథలు అనేక పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

కథాసాహిత్యంతోపాటు నవలా ప్రక్రియలో కూడా 'భేష్' అనిపించుకున్నారు. కొత్తనీరు, విధివంచితులు, అరుణ, వివాహ బంధాలు, కోరికలే గుర్రాలైతే, చీకటి పొద్దున వెలుగురేఖ, పరాజితులు, కొత్తమలుపు, అగ్నిపరీక్ష, జన్మభూమి, ఎండమావులు, మనసున మనసై మొదలగు నవలలు తెలుగు పాఠకులకు అందించారు. వీరి చాలా కథలు, నవలలు కన్నడంలోకి అనువదించబడ్డాయి. మరెన్నో కథలు, నవలలు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. కొన్ని కథలకు, నవలలకు పత్రికల్లో బహుమతులు లభించాయి.

డి. కామేశ్వరిగారి కథలు మనం లోతుగా పరిశీలిస్తే ఈవిడ స్త్రీవాద రచయిత్రి అని స్పష్టంగా తెలుస్తుంది. తను స్త్రీ కాబట్టి, స్త్రీ సమస్యలను తన రచనల్లో ఎత్తి చూపుతున్నట్లు చెబుతారు. నిజానికి ఆవిడ కథల్లోనూ, నవలల్లోనూ స్త్రీల కన్నీళ్ళు, కష్టాలు, సమస్యలు, బాధలతోపాటు ఆనందాలు మన కండ్ల ముందుంచుతారు.

వీరి నవలలు కొన్ని సినిమాలుగా, మరి కొన్ని టి.వి. సీరియల్స్‌గా వచ్చాయి. మరి కొన్ని వస్తున్నాయి. 'కొత్త మలుపు' నవల 'న్యాయం కావాలి' సినిమాగా, 'కోరికలే గుర్రాలైతే' నవల మరో సినిమాగా, 'అరుణ', 'డాక్టర్ మమత' నవలలు టి.వి సీరియల్స్‌గా వచ్చాయి. అయితే, మనసున మనసై, అగ్నిపరీక్ష, ఎండ మావులు టి.వి సీరియల్స్ మన ముందుకు రాబోతున్నాయి.

1970లో గృహలక్ష్మి స్వర్ణకంకణం, 1986లో అభినందన సంస్థచే 'మాదిరెడ్డి సులోచన' అవార్డు, 1990లో 'మద్రాసు తెలుగు అకాడమీ' ఉగాది వెలుగు పురస్కారం, 1989, 97 'తెలుగు యూనివర్సిటీ' ఉత్తమ రచయిత్రి అవార్డు, 1999లో 'తెలుగు సాహిత్య అకాడమీ' అవార్డు ఇంకా... ఇలా చెబుతూ పోతే లెక్కకి మించి అవార్డులందుకున్న గొప్పరచయిత్రి డి. కామేశ్వరిగారు.


రచయిత్రి చిరునామా

**డి. కామేశ్వరి**

407, తిరుమల అపార్ట్‌మెంట్స్,

హిమాయత్ నగర్,

హైదరాబాద్ - 500 029.







# డి.కె. చదువులబాబు

"సాహిత్య వికాసానికి కృషిచేస్తూ, తోటివారి అభివృద్ధికి చేయూతనందించటం నా ఆశయం" అంటూ గర్వంగా చెప్పుకునే కథకుడు డి.కె.చదువులబాబు. కడప జిల్లా 'పెద్దపసుపుల' గ్రామంలో జన్మించిన వీరు వృత్తిరీత్యా ఉపాధ్యాయుడిగా 'కె.రాజుపాళెం' మండలంలో పని చేస్తున్నారు.

'డి.కె.చదువులబాబు' అనే పేరు ఎంత వినూత్నంగా ఉందో, ఇతని కథలు కూడా అంత వినూత్నంగా ఉంటాయి. వివిధ వార, మాస పత్రికల్లో సుమారు 50 సాంఘిక కథలు, బాలసాహిత్యరచనలు సుమారు 250 కథలు వీరివి ప్రచురించబడ్డాయి. 1992 మార్చిలో బాలజ్యోతి వారు నిర్వహించిన కథలపోటీల్లో వీరి కథ 'నిజాయితీ' కి ప్రథమ బహుమతి లభించింది. 'బొమ్మరిల్లు' పత్రికలో పాతికకు పైగా 'కరాళకథలు' రాసి సంపాదకుల, పాఠకుల, స్నేహితుల ఆదరాభిమానాలు, ప్రశంసలు పొందారు. బాలలకోసం 'త్యాగశీలి - శిల్పసుందరి', 'కామరూపిణి' అనే నవలలు రచించి ప్రచురించారు. ఈ రెండు నవలలు చిన్నారులను విశేషంగా ఆకర్షించాయి. బుజ్జాయి పత్రికలో కొంతకాలం విజ్ఞానాన్ని అందించే మాటల కొలువు శీర్షిక నిర్వహించారు.

నిజానికి డి.కె.చదువులబాబు మొదట బాలసాహిత్యాన్ని అందుకొని ఒక యజ్ఞంలా కథలు రాసి, ఆ తరువాత సాంఘీక కథలవైపు, పెద్దల కథలవైపు దృష్టి సారించారు అనటం సబబు. ఈ రోజు డి.కె.చదువులబాబు కథలు ప్రచురించబడని పెద్ద పత్రికలు లేవు. ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ, జ్యోతి, విశాలాంధ్ర, వార్త, జాగృతి, ప్రజాశక్తి అన్ని పత్రికల్లో డి.కె.చదువులబాబు కథలు మనం గమనించవచ్చు.

డి.కె.చదువులబాబు కథలు లోతుగా పరిశీలిస్తే, వీరు తీసుకొనే ఇతివృత్తాలు జీవితంలోని అనేక కోణాలు కనిపిస్తాయి. ఎత్తుగడ నుండి ముగింపుదాక సూటిగా, సరళ సుందరంగా, మనోహరంగా కథను నడపడం వీరి ప్రత్యేకత. నిజానికి వీరి అనేక ప్రముఖ కథా రచయితల ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ఎన్నో కథలు చదివి కథ రాయడం మొదలు పెట్టాడనిపిస్తుంది. 'కొసమెరుపు' కథలంటే ఇష్టపడే వీరు ఆ లక్ష్యంతో తన కథల్లో 'కొసమెరుపు' తప్పక ఉండేలా... బిగించిన పిడికిలి నెమ్మదిగా విప్పుతూ, కథను చెబుతూ పాఠకుల ఊహకు అందకుండా కథను చెప్పటంలో విజయం పొందారు.

శ్రీ వెంకటేశ్వర నాటకమండలిని స్థాపించి 'మర్మలోకం' అనే రెండు గంటల సాంఘిక నాటకాన్ని, 'నవలోకం' అనే మరో నాటకాన్ని రచించి, దర్శకత్వం వహించి ప్రదర్శించినందుకు స్థానిక సాహితీ ప్రియులు, కళాపోషకులు డి.కె. చదువులబాబును ఘనంగా సన్మానించారు. 2000 సంవత్సరం నవంబరులో 'మనసున్న మనిషి' కథా సంపుటిని ప్రచురించి పాఠకులకు కానుకగా అందించి, తన సాహిత్యాన్ని భద్రపరుచుకున్నారు.

రచయిత చిరునామా
డి.కె. చదువులబాబు
3/528, వై.ఎమ్.ఆర్.కాలనీ
ప్రొద్దుటూరు - 516360.
కడప జిల్లా.



# తెన్నేటి లక్ష్మీనరసింహమూర్తి

ఎన్.టి.ఆర్.స్మారక విశిష్ట అవార్డు గ్రహీత శ్రీ తెన్నేటి లక్ష్మీనరసింహమూర్తి గారు పశ్చిమ గోదావరి జిల్లాలో 16-04-1966లో జన్మించారు. గత 16 సంవత్సరాలుగా కథలు, కవితలు, వ్యాసాలు, సమీక్షలు రాయడమే కాకుండా వాటిని తన విద్యార్థులతో ప్రదర్శింపచేస్తున్న ఉత్తమ ఆదర్శ ఉపాధ్యాయుడు తెన్నేటి.

గణపవరం మండలం పిప్పర జడ్. పి. హెచ్. స్కూల్ లో తెలుగు పండితుడిగా శ్రీతెన్నేటి లక్ష్మీ నరసింహమూర్తిగారు ఉన్నత భాధ్యతలు నిర్వహిస్తున్నారు.

వీరు ఎన్నో ఉత్తమ కథలను, నాటికలను, కవితలను, పాఠకులకు అందించారు. పాఠకుల ఆదరణ పొందిన రచనల్లో మతిలేని మారాజు, ఊరికొక్కడు, ఆ ఇద్దరే, సినిమా తీస్తున్నాం... చందాలివ్వండి, మానవకులం మొదలైనవి తెన్నేటికి పేరు తెచ్చి పెట్టాయి.

తెన్నేటి కథావస్తువును సమాజంనుంచి ఎన్నుకొంటారు. నిజానికి ఆయన వస్తువులన్నీ సారా నిషేధం, నిరక్షరాస్యత, నేత్రదానం, రక్తదానం, పచ్చదనం పరిశుభ్రత మీదనే ఎక్కువగా ఎన్ను కొంటారు. తమ రచనలతో సమాజంలో మంచి మార్పును తన సాహిత్యం ద్వార తీసుకు రావడానికి వీరు విశేషకృషి చేస్తున్నారు.

1994-95 సంవత్సరమునకుగానూ, రాష్ట్ర మనో రంజనివారు తెన్నేటికి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు అంద జేసి గౌరవించింది. అదే సంవత్సరంలో డా.సి.నా.రె చేతుల మీదుగా 'ఉపద్రష్ట సాహిత్య అవార్డు' అందుకున్నారు. వృత్తికి, ప్రవృత్తికి చక్కటి న్యాయం చేస్తూ రెండు రంగాల్లో గుర్తించబడ్డారు. తెన్నేటి శ్రీ తనికెళ్ళ భరణి చేతుల మీదుగా 'ఎన్.టి.ఆర్.స్మారక విశిష్ట అవార్డు' అందుకున్నారు. వీరి సాహితీ సేవలను గుర్తించి పశ్చిమ గోదావరి జిల్లా యువజన సర్వీసుల శాఖ వారు సాహిత్యం నందు 'యూత్ అవార్డు' అందజేసి ప్రోత్సహించారు.

వీరికి అష్టావధానం, మహా సహస్రావధానాల్లో కూడా ప్రవేశముంది. 1995 డిసెంబరు 3, 10న త్రివేణి ఆధ్వర్యాన రాష్ట్ర నలుమూలలా నుండి వచ్చిన పండితుల మధ్య శ్రీ ప్రభాకరశర్మగారి సంస్కృత శతావధానమందు పృచ్ఛకునిగా పాల్గొని సన్మానం పొందారు.

1996 ఫిబ్రవరి 1 నుండి 21 వరకూ హైదరాబాదు లలితకళాతోరణమందు జరిగిన బ్రహ్మశ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారి మహా సహస్రావధానం నందు పృచ్ఛకునిగా పాల్గొని సన్మానం పొందారు.

ఆకాశవాణి, దూరదర్శన్, పత్రికలు, స్టేజిలు, ఒక్కటేమిటి అన్ని చోట్ల వీరు మనకు తారస పడుతారు. వీరి సాహిత్యం ఇప్పటికే రాష్ట్రం నలుమూలలా వ్యాపించి పేరు సంపాదించి పెట్టింది. సమస్యలకు స్పందించే హృదయమున్న తెన్నేటి ఇక ముందు మరిన్ని కథానికలు మనకు అందించాలని ఆశిద్దాం!


రచయిత చిరునామా

**తెన్నేటి లక్ష్మీనరసింహ మూర్తి**

తెలుగు పండిట్, జడ్.పి.హెచ్. స్కూల్,

పిప్పర, అర్ధవరం,

గణపవరం మండలం,

ప.గో.జిల్లా - 534 197.





# ద్వారకా

ది **14-4-1931**న గుంటూరు జిల్లా 'గర్నెపూడి' గ్రామంలో పుట్టి, పెరిగిన ప్రముఖ కథకులు శ్రీ సి. హెచ్. వెంకటరత్నం 'ద్వారకా' అనే కలం పేరుతో ఎన్నో విలువైన కథలు తెలుగు కథాప్రియులకు బహుమతిగా అందించారు.

వృత్తి[illegible]త్తూరు జిల్లా 'అరగొండ'లో టీచర్‌గా చేరటంతో అప్పటినుండి 'రాయలసీమ' వాసులతో స్నేహాన్ని పెంచుకున్నారు. ఆరోజుల్లోనే ఉద్దండులైన పి. రాజగోపాలనాయుడు, కె. సభాలతో పరిచయం ఏర్పడటం వల్ల తనలోని సృజనాత్మకతను పెంచుకున్నారు. 'ఆంధ్రప్రభ' వారపత్రికలో వీరి కథలు ఎక్కువగా వెలుగుచూసాయి. ఇప్పటి వరకు సుమారు 60కి పైగా కథలు 'ద్వారకా' కలం పేరుతో ప్రచురించబడ్డాయి.

వెంకటరత్నం గారి కథాసంపుటి "సుఖాల తీరం" లోని కథలన్నీ ఆణిముత్యాలు పాఠకులచే విశేషంగా ప్రశంసలందుకున్న ఈ కథాసంపుటికి ఫిబ్రవరి19, 2001 సం.న చిత్తూరు జిల్లా యం. ఆర్. చంద్రట్రస్టు వారిచే ఉత్తమ కథాసంకలనంగా సత్కారం లభించింది.

కథారచనతోపాటు, నవలా, నాటక, ప్రక్రియలో కూడా ప్రవేశమున్న 'ద్వారకా' ఆ ప్రక్రియల్లో కూడా మంచి పేరు సంపాదించారు. వీరి నవల 'పల్లెపిలిచింది' 1989లో ఆంధ్రప్రభ(వార పత్రిక) నిర్వహించిన దీపావళి నవలల పోటీలో ద్వితీయ బహుమతి పొంది అనేక మంది పాఠకుల ప్రశంసలనందుకుంది. ఈ నవలకు 'నూతల పాటి' సత్కారం కూడా లభించటం విశేషం.

వీరి కథా సంపుటి 'సుఖాల తీరం' లో మొదటి కథ 'జలదాత'. ఈ కథలోకి తొంగిచూస్తే ఊరంతా నీటి కరవు సమస్యతో విచారిస్తుంటే ఓ పెద్దింటి పెద్దమనిషి ప్రతిరోజు ఊళ్ళోని వారందరికీ ఉచితంగా మంచినీళ్ళు సరఫరా చేస్తాడు. ఆయన త్యాగాన్ని, మంచితనాన్ని గుర్తించిన ప్రజలు ఆయనకి 'జలదాత' అనే పేరు బహుకరిస్తారు. అయితే ఆ పెద్దమనిషే పబ్లిక్ వాటర్ వర్క్సు మెయిన్ లైన్‌ను ఏకంగా తన భవంతి అడుగున రహస్యంగా కట్టించిన పెద్దట్యాంకుకు కలిపేసుకున్నారని ఊరిజనానికి తెల్సి వారికి కోపం వస్తుంది. అతన్ని శిక్షించాలనుకుంటారు ప్రజలు. కాని, ఆ రహస్యం బయటపడ్డ రాత్రే ఊళ్ళో కుంభ వృష్టి కురిసి జనానికి నీటి సమస్య తీరుతుంది. దాంతో వారి కోపం చల్లారుతుంది. అలా ఆ పెద్ద మనిషికి 'జలదాత' అనే నామం స్థిరపడిందంటారు 'ద్వారకా'. ఒక చిన్న సంఘటనను తీసుకొని కథలా మరల్చటం వారికి వెన్నతో పెట్టిన విద్య. ?క్కటి కథనశైలి, శిల్పం ఆయన కలానికే సొంతం. ఈ సంపుటిలో 'సన్మానం', 'సుఖాలతీరం' పాఠకుడిని పిలకపట్టుకొని చదివిస్తాయి. 'రాబోయే 15,20 సంవత్సరాలలో నగరవాసులు పల్లెలకు తిరుగు ప్రయాణం కడతారని సుఖమయ జీవితాలను కొనసాగిస్తారని 'ద్వారకా' గారి ప్రగాఢ విశ్వాసం.


రచయిత చిరునామా
**శ్రీ సి. హెచ్. వెంకటరత్నం**
1-112, శ్రీరాంనగర్,
అక్కరాంపల్లె రోడ్డు,
తిరుపతి - 517507.



## దాసరి అమరేంద్ర

రచనా వ్యాసంగాన్ని కేవలం తెలుగు భాషకు పరిమితం చేయకుండా ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్, హిందుస్థాన్ టైమ్స్, ఇండియన్ లిటరేచర్ వంటి ఆంగ్ల పత్రికల్లోనూ ప్రచురించి, తెలుగులోంచి ఇంగ్లీషులోకి అనువాదాలు చేసారు దాసరి అమరేంద్ర.

1953 మార్చి 14న పశ్చిమ గోదావరి జిల్లా 'ధర్మాజిగూడెం'లో శ్రీమతి నంబూరి పరిపూర్ణ – శ్రీ దాసరి నాగభూషణరావు దంపతులకు పుట్టిన బిడ్డ దాసరి అమరేంద్ర. 1970 దశకం నుండే కథలు రాస్తున్న వీరికి అభ్యుదయ సాహిత్యమంటే చాలా ఇష్టం.

ఇప్పటివరకు సుమారు 40 కథలు రాసిన దాసరి అమరేంద్ర ఎలిమెంటరీ చదువు కృష్ణా జిల్లా 'బంటుమిల్లి'లో, హైస్కూలు విద్య 'విజయవాడ'లో పూర్తి చేసి కాకినాడ ఇంజనీరింగ్ కాలేజీ నుండి బి.టెక్ 'బొంబాయి' ఎన్.ఐ.టి.ఐ.ఇ నుండి ఎం.టెక్ డిగ్రీలు పొందారు.

1975 ఫిబ్రవరి నుండి ఢిల్లీ శివార్లలోని 'ఘజియాబాద్' లో భారత్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్ అన్న ప్రభుత్వ రంగ సంస్థలో డిప్యూటీ జనరల్ మేనేజర్ (మార్కెటింగ్) హోదాలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహించిన దాసరి అమరేంద్ర, ప్రస్తుతం బెంగుళూరు నగరానికి బదిలీ అయ్యారు.

1993 లో ఇతను రాసిన మొట్టమొదటి కథ ఆంధ్రప్రభ వారపత్రికలో 'బ్రతకనేర్వని వాడు' శీర్షికన అచ్చయింది. ఆ తరువాత 'కుహురవం', 'మనిషీ ఓ మనిషీ', 'ఓటమిలేని ఆట', 'జెండా ఊంఛా రహే హమారా', 'తీర్పు', 'విజయ', 'కొత్తసీసాలో కొత్త కథ', 'పయనాలు', 'సెలవల్లో', 'చెదరగూడని స్వప్నాలు' మొదలైన కథలు పాఠకుల ఆదరణ పొంది కథకుడిగా దాసరి అమరేంద్రకు మంచి పేరు తీసుకొచ్చాయి. అమరేంద్ర కథలు అన్ని ప్రముఖ పత్రికల్లోనూ ప్రచురించబడ్డాయి. రచన, ఆహ్వానం, సాహిత్య నేత్రం, ఈనాడు, వనిత, ఆంధ్రప్రభ వంటి పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

వీరి కథ పద్మవ్యూహం పాఠకులను విశేషంగా ఆకర్షించింది. పట్టణ జీవితాలలో హడావిడి, ముఖ్యంగా రోడ్లమీద జన సమ్మర్ధం తద్వారా ట్రాఫిక్ జామ్‌లు యిత్యాది ఆధునిక జీవితపు అవరోధాలను బాగా రాసారు.

1997,98,99 సంవత్సరములకు ఢిల్లీలోని 'కథ' సంస్థవాళ్ళకు (తెలుగు భాషకు సంబంధించి) నామినేటింగ్ ఎడిటర్‌గా వ్యవహరించారు. 1997,98లలో ఢిల్లీలో జరిగిన కథాసదస్సు, కవితా సదస్సులకు ముఖ్య కార్యకర్తగా వున్నారు. 'తెలుగు సాహిత్యం, ఇతర భాషస్థులకు అందవలసినంతగా అందటం లేదన్న' ఆవేదన వల్ల స్వయంగా తెలుగు లోంచి ఇంగ్లీషులోకి అనువాదాలు చేయడంతో పాటు, ఢిల్లీలో ఉన్నరోజుల్లో జె. లక్ష్మిరెడ్డి వంటి సాహితీ మిత్రులతో కలిసి ఉత్తమరచనలను ఇంగ్లీషులోకి, హిందీలోకి అమరేంద్ర అనువదించి కృషి చేసారు. త్వరలో వీరి కథా సంపుటి విడుదల కానుంది. మన మంతా ఆ కథా సంపుటి కోసం ఎదురు చూద్దాం!


రచయిత చిరునామా
దాసరి అమరేంద్ర
116/2, రేస్‌కోర్స్ రోడ్,
బెంగుళూరు – 560 001.

# దాట్ల దేవదానం రాజు







వృత్తిరీత్యా 'ఇంజరం' జిల్లా పరిషత్ హైస్కూల్సులో ఉపాధ్యాయులుగా ఉంటూ, ప్రవృత్తి రీత్యా అనేక సాహితీ కార్యక్రమాలలో పాల్గొంటూ, కథలు, కవితలు రచిస్తూ రాష్ట్ర నలుమూలాల ఎందరో సాహితీ మిత్రులను, అభిమానులను పొందగలిగారు దాట్ల దేవదానంరాజు.

కోనసీమలో పుట్టి, ఆగర్త మీదే పెరిగి అక్కడి అందాలని మంచి ప్రతీకలతో ఒడుపుగా పట్టుకున్నారు. పచ్చని పంట పొలాలతో, త్రాచుపాములలాంటి కాలవలతో పడవాటి రహదారులతో, కొబ్బరి చెట్లతో ప్రశాంతంగా ఉండే కోనసీమ దృశ్యాలకు, అక్కడి ప్రజల జీవితాలు, వారికష్టాలు, ఆనందాలు, ఆచారవ్యవహారాలు, కర్షకుల శ్రమ.... వీటన్నిటినీ బాల్యం నుంచి తనదైన ప్రత్యేక పరిశీలాత్మక కోణంలో ఆలోచిస్తూ స్పందించాడు దాట్ల దేవదానంరాజు. ఆ స్పందనలకు అక్షర రూపం యిస్తూ తన కలం నుంచి ఎన్నో కథలు, కవితలు పాఠకలోకానికి అందించారు.

దేవదానం రాజు గారు ఇటీవల 'దాట్ల దేవదానం రాజుకథలు' అను కథాసంపుటిని ప్రచురించారు. ఇందులో వాస్తవికతకు దర్పణాలుగా 16 కథలు ప్రచురించారు. కథల్లో ఎక్కువగా వీరు నివసిస్తున్న 'యానాం' ప్రాంతపు వాతావరణం, అక్కడి అట్టడుగు వర్గాల ప్రజల సమస్యలు చిత్రితమయ్యాయి.

రాజు రాసిన అనేక కథలు అన్ని పత్రికల్లోనూ ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. కొన్ని కథలకు బహుమతులు లభించాయి. కోస్తా తీరాల్లో రొయ్యల చెరువులు తవ్వుతున్నప్పుడు భూమిని నమ్ముకున్న బడుగు రైతు అనివార్యంగా ఉన్న రెండెకరాలు అమ్ముకోవటం ఇతివృత్తంగా 'గుండె చెరువు' కథ రాస్తే, గడ్డు సమస్య (ఆర్థిక) వచ్చినప్పుడు పనిమనిషి సేవా తత్పరత గురించి 'దాపితల్లి' కథలో వివరిస్తారు.

ఎరుకలల సాంప్రదాయ జీవనాధారమైన పందుల పెంపకానికి మెదడువాపు వ్యాధి వల్ల వచ్చిన ఇబ్బందుల గురించి 'నల్లటి పెల' కథలో అద్భుతంగా రచించి, పాఠకుల మన్ననలు అందుకొన్నారు. అలాగే మారుమూల గ్రామీణ ప్రాంతాల్లో అగ్రవర్ణాలు, దళితుల పట్లచూపుతున్న అస్పృశ్యతా పరంపరల చిత్రణను బురద కథలో చూపుతారు. పెరటి చెట్టు నరికివేయడం వల్ల తండ్రి ఆవేదనను 'నీడచావు' కథలో అద్భుతంగా చెబుతారు.

2000 సంవత్సరంలో రాష్ట్ర సాంస్కృతిక మండలి, రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ సంయుక్తంగా నిర్వహించిన నవ రచయితల అధ్యయన శిబిరం-విమర్శకు 'యానాం' నుంచి ఎన్నికకాబడి హైదరాబాదులోని బోట్స్‌క్లబ్‌లో 15 రోజుల శిబిరంలో పాల్గొని ప్రముఖ విమర్శకుల మన్ననలందుకున్నారు.

వృత్తి ప్రవృత్తులకు న్యాయం చేస్తూ రెండు రంగాల్లో విశేషంగా కృషిచేస్తూ, ఎన్నో అవార్డులు, బహుమతులు పొందారు. 1999వ సం.లో జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు, 2000 సం.లో ముఖ్యమంత్రిగారిచే రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు పొందారు. సాహిత్యపరంగా వీరు రాసిన కవితా సంపుటికి 1997లో 'వానరాని కాలం' కు పరమం అవార్డు లభించింది.


రచయిత చిరునామా
దాట్ల దేవదానం రాజు
4-381, జక్రియానగర్,
యానాం - 533464.



# దిలావర్

సాహిత్య పరిచయం ఉన్న వాళ్ళందరికీ 'దిలావర్' అన్న పేరు సుపరిచితమే. భారతిలో కవిత అచ్చు కావటమే గొప్ప విషయంగా భావించే రోజుల్లో దిలావర్ గారి కవితలు, కథలు భారతిలో వరుసగా ప్రచురించబడ్డాయి.

ఈనాటి ప్రసిద్ధ పత్రికల్లోనే కాదు అలనాటి ప్రసిద్ధ సాహిత్య మాస పత్రిక భారతిలోనూ దిలావర్ కథలు, కవిత్వము, వ్యాసాలు ప్రచురించబడ్డాయి. ఇక ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, జాగృతి పత్రికల్లో విరివిగా మనకు కనిపిస్తుంటాయి. 'సమిధలు' అన్న నవల భారతి పత్రికలో సీరియల్‌గా వచ్చి ఆనాడు వీరికి రచయితగా ఎంతో గుర్తింపు తీసుకొచ్చింది. 'తుషార గీతిక' అనే నవల 'జయశ్రీ'లో సీరియల్‌గా వచ్చింది. 'ముగింపు' అనే మరో నవల కథాకళి (హై.బా) అన్న పత్రికలో ప్రచురించబడింది.

వృత్తిరీత్యా పాల్వంచలోని ప్రభుత్వ జూనియర్ కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా పనిచేసి ప్రస్తుతం విశ్రాంతి తీసుకుంటున్నారు. అయితే విశ్రాంతి తన వృత్తికి మాత్రమే. ప్రవృత్తి పరంగా దిలావర్ గార్కి 'రిటైర్డ్‌మెంట్' లేదు. ఇప్పటికే జిల్లా యువరచయితలతో పోటీపడి కవితలు, కథలు రాస్తూ సాహితీ సభల్లో చురుకుగా పాల్గొంటుంటారు.

'ప్రహ్లాద చరిత్ర-ఎర్రన-పోతన' అన్న తులనాత్మక పరిశీలనా గ్రంథం దిలావర్ ప్రచురించి సాహితీ ప్రియులకు అందించారు. దాశరథి కవితావ్యక్తిత్వ పరిశీలన అన్న సిద్ధాంత వ్యాసానికి గాను దిలావర్ డాక్టరేట్ డిగ్రీ పొంది 'డా. దిలావర్'గా తెలుగు సాహిత్యలోకానికి పరిచయమయ్యారు. 'వెలుగుపూలు', 'వెన్నెలరుప్పలు', 'జీవనతీరాలు', 'కర్బలా' కవితాసంపుటాలు ప్రచురించారు.

డా. దిలావర్ గారికి హైస్కూల్లో దాశరథి రంగాచార్యులుగారు తెలుగు పాఠాలు నేర్పిస్తే కీ.శే. కౌముది గారు కవిత్వంలో అ-ఆలు నేర్పారు. ఆంవత్స సోమ సుందర్ గారు వీరి కవితలతకు పందిరి వేసారు. విమర్శలో వీరికి, ప్రొఫెసర్ చేకూరి రామారావుగారు ఆదర్శకులుగా భావిస్తారు. చే.రా కుటుంబంతో వీరికి విడతీయరాని బంధం ఉంది.

డా. దిలావర్ కథలు ఓ పుస్తకంగా రాకపోవటం తెలుగు పాఠకులకు లోటేనని చెప్పాలి. వీరి కథ మార్పులో "మార్పు సహజమే. అనివార్యం కూడానూ. కానీ... మనలోంచి మనల్ని తీసివేసి ఉత్త డొల్లలుగా మిగిల్చే మార్పు ఎంతవరకు వాంఛనీయం?" అని ప్రశ్నిస్తారు. మరో కథ 'ముక్కుపుడక' ఓ అద్భుతమైన కథగా పాఠకుల ముద్ర లభించింది. చక్కటి కొసమెరు, సందేశం వీరికథల్లో మనకు కనబడుతాయి. ఉత్తమ పురుష లో అంటే 'నేను' అంటూ కథ ప్రారంభించటం దిలావర్ గార్కి చాలా యిష్టం. త్వరలో దిలావర్ ఓ కథా సంపుటి తీసుకువస్తున్నారు.

ఆకాశవాణి రాష్ట్రస్థాయిలో నిర్వహించిన కవిసమ్మేళనాల్లోనూ, రాష్ట్రరచయితల శిక్షణా శిబిరాల్లోనూ యింకా యీ వయసులో కూడా పాల్గొంటున్న దిలావర్‌గారు నేటి యువ రచయితలకు మార్గదర్శులు.


రచయిత చిరునామా
డా. యం. దిలావర్
'సిల్' క్యాంపస్, పాల్వంచ,
ఖమ్మం జిల్లా - 507154.



# దూరి వెంకటరావు

"మనసు స్పందించి కథ రాస్తేనే కాని పాఠకుడి హృదయంలో స్పందనరాదు" అంటారు విజయనగరానికి చెందిన కథకుడు దూరి వెంకటరావు.

వృత్తిరీత్యా 'పెదమాక' (కె. కోటపాడు మండలం) జిల్లాపరిషత్ హైస్కూల్ ప్రధానోపాధ్యాయుడిగా పనిచేస్తున్న దూరి వెంకటరావుగారు మొదటి సారిగా 'మహారాజా కళాశాలలో' డిగ్రీ చదువుతున్నప్పుడే కాలేజి మేగజైన్‌కు కథ రాసి అచ్చులో చూసుకున్నారు.

ఇంతవరకు సుమారు 250కి పైగా కథలు వివిధ దిన, వార, మాస పత్రికల్లో ప్రచురించబడ్డాయి. అయితే ఎక్కువగా ఆంధ్ర సచిత్ర వార పత్రిక, ఆంధ్రప్రభ వార పత్రిక, ఆంధ్ర భూమి దిన, వార పత్రికల్లో అచ్చు అయ్యాయి. వాటిల్లో కొన్నిటికి బహుమతులు కూడా వచ్చాయి.

1984 నుండి 1999 వరకు విస్తృతంగా బాలసాహిత్యం రాసారు. సుమారు 300పైగా కథలు బాలమిత్ర, బుజ్జాయి, బొమ్మరిల్లు, బాలభారతి, బాలరంజని లాంటి పిల్లల పత్రికల్లో వచ్చాయి. అలాగే బాలల నవలలు 'మూడు వింతలు', 'స్వర్ణమంజరి', 'మంత్రాలకు చింతకాయలు' బాలరంజనిలో సీరియల్స్‌గా వచ్చాయి. దూరి వెంకటరావుగారితో నాకు ఎంతో కాలంగా కలంస్నేహం ఉంది. 'బాలమిత్ర'లో మేమిద్దరం పోటీపడి కథలు రచించాం. వారునాకు కథారచనలో ప్రోత్సాహం, సూచనలు అందించిన గురువులు.

1994లో దూరివెంకటరావు గారి కథల సంపుటి 'ఆలంబనం' వెలువడి అనంతరం పాఠకుల ఆదరాభిమానాల్ని చూరగొంది. ఫలితంగా లభించిన ప్రోత్సాహంతో రెండవకథల సంపుటి 'బహుమతి' కూడా ప్రచురించారు. 'బాలి' గారు బహుమతి కథాసంపుటికి అందమైన ముఖచిత్రం అందించారు. అయితే ఇందులోని కథలు కూడా అంతకన్నా అద్భుతంగా తెలుగుసాహితీ ప్రియుల్ని ఆకట్టుకుంటాయనటంలో అతిశయోక్తిలేదు.

ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రం నుండి సుమారు 32కి పైగా నాటికలు, కొన్ని కథానికలు దూరి వెంకటరావుగారివి ప్రసారమయ్యాయి.

కథారచనతో పాటు నవలా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న దూరి వెంకటరావు 6 నవలలు రాసారు. ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 'త్రివేణీ సంగమం', 'కాల్‌గర్ల్' నవలలు సీరియల్స్‌గా వచ్చాయి. అలాగే 'సేల్స్‌గార్ల్', అంజలిమాసపత్రికలో 'రాగస్రవంతి' జ్యోతి మాస పత్రికలో, 'ఒంటరి మిత్రుడు' ఆంధ్రభూమి మాస పత్రికలో అనుబంధనవలలుగా వచ్చాయి. మరో రెండు నవలలు పరిశీలనలో ఉన్నాయి. గత రెండు సంవత్సరాలుగా దూరివెంకటరావు గారు బాల సాహిత్యానికి దూరంగా వుంటూ పెద్దల పత్రికలకు కథలు, మినీ నవలలు రాయటానికి సమయం కేటాయిస్తున్నారు. 'బహుమతి' కథా సంపుటి రచయిత దూరి వెంకటరావు మరిన్ని కథా సంపుటాలు పాఠకులకు 'బహుమతి'గా అందించాలని ఆశిద్దాం.

రచయిత చిరునామా
దూరి వెంకటరావు
25-10-30, దాసన్నపేట,
కళ్యాణ మండపం ఎదురుగా
విజయనగరం - 535002.

# డా. దేవరాజు మహారాజు



ది. 14-07-2002 నాడు 'సిరిసిల్ల'లో 'మారసం-సురమౌళి స్మారక పురస్కారం' అందుకున్న ప్రముఖ కథకులు డా.దేవరాజు మహారాజు ఫిబ్రవరి 21, 1951న వరంగల్లు జిల్లా 'కోడూరు' లో జన్మించారు.

డా. దేవరాజు మహారాజు తెలంగాణా ప్రజల భాషలో కవిత, కథ చెప్పి మెప్పించి, కవిగా, కథకుడిగా నిలబడ్డారు. భారతీయ భాషల కవిత్వాన్ని, కథల్ని తెలుగులోకి మళ్ళించి, సమకాలీన తెలుగు సాహిత్యానికొక కొత్తకిటికీ తెరిచారు.

ఇప్పటివరకు వీరివి 9 కథాసంపుటాలు వెలువడినాయి. 1997లో తెలంగాణా ప్రజల భాషలో కథలు రాసి 'కడుపు కోత' సంపుటిని కథా ప్రియులకందిచారు. తెలంగాణా ప్రాంత పాఠకులనే కాక రాష్ట్రంలోని, దేశంలోని తెలుగు పాఠకులను ఎంతో ఆకర్షించింది ఈ సంపుటి. 1984లో 'బుడుంగు', 'గుర్రముకు ఎగనామం' అనే చైనా జానపద కథలు పిల్లల కోసం ప్రత్యేకంగా రాయగా హైదరాబాద్ బుక్ ట్రస్ట్‌వారు ఈ రెండు సంపుటాలు ప్రచురించారు. 1991లో 'పాలు ఎర్రబడ్డాయి', 1993లో 'దేవరాజు మహారాజు కథలు' కథాసంపుటిని ప్రచురించారు. 'పాలు ఎర్రబడ్డాయి' కథ ఇటీవలె ఇంగ్లీషు మ్యాగజైన్ 'పయనీర్' లో ప్రచురించారు.

వృత్తిరీత్యా ప్రస్తుతం హైదరాబాద్‌లోని న్యూసైన్స్ కాలేజ్‌లో జంతుసాస్త్రం బోధిస్తున్నారు. ఉస్మానియా యూనివర్సిటిలో ఎం.ఎస్సీ పూర్తి చేసి 1970లో అదే విశ్వవిద్యాలయం నుండి జంతుశాస్త్రంలో డాక్టరేటు పట్టా అందుకున్నారు. తన కళాశాల మిత్రుడు బి.విద్యాసాగర్ రావు తో కల్సి 'పాలు ఎర్రబడ్డాయ్' కథా సంపుటి ప్రచురించారు. ఈ కథాసంపుటి లోని కథలు కల్పితాలు కావు. హైదరాబాద్ మహా నగరంలోని ఫుట్‌పాత్‌లు, వాటిమీద మనుషులనబడేవారి జీవితాలూ పరిశీలించి, స్పందించారు. అనుభవాన్ని, అర్థమైన సమాజాన్ని, అధ్యయనం చేసి మనిషిలోతుల్ని గాలికి ఎగిరిపోనీయకుండా తమకొత్త ఉడుకు రక్తంతో అక్షరాల్లో బిగించారు. ఆ అక్షరాలే 'పాలు ఎఱ్ఱబడ్డాయ్' కథల సంపుటిగా మనముందుకు వచ్చింది.

'దేవరాజు మహారాజు' కథల సంపుటి లోని కథలు పరిశీలిస్తే, మానవ నైజాన్ని సుతిమెత్తగా ఎత్తిచూపిన వ్యంగ్యరచనలుగా కనిపిస్తాయి. అంతేకాదు, ఒక ప్రయోగాత్మకంగా చేసిన 'డాక్యుమెంటరీ స్టోరీస్'లా కనిపిస్తాయి.

వెండితెర కవిత్వంగా కొనియాడ బడుతున్న భారతీయ సమాంతర సినిమాను విశ్లేషించిన మహారాజు గారు, జానపద సాహిత్య పరిశీలనను ఆధునిక యుగవైజ్ఞానిక స్పృహతో చేసారు. సమాజంలో శాస్త్రీయ అవగాహన పెంచటానికి విజ్ఞానశాస్త్ర గ్రంథాలు ప్రచురించారు.

రాష్ట్ర ప్రభుత్వ 'ఉగాది సత్కారం', తెలుగు విశ్వవిద్యాలయం 'కవితా పురస్కారం', 'దాశరథి దంపతుల' సత్కారం, 'జనహర్ష' సత్కారంతో పాటు కథల పోటీల్లో తొలి ఎక్స్‌రే పురస్కారం పొందిన దేవరాజు మహారాజు మరిన్ని మంచి కథలు ఇంకా అందిచాల్సిన అవసరం ఉంది.

రచయిత చిరునామా
**డా. దేవరాజు మహారాజు**
13, ఫేస్ 2, మధురానగర్ కాలనీ,
నాగారం - 501301.
హైదరాబాద్.





# దేవరాజు రవి

"రాయకుండావుండలేని బలహీనత కలవాడు రచయిత అవుతాడు. కథలో చివరి మలుపు చెప్పడం ముఖ్యం. అందువల్ల పాఠకుడు ఆ కథను తిరిగితిరిగి చదువుతాడు. అలాంటి కథలు మనకు చాలా తక్కువ" అంటారు ప్రముఖ కథకులు దేవరాజు రవి.

దేవరాజు రవి గారి అసలుపేరు దేవరాజు వెంకట సత్యనారాయణరావు. 1952 నుండి 1977 వరకు 'మాస్టర్ రవి' కలంపేరుతో అనేక కథలు రాసారు. అయితే మహాకవి, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా.సి. నారాయణరెడ్డిగారు 'మాస్టర్ రవి' అనే వీరికలం పేరును 'దేవరాజురవి'గా పునఃనామకరణం చేసారు.

ది.5-4-1939లో శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం దగ్గర 'మృత్యుంజయనగరం'లో జన్మించారు. వీరి చదువంతా ఒరిస్సారాష్ట్రంలోని గంజాం జిల్లాలోని బరంపురంలో జరిగింది.

1952లో 'బాబు' మాసపత్రికలో 'మారువర్తన' పేరుతో వీరితొలికథ ప్రచురించ బడింది. 'దేవరాజురవికథలు' అనే కథాసంపుటి ప్రచురించారు. తెలుగులో తొలి అపరాధ పరిశోధక నవల 'వాడే వీడు' (1912) రచయిత, 'విశాలాంధ్రవాణి' అనే త్రిభాషావారపత్రిక (తెలుగు, ఇంగ్లీషు, ఒరియా) సంపాదకుడు, ప్రచురణకర్త అయిన దేవరాజు వెంకట కృష్ణారావుగారు వీరి తండ్రి. అందుకే చిన్నతనంనుండీ కూడ రచయితగా గుర్తించబడాలన్న ఆలోచన, కృషి, పట్టుదల వీరిలో ఉండేవి.

కథాప్రక్రియలోనే కాకుండా ఇతర ప్రక్రియల్లో కూడా ప్రవేశమున్న రవి రెండు కవితాసంకలనాలు ప్రచురించారు. వేగుచుక్క, ఇదిహృదయం, పదకొండు తొలగిద్దాం, సగమం, ఎడారిలో కోయిల, కసి, మేముసైతం, వెన్నెల కురిసింది, ఆగండి... ఆలోచించండి, కల్యాణి కల్యాణం ఇంకా అదండీసంగతి, వేడివేడిపెసరట్టు (ఆంధ్రభూమి) ముద్దుల మహల్, వెనుతిరిగి చూద్దాం-వెన్నెలలుకందాం (పల్లకి), హ హ్హ...హహ్హ-నిజం..నిజం (ఆంధ్రప్రభ), సీ నీతికథలు (సితార), గతం గుర్తులు (మేఘ సందేశం), బాలీవుడ్ భామాయణం (నంబర్‌వన్) లలో ప్రత్యేక శీర్షికలు నిర్వహించారు. ఎనిమిది వందలకుపైగా వ్యాసాల్ని ఈనాడు, ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధాలలో ప్రచురించారు.

ఆకాశవాణిలో ఎడారిలో కోయిల (నవల) సీరియల్‌గా ప్రసారమైంది. యాభైకథలూ, నాటికలూ, చర్చలూ ప్రసారమయ్యాయి. దూరదర్శన్‌లో ముందేమేలుకో, భయంవద్దు, నిర్ణయం, జ్యోతి, అక్కయ్యపెళ్ళి, కళ్యాణి, నేను చచ్చిపోతేనే మంచిది, నానెందుకుసావాలి? మొదలైన నాటికలు ప్రసారమయ్యాయి.

కుష్టురోగులకు, ఎయిడ్స్ బాధితులకు సేవచేస్తూ సేవలోనే సంతృప్తి పొందడం అంటే వీరికి ఇష్టం. ఎన్నో సాహితీసంస్థలు, కళాసంస్థలనుండి అవార్డులు, సన్మానాలు పొందిన దేవరాజురవిగారిని 2002 ఆగష్టు నెలలో రాష్ట్ర ముఖ్యమంత్రి నారాచంద్రబాబు నాయుడుగారు రవీంద్రభారతిలో ఆత్మీయతాభి నందనలతో సత్కరించటం మధుర జ్ఞాపకమంటారు.

రచయిత చిరునామా
దేవరాజురవి
1-64/డి, ఫస్ట్‌ఫ్లోర్, భాసయ్య బిల్డింగ్స్,
కూకట్‌పల్లి, హైదరాబాద్ - 72

# దోరవేటి







"'మధురాంతకం' వారి లాంటి 'మంచిరచయిత'గా పేరు తేచ్చుకోవాలన్నది నా ఆశయం" అంటారు ప్రముఖ యువ కథారచయిత 'వి. చెన్నయ్య'. 'దోరవేటి' అనే చిన్న పల్లెలో పుట్టిన 'చెన్నయ్య' గారు తన జన్మస్థలంపై ప్రేమతో 'దోరవేటి' కలం పేరుగా తెలుగు పాఠకులకు చక్కటి కథలనందిచారు.

వృత్తిరీత్యా చిత్రకళోపాధ్యాయులుగా పనిచేస్తున్న దోరవేటి యిప్పటి వరకు ముప్పైకి పైగా కథలను సరిక్రొత్త కథావస్తువులను ఎన్నుకొని వినూత్నశైలిలో రాసారు. వీరి కథలు ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఈనాడు, స్వాతి, జాగృతి, మూసీ పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

తెలంగాణా ప్రముఖ కథకులుగా గుర్తించబడ్డ కాలువ మల్లయ్య, ఐతా చంద్రయ్య బి.యస్.రాములు, అల్లం రాజయ్య మొదలగు కథకుల వారసుడిగా 'దోరవేటి' ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు.

ఇప్పటి వరకు రెండు కథా సంపుటాలు ప్రచురించి తెలుగు సాహితీ ప్రియులకు అందించారు 'దోరవేటి'. 1999 సం.లో 'అమృతఝరి', 2000 సం. లో 'జెరజూస్కో' కథాసంపుటాలు విడుదలై 'దోరవేటి' ని ఉన్నత స్థాయి కథకుడిగా నిలబెట్టాయి. 1997-98 సం.లో 'అమృతఝరి' కథా సంపుటికి కథకు ఉత్తమ కథగా బహుమతి, 1999-2000 సం.లో 'అమృతఝరి' కథా సంపుటికి 'జాతీయసాహిత్య పరిషత్', సిద్ధిపేట వారి 'ఉత్తమ కథాసాహిత్యం' అవార్డు లభించాయి. తన కథలకు ఎన్నో సంస్థలు సన్మానాలు అందచేసాయి.

కథకుడే కాక చిత్రకారుడు కూడా అయిన 'దోరవేటి' తన కథాసంపుటాలకు ముఖచిత్రం, కథలకు తగినట్లుగా చిత్రాలు తనే సృష్టించారు. ఆ చిత్రాలు కూడా పాఠకులను ఆలోచింపజేయటం విశేషం.

'అమృతఝరి', 'గురుదేవోభవ', 'పొరుగింటి చేదుకూర', 'మూడో మనిషి', 'సన్మానం', 'మార్గదర్శి', 'తల్లివేరు', 'కల', 'నేనూ కర్ణుడినే' కథలు చక్కటి సందేశాన్ని అందిస్తాయి. అన్ని కథల్లోనూ 'కొసమెరుపు' తప్పసరిగా ఉండేలా చూసుకున్నారు దోరవేటి.

తెలంగాణా మాండలికం మీద పట్టు ఉన్న దోరవేటి అవసరమైన చోట మాండలికం ఉపయోగిస్తూ, తనదైన 'శైలి'లో అద్భుతంగా రాసారు. వీరి కథల్ని చదివినప్పుడు శిల్పం తెలిసిన చేయి తిరిగిన రచయితలా 'దోరవేటి'ని గుర్తించక తప్పదు. చిన్న కథకు ఉండవలసిన లక్షణాలన్నీ పాటిస్తూ, విలువల పట్ల మక్కువతో పాఠకుల్ని ఆలోచింప జేసే ప్రయత్నం తన కథల్లో చేసే 'దోరవేటి', తన ఆశయమైన 'మధురాంతకం రాజారాం' లా పేరు తెచ్చుకోవటం ఏ మాత్రం కష్టతరం కాదని స్పష్టంగా తెలుస్తుంది. తెలంగాణాలో గుర్తింపు పొందిన యువ రచయితగా దోరవేటి విశిష్ట స్థానం సంపాదించుకున్నారు.


రచయిత చిరునామా
**దోరవేటి**
ఇ.నెం. 3-2-759/1
మల్లికార్జున నిలయం, రహమత్‌బాగ్,
కాచిగూడ, హైదరాబాదు - 27





# నందిగం కృష్ణారావు

"కథా సాహిత్యంలో మౌఖిక సంప్రదాయాన్ని తీసుకొచ్చి కథా రచనని మరింత బలోపేతం చేయాలన్నదే నా ఆకాంక్ష. రచయితలు, కవులు, కళాకారులు రాజ్యంలో అంతర్భాగం కాకూడదు. వాళ్ళు రాజ్యాన్ని వ్యతిరేకించాలి. స్టేట్‌లెస్ సొసైటీ స్థాపించటమే లక్ష్యంగా కలిగి వుండాలి" అంటారు ప్రముఖ కథకులు నందిగం కృష్ణారావు.

అదిలాబాద్ జిల్లా 'బెల్లంపల్లి' లో జన్మించిన కృష్ణారావు గారు 1977 సం. నుండి కథలు రాస్తున్నారు. ఇప్పటివరకు 92 కథలు ఒక నవల వెలవరించిన వీరి మొదటి కథ 'జనతా భోజనం' అచ్చుకు నోచుకోలేదని నిర్మొహమాటంగా చెప్పుకుంటారు. 1978 లో 'ఏ తల్లి కన్న బిడ్డో' కథ ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రికలో ప్రచురించబడింది. ఆ తరువాత వీరు రాసిన కథలు అన్ని దిన, వార పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

నందిగం కృష్ణారావుగారు రాసిన కథల్లో అత్యంత ప్రాచుర్యం పొందిన కథ "కమ్యూనిస్ట్ గాడిద" సృజన మాస పత్రికలో ప్రచురించబడింది. ఈ కథ కన్నడంలోకి అనుదించబడింది. ఆంధ్రజ్యోతి వార పత్రికలో వెలువడ్డ "తిరగబడ్డ ధర్మం" హిందీ భాషలోకి అనువదించబడింది. హిందీ లో "ధరమ్ కా ఉల్టా ఫల్" పేరిట డి.డి.1లో సీరియల్‌గా వచ్చింది. 'తిరగబడ్డ ధర్మం' కథా సంకలనానికి ప్రముఖ కథకులు శ్రీ మధురాంతకం రాజారాం స్మారక (కథా కోకిల) అవార్డు 5-10-2000న వీరికి లభించటం విశేషం. 'నాలుగు కాళ్ళ న్యాయం' పేరిట మరో కథా సంకలనం వెలువరించారు. సుప్రభాతం వార పత్రికలో సీరియల్‌గా వెలువడిన 'చీకట్లో నల్లపిల్లి' నవల ఇటీవల పుస్తక రూపంలో ప్రచురించబడింది.

"నాకు తెలిసిన జీవితాన్ని, నేను నమ్మిన విశ్వాసాల్ని, నా అంతర్లోకాల్ని నా సాహిత్యంలో ఆవిష్కరించాలనీ నమ్ముతాను. పూర్తి చెయ్యాని కథల్లోని పాత్రలు నా వెంటపడి నన్ను నిద్రకు దూరం చేస్తుంటాయి" అంటారు నందిగం కృష్ణారావుగారు.

వృత్తిరీత్యా "హైకోర్టు" లో న్యాయవాదిగా వుంటూ ఎక్కడ అన్యాయం జరిగినా సహించని మనస్తత్వంతో ఒకవైపు తన వృత్తితోటి, మరోవైపు తన ప్రవృతి కథా రచనల తోటి, సమాజాన్ని ప్రశ్నిస్తారు, సంఘాన్ని తట్టి లేపుతారు. అన్యాయాన్నీ అక్రమాల్ని ఎదిరిస్తారు కృష్ణారావుగారు. ప్రభుత్వ గెజిట్‌లలా వెలువడే పత్రికల్లో రచనలు చేయటం ఇష్టం లేదని తన అభిప్రాయం వ్యక్తం చేస్తారు కృష్ణారావు.

ప్రముఖ కథకురాలు అబ్బూరి ఛాయాదేవిగారు, "నందిగం కృష్ణారావుగారు అక్షరాలా న్యాయవాది అనటానికి వారి కథా సంపుటి 'నాలుగు కాళ్ళ న్యాయం' సాక్ష్యం. అన్యాయానికి గురి అవుతున్న ప్రజలు ఎప్పటికయినా కళ్ళు తెరచి, న్యాయదేవత కళ్ళు తెరిపించాలనే తపనతో న్యాయవ్యవస్థ నడుస్తున్న తీరుని నగ్నంగా మన కళ్ళ ముందుంచుతారు, న్యాయవ్యవస్థలో వున్న రచయిత కృష్ణారావు. సాక్షి అనే కలం పేరుతో ఆ రోజుల్లో రావిశాస్త్రి గారే రాసారేమోనని భ్రమింపజేసిన కథా రచయిత కృష్ణారావు" అంటారు.


రచయిత చిరునామా
**నందిగం కృష్ణారావు**
బ్లాక్ నెం. 7, ఫ్లాట్ నెం. 10,
యం.ఐ.జి 11, ఏ.పి.హెచ్.బి.,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు - 044.

# డాక్టర్ నలిమెల భాస్కర్



కరీంనగర్ జిల్లా ఎల్లారెడ్డిపేట మండలం 'నారాయణపూర్' గ్రామంలో ది 12-02-1956న జన్మించిన డా. నలిమెలభాస్కర్ తెలంగాణా పల్లెసీమకు చెందిన ప్రముఖ కథకులు.

వృత్తిరీత్యా వరంగలు జిల్లా ధర్మసాగర్ జూనియర్ కాలేజీలో తెలుగు ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు. 1996లో వీరు ప్రచురించిన "అద్దంలో గాంధారి - మరి పదకొండు కథలు" అనే కథాసంకలనం లో నేరుగా పది భారతీయ భాషా కథల్ని తెలుగు చేసారు. అంతే కాకుండా అలెొట్టి 'సిటీలైఫ్', బి.ఎస్. రాములు 'పాలు' మరియు ప్రసిద్ధకథా సంకలనం 'శ్వేతరాత్రులు' ను తెలుగు చేసారు. 'తెలుగు సామెతలు- ద్రావిడ భాషలతో తులనాత్మక పరిశీలన' ఎం. ఫిల్‌ను, 'మళయాళ సామెతలు - కుటుంబ జీవన చిత్రణ' పేర పిహెచ్.డి పూర్తి చేసారు. కొన్ని నెలల క్రితం 'ఆంధ్రజ్యోతి' దిన పత్రిక ఆదివారం అనుబంధంలో 'సాహితీసువూలు' శీర్షికను 11నెలలు విజయవంతంగా నడిపి సాహితీ ప్రేయుల మన్ననలు పొందారు. ప్రసిద్ధ తెలుగు కవుల కవితల్ని 'తమిళ తోటలో తెలుగుకోయిలలు' పేరుతో అనువదించి ప్రచురించారు.

పట్టుదలకు మరో పేరైన నలిమెల భాస్కర్ కేవలం తెలుగు భాషనేకాక, హిందీ, ఇంగ్లీషు, కన్నడ, తమిళం, మళయాళం, మరాఠి, బెంగాళీ, అస్సామి, ఒరియా, పంజాబి, గుజరాతి, సంస్కృతం మరియు ఉర్దూ భాషలలో రాయటం, చదవటం, మాట్లాడటం నేర్చుకున్నారు. దీంతో అన్ని భాషల్లో వున్న సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివారు.

"ఇతర భారతీయ భాషల్లో కన్నా ముందు మన సాహిత్యం ఆంగ్లంలోకి, హిందీలోకి వెళ్ళాలి. తెలుగు సౌరభాలను మొత్తం దేశానికి పర్యాప్తం చెయ్యాలన్నా, ప్రపంచ వ్యాప్తం చెయ్యాలన్నా ఆ రెండు భాషల్లోకి తక్షణం తర్జుమా జరగాలి. ఇతర భాషా సాహిత్యాలకు ఏ మాత్రం తీసిపోని కథలూ, కవిత్వమూ మనకున్నాయి" అంటారు నలిమెల భాస్కర్.

1983 ప్రాంతంలో అనువాదాలకు శ్రీకారం చుట్టిన నలిమెల మొదటగా 'మంజీర' కోసం తగళి శివశంకర్ పిళ్ళై రాసిన 'పాకీ మనిషి కొడుకు' ను అనువదించటంతో పాటు వందలాది ఇతర భాషా కథల్ని తెలుగు చేసారు. 1983 లో 'మలయాళ మనోరమ' పత్రిక నూరేళ్ళ మలయాళ సాహిత్యంలోని పది ఉత్తమ కథలను ఎంపిక చేయగా 'నూరేళ్ళ పది ఉత్తమ మలయాళ కథలు' పేరిట వాటిని సంకలనంగా తెచ్చారు. తెలుగు విశ్వవిద్యాలయం 'అనువాదపురస్కారం' తో పాటు అనేక అవార్డులందుకున్న గొప్ప అనువాద కథకులు భాస్కర్.


*రచయిత చిరునామా*

**డాక్టర్ నలిమెల భాస్కర్**

*25-4-279, విష్ణుపురి,*

*కాజీపేట, వరంగల్ జిల్లా.*



# నల్లూరి రుక్మిణి



రుక్మిణి గారి కథలు సమాజ రీతిని సూటిగా ప్రశ్నిస్తాయి. మానవ సంబంధాలు ఆర్థిక సంబంధాలుగా మారిన సమాజంలో భార్యను అర్థాంగిగా కాక సంపాదనాపరురాలిగా చూడడం వారు ఖండిస్తారు. కథా కథనంలో నీతి బోధలాంటి శిల్పం కన్పిస్తుంది. వస్తువులో కొత్తదనం పాఠకులను ఆలోచింపజేస్తుంది.

ప్రకాశం జిల్లా చీమకుర్తి మండలం 'కూనంనేని వారి పాలెం' లో 48 సంవత్సరాల క్రితం కళ్ళు తెరిచిన నల్లూరి రుక్మిణి మనకున్న స్త్రీ వాద రచయిత్రులలో ఒకరు. 1982 నుండి స్త్రీ వాద దృక్పథంతో ఏర్పడిన తర్వాతే రచనలు చేయాలన్న సంకల్పం రుక్మిణి గారికి కల్గింది. స్త్రీవాద ఉద్యమం ఎంతో ప్రభావితం చేసింది. అప్పటి నుండి ప్రధానంగా స్త్రీల సమస్యలపై మహిళా సంఘాలతో కలిసి పనిచేస్తున్నారు.

చీమకుర్తి హైస్కూల్లో 8వ తరగతి, ఒంగోలులో మెట్రిక్, గుంటూరులో డిగ్రీ, 'లా' కోర్సు పూర్తి చేసిన నల్లూరి రుక్మిణి గారు, వృత్తిరీత్యా ప్రస్తుతం గుంటూరులో ప్రాక్టీసు చేస్తున్నారు. 1967 లో చదువు నిమిత్తం గుంటూరు వచ్చిన వీరు అప్పట్లో ఏ.ఐ.ఎస్.ఎఫ్. తో పరిచయం ఏర్పడింది. అక్కడి నుండి ఈ 33 సంవత్సరాలుగా వామపక్ష భావాలతో అంటిపెట్టుకొని వున్నారు.

రచయిత్రిగా రుక్మిణిగారు 'గీతల కావల' కథాసంపుటి ప్రచురించారు. అలాగే 'ప్రశ్నే ప్రశ్నార్థకమైన వేళ' కవితా సంపుటి ప్రచురించి తెలుగు సాహితీ ప్రియులకు అందించారు. వీరి కథల్ని లోతుగా పరిశీలిస్తే స్త్రీల సమస్యల పట్ల, పూర్తి అవగాహనతో ఇన్‌వాల్వ్‌మెంట్‌తో రాసినట్లు స్పష్టంగా కనిపిస్తాయి. వీరి కథల్లో అధిక భాగం స్త్రీల సమస్యలు, కుటుంబ సమస్యలు వున్నా కొన్ని కథల్లో ఇతర అంశాలు స్పృశించక పోలేదు.

1967 నుండి విద్యార్థి ఉద్యమాలలో చురుకైన పాత్ర వహించి అనేక పోరాటాలలో పాల్గొన్నారు. 1969 నుండి 'నక్సల్బరీ' ఉద్యమ ప్రభావం కలిగి విప్లవోద్యమాలలో వీరివంతు కృషి చేసారు. కమ్యూనిష్టు పార్టీ, మార్క్సిస్ట్ భావజాలం వీరి అవగాహనకెంతో మేలు చేసాయని ఇప్పటికీ భావించే రుక్మిణి గారు, 1982 వరకు జననాట్య మండలితో కలిసి ప్రయాణం చేసారు.

1974 నుండి 'విప్లవ రచయితల సంఘం' సభ్యురాలిగా వుంటూ వచ్చిన వీరు నిజానికి రాసిన కథలు రాశిలో తక్కువనే చెప్పాలి. పని పట్ల ఆసక్తి ఎక్కువ గల వీరు గ్రామీణ జీవితం నుండి వచ్చిన సుగుణంగా భావిస్తుంటారు. ముప్పై ఏళ్ళుగా ప్రజా జీవితంలో వుండడం నామమాత్రంగాకాక ఈ నాటికి వీరి శక్తిమేరకు పని చేస్తున్నారు.

న్యాయవాద వృత్తిలో వున్న నల్లూరి రుక్మిణి కథకురాలు కావటం పాఠకుల అదృష్టం. అన్యాయానికి గురవుతున్న ప్రజల సమస్యలను ఒక వైపు తన వృత్తితోనూ, మరోవైపు తన కలంతోనూ పోరాడుతూ పరిష్కార మార్గాలను సూచిస్తున్నారు. న్యాయవాద వృత్తిలోనే వుండి కథలు రాసిన ప్రముఖ కథకులు రా.వి. శాస్త్రి గారు, ప్రస్తుతం రాస్తున్న యువ కథకులు నందిగం కృష్ణారావు బాటలో నడుస్తూ, వినూత్న కథా వస్తువులను ఎప్పటికప్పుడు ఎన్నుకుంటూ, కథా రచయిత్రిగా తన వంతు సహకారాన్ని అందిస్తున్న నల్లూరి రుక్మిణి, నేటి యువ కథకులకు మార్గదర్శకురాలు.


రచయిత్రి చిరునామా
**నల్లూరి రుక్మిణి**
*సి-132, ఎస్.వి.ఎస్. కాలని,*
*గుంటూరు - 6.*



# నను మాసస్వామి

'ననుమాసస్వామి' అనే పేరు ఎంత వినూత్నంగా ఉందో వీరి కథలు కూడా అంతే వినూత్నంగా సరికొత్త కోణంలో చెప్పబడివుంటాయి. 'నను మాసస్వామి' ఇప్పటి వరకు రాసిన కథలు కేవలం '16' మాత్రమే. అయితేనేం, ఆ కథలే వీరిని కథకుడిగా సాహితీ శిఖరాలను చేర్చాయి.

"అనుభవం కలిగిన తెలుగు అధ్యాపకులకు ప్రక్రియలన్నింటి మీద లాక్షణికంగా ఆధిపత్యం ఉండడం సహజం. అయితే, రచన కోసం స్వీకరించే వస్తువుని, కథాంశాన్ని బట్టి, ఇతివృత్తం నిమిత్తం నిర్దేశించుకునే పరిధిని బట్టి ఏ ప్రక్రియ నప్పుతుందో దాన్నే చేపట్టడం సబబు. అందువల్ల నా లాంటివాళ్ళు ఒకటి కంటే ఎక్కువ ప్రక్రియల్ని చేపట్టడం సామాన్యంగా జరుగుతుంది. ప్రక్రియా పరమైన అన్నిరచనలకు న్యాయం జరగాలనే నేను తపన పడుతుంటాను" అంటారు ప్రముఖ కథకులు నను మాసస్వామి. వృత్తిరీత్యా వీరు తెలుగు ఉపన్యాసకులు.

1977లో రచనా వ్యాసంగాన్ని ప్రారంభించినా 1983లో వీరు కథా ప్రక్రియకు శ్రీకారం చుట్టారు. వీరి కథలు 'ఆంధ్రప్రభ' వార పత్రికలోనూ, 'ఆంధ్ర భూమి' ఆదివారం అనుబంధం లోనూ, 'మూసి' మాస పత్రిక లోనూ విరివిగా ప్రచురించబడ్డాయి. వేదగిరి కమ్యూనికేషన్స్ 'సరికొత్త కథ' కథాసంకలనంలో వీరి కథ 'బతుకు భయం' చోటు చేసుకుంది. ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి అప్పుడప్పుడూ వీరి కథలు ప్రసారమవుతాయి.

1993లో "కథావేదిక"ని హైదరాబాద్‌లో ప్రారంభించి, దేశంలోని తెలుగు కథా రచయితలని ఒకే వేదిక మీదికి తీసుకు వచ్చారు. ఈ విశయంలో వీరిని మనమంతా ప్రత్యేకంగా అభినందించాలి. అదే సంవత్సరం "కథాసమితి" సంస్థని నెలకొల్పి, నెలనెలా కథా గోష్ఠుల్ని నడిపి తెలుగు కథ మరింత వేగంగా ముందుకు పోవటానికి దోహదపడ్డారు. 'కథాసమితి'లో ప్రముఖ కథకులు 'వాకాటి', దాశరథి, చంద్ర (ఆర్టిస్టు), కేతు, మృణాళిని గార్లచే కార్యవర్గాన్ని ఏర్పాటు చేసి ఆ సంస్థకు వీరు 'కన్వీనర్'గా మూడు సంవత్సరాలు విశేష కృషి జరిపారు. కథా సాహిత్యం గురించి వివిధ కోణాల్లోంచి అనేక పత్రికా వ్యాసాల్ని రాసారు. 1993 లోనే వీరు రాసిన 'గుంటీలు' కథ ఆంధ్రప్రభ వార పత్రికలో ప్రచురించబడి వీరికి కీర్తి తెచ్చిపెట్టింది.

'భయం' ప్రస్తావన తెస్తూ ననుమాసస్వామి రాసిన 'బతుకుభయం', 'కోర్టుభయం', 'కాకిభయం', 'ఆమె భయం', కథలు ప్రతికథాభిమాని తప్పక చదవవలసినవి.

1996లో పూర్ణచంద్రరావు స్మారక అవార్డు, 1998లో మహాకవి జాషువ అవార్డు అందుకున్న నను మాసస్వామి 2000 సం॥లో "గంటీలు" కథా సంపుటితో పాటు 13 గ్రంథాలను ప్రచురించి తెలుగు సాహితీ ప్రియులకు అందించారు. వీరు మరిన్ని మంచి కథలు అందించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

రచయిత చిరునామా
ప్రొఫెసర్ నను మాసస్వామి
డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు,
కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సోషల్ సైన్సెస్,
ఉస్మానియా యూనివర్సిటీ
హైదరాబాద్ - 500007.



# నాశబోయిన నరసింహ

"యదార్థమనే బంగారానికి కల్పననే కొద్దిపాటి రాగిని కల్పినపుడు మెరిసే అందమైన ఆభరణమే కథానిక" అంటారు నరసింహ. 'నల్గొండ' జిల్లాకు చెందిన వీరు సైన్సు ఫిక్షన్ కలిగిన రచనలు నేడు చాలా అరుదుగా చేస్తున్నారు.

ప్రముఖ సైన్స్ కథారచయిత కె.బి.గోపాలం గారి సలహాపై నరసింహ వినూత్నంగా తన రచనలు ఎక్కువగా సైన్స్ ఫిక్షన్ చెందినవి రాయటం తెలుగు పాఠకుల అదృష్టం. వీరి కథలు అన్ని పిల్లల పత్రికల్లోనూ ప్రచురించబడ్డాయి.

వృత్తిరీత్యా కొంతకాలం అధ్యాపకుడిగా వున్నా, ప్రస్తుతం వైద్య ఆరోగ్య శాఖలో సేవలందిస్తున్నారు. నరసింహ రాసిన సైంటిఫిక్ ఫిక్షన్ కథ "చిలుకమ్మ ప్రయోగం" పలువురి ప్రశంసలందుకుంది. ఈ కథలో చిలుకమ్మ కోసారి చిన్న సందేహమొస్తుంది 'తాము ఆకుపచ్చగా వున్నాం. చెట్లు ఆకుపచ్చగా వున్నాయి. అటువంటప్పుడు తామెందుకు స్వయంగా, ఆహారాన్ని తయారుచేసుకోలేకపోతున్నాం అన్నచోటి నుండి.... కథ ఆరంభమై హాస్యపూరితంగా, ఆలోచనా భరితంగా కథ నడుస్తుంది. చిలకమ్మ అన్నింటినీ ప్రశ్నించి చివరికి జామ చెట్టుని అడుగుతుంది. అప్పుడా చెట్టు తామెందుకు ఆకుపచ్చగా ఉండి తిండిని తయారుచేసుకుంటున్నామో, చిలకమ్మ పచ్చగా వుండి కూడా ఎందుకు ఆహారం తయారు చేసుకోలేదో వివరిస్తుంది. సైన్సు టెక్నిక్ పదాలను సులువైన రీతిలో విశ్లేషించటంతో కథ ముగుస్తుంది.

'మానవదైవం' అనే మరో కథలో "దేవుడు కోవెలలోని విగ్రహాల్లో లేడు ప్రతిజీవి అంతరంగాల్లో అంతర్లీనమై వున్నాడు" అని నరసింహ ఈ కథ ద్వారా అద్భుతంగా చెబుతాడు.

మూఢనమ్మకాలు, అజ్ఞానాంధకారాల్ని చీల్చుతూ పాఠకుల్ని విజ్ఞాన తేజోకిరణాలను చేయాలని, నరసింహ ఎంత ప్రయత్నించాడో 'అది భూతం కాదు సైన్సు అద్భుతం' కథ చదివితే తెలుస్తుంది. మారుమూల పల్లెటూరులో జరిగే 'దిష్టి' అనే మూఢనమ్మకాన్ని ఈ కథలో 'సైన్సు ప్రయోగం'లో వమ్ముచేస్తాడు. దెయ్యాలు, భూతాలంటూ మంత్రగాళ్ళు అనే చేతగాని సన్యాసులు మన తల్లిదండ్రుల్ని, తాతల్ని ఎలా మోసం చేశారో వారి అజ్ఞానాన్ని ఆసరా చేసుకొని ఎలా జేబులు నింపుకున్నదీ వివరంగా ఓ విద్యార్థితో చెప్పించారు. సైన్సు మీద అభిరుచి పెరిగేలా సైన్సు గమ్మత్తుల్ని తెలిపే ప్రయోగాల్ని ఈ కథలో వివరించి ముగించారు. ఎక్కువగా బాలసాహిత్యానికి సంబంధించిన రచనలే చేసిన వీరి కథలు ఆసాంతం చదివిస్తూ ఒక సందేశంతో ముగుస్తాయి. సాహిత్యం కేవలం మానసిక ఆనందానికే కాకుండా మనిషిని మనిషిగా మార్పు తీసుకురావాలని అభిప్రాయ పడతారు. సైంటిఫిక్ ఫిక్షన్ కథలు రాస్తున్న పురాణపండ రంగనాథ్ అంటే వీరికి ఎంతో అభిమానం.


రచయిత చిరునామా

**నాశబోయిన నరసింహ**

హెల్త్ అసిస్టెంట్, పెద్దకాపర్తి,

చిట్యాల మండలం

నల్గొండ జిల్లా - 508114.



# డా. పరుచూరి రాజారామ్

1940 మార్చిన 'తెనాలి' లో జన్మించిన ప్రముఖ కథకుడు డాక్టర్. పరుచూరి రాజారామ్ వృత్తిరీత్యా వైద్యులు. 1965లో ఎం.బి.బి.ఎస్. పట్టాను పొందిన అనంతరం 'డిప్లమా ఇన్ డెర్మటాలజీ' స్వీకరించి నిన్నటి వరకు గుంటూరులో చర్మవ్యాధుల నిపుణునిగా ప్రాక్టీసుచేసారు.

కథ, నవల, అనువాదం, పాపులర్‌సైన్సు రచయితగా మంచి గుర్తింపు పొందారు డాక్టర్.పరుచూరి రాజారామ్. 1982లో వీరి కథా సంపుటి 'చల్లని మంట', 1990 సం॥లో. మరో కథాసంపుటి 'ఇది నాపువ్వు' ప్రచురించి తెలుగు కథాప్రియులకు కానుకగా అందించారు రాజారామ్.

శరీరానికి జబ్బుచేస్తే డాక్టర్ ఎంత అవసరమో సమాజానికి జబ్బుచేస్తే రచయితలు అంతే అవసరం. రచయితలకి పాఠకులనాడి తెలియటం చాలా అవసరం. అయితే రాజారామ్‌గారికి వృత్తిరీత్యా ప్రవృత్తిరీత్యా, పాఠకుల నాడి బాగా తెలిసినవారు కావటంతో, వీరి కలం నుండి వెలువడిన కథలన్నీ పాఠకుల మన్ననలు అందుకున్నవే!

'సాహిత్యానికి పిచ్చెక్కింది' అనే రాజారామ్ కథలో కథావస్తువు, శిల్పం అద్భుతంగా కనిపిస్తాయి. అన్యాయాల్ని, దగా దోపిడీల్ని భరిస్తూ, సహిస్తూ మెత్తనివాళ్ళుగా తలవంచుకొని వెళ్ళిపోతుంటే ఎవరికైనా పిచ్చెత్తడం ఖాయం. మెత్తగావుంటే మొత్త బుద్ధౌతుందున్నట్లు... ఈకథలో చివరికి సత్యానికి కూడా పిచ్చెక్కుతుంది. ఆలోచనీయమైన కథావస్తువు. నిజానికి వీరి కథలు చాలా వరకు ఏదో ఒక సందేశం తప్పనిసరిగా ఇస్తూంటాయి. ఆకాశవాణి విజయవాడ కేంద్రంనుండి వీరి కథానికలుఅనేకం విరివిగా ప్రసారమైనాయి.

1996లో కాకతీయ కళాపరిషత్ వారు వీరి కథలకు, నవలలకు గుర్తింపుగా 'కొడవటిగంటి నవలా అవార్డు' ఇచ్చి గౌరవించారు. కథా రచనతో పాటు, నవలా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న రాజారామ్ రాసిన 'పునరావృతం' నవల 1974లో ప్రచురించబడింది. 1977లో 'వీళ్ళూ మనుషులే' నవలకు విశాలాంధ్ర నవలల పోటీలో బహుమతి లభించింది. 'మబ్బు విడిచిన వెన్నెల' నవలకు 1984లో నాగార్జున యూనివర్శిటి కీ.శే.'ఉన్నవ లక్ష్మీ నారాయణ' నవలల పోటీలో బహుమతి పొందారు. అలాగే 1980లో 'జపమాల' నవల ఆంధ్ర ప్రభ వీక్లీలో సీరియల్‌గా ప్రచురించగా, 1982-84 నాగార్జున యూనివర్సిటీ కీ.శే.'ఉన్నవ లక్ష్మీ నారాయణ' నవలల పోటీలలో మరోసారి బహుమతి అందుకున్నారు.

'అవయవాల ఆత్మ కథలు'., 'వ్యాధులు-వైద్యం', 'చర్మ వ్యాధులు - నివారణ', 'చర్మ సౌందర్యం'. ఇలా అనేక పాపులర్ సైన్స్ రచనలు పుస్తకాలరూపంలో విడుదలయ్యాయి. ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో 'సిగ్మండ్ ఫ్రాయిడ్' (జీవితం-కృషి) గురించి సీరియల్ రాసారు. 1986లో తెలుగు విశ్వవిద్యాలయ నవలల పోటీకి, 1980 ప్రాంతాల్లో కేంద్ర సాహిత్య అకాడమీకి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. ఇటీవలె వీరు మరణించటం సాహితీ లోకానికి తీరని లోటుగా, ముఖ్యంగా కథా సాహిత్యానికి వెలితి ఏర్పడిందని ప్రముఖ కథకులందరు ఆవేదన వ్యక్తం చేసారు.

రచయిత చిరునామా
డా. పరుచూరి రాజారామ్
3వ లైను, లక్ష్మీపురం,
గుంటూరు - 522 007.



# పంతుల జోగారావు

ది. 12-10-1949లో 'పార్వతీపురం' లో జన్మించిన కథారచయిత 'పంతుల జోగారావు' 1966 వ సం. నుండి కథారచన మొదలు పెట్టారు. వృత్తిరీత్యా ప్రస్తుతం సాలూరు ప్రభుత్వ ఉన్నత పాఠశాలలలో సీనియర్ తెలుగు పండిట్‌గా వున్నారు.

జోగారావు గారి మొదటి కథ 1966లో ఆంధ్రప్రభలో 'బహుమతి' ప్రచురించబడింది. వీరికి అనేక కథలకు బహుమతులు లభించాయి. ఆంధ్రజ్యోతిలో ప్రచురించిన 'గోవుమాలచ్చిమికి కోటి దండాలు', ఆంధ్రపత్రికలో ప్రచురించిన 'మసి మరకలు', ఆంధ్రభూమిలో ప్రచురించిన 'ఊరికి నిప్పంటుకుంది', జ్యోతిలో ప్రచురించిన 'బొమ్మ' ఇంకా ఆంధ్రజ్యోతి వీక్లీలో ప్రచురించబడిన 'చింతలుతీరని చీకట్లు', 'శిక్ష' 'అభ్యంతరం లేదు', 'ఉత్తమపురుష' కథలకు బహుమతులు లభించాయి. ఈ కథలు పాఠకులనుంచి మంచి గుర్తింపును తీసుకొచ్చాయి.

పంతుల జోగారావుగారి కథనశైలి సూటిగా, సరళంగా వుంటుంది. సాంకేతికాంశాలను కూడా సూక్ష్మంగా, కథాగమనానికి భంగంలేని రీతిలో వివరిస్తారు. అవసరమైనపుడు ఫ్లాష్‌బ్యాక్ టెక్నిక్‌ను వాడుకోవడానికి సందేహించరు. చాలా కథలు స్వీయానుభవంలో దగ్గరి వారివే కనుక, పాత్రలు మనకి తెలియకపోయినా, అతి సన్నిహితులా అన్న భ్రమను కలిగిస్తాయి.

జోగారావుగారు చతురలో విద్యా వ్యవస్థపై వ్రాసిన 'విషగుళిక' నవలలు 'అపురూపం' వారికి మంచి గుర్తింపు తీసుకొచ్చాయి. వారి సీరియల్స్ 'నేనూ-అమ్మ' పిల్లల నవల (కృష్ణా పత్రిక), 'చంచలత' (నవలిక - కృష్ణా పత్రిక) కూడా వీరికి విశేషకీర్తిని ఆర్జించి పెట్టాయి. వీరి కథ నరమేధం జరుగుతోందని 'నరమేధ్' పేరుతో డా. కె.వి.ఎల్. నరసింహారావుగారు హిందీలో అనువదించి 'సారిక' లో ప్రచురించారు.

జోగారావుగారి కథల సంపుటి 'అపురూపం' 1998 లో డా సి.నా.రె గారిచే ఆవిష్కరించబడింది. ఈ కథాసంపుటిలో మనకు ఆణిముత్యాల లాంటి కథలు కనిపిస్తాయి. ఈ కథల్లో చాలా కథలు 'పాజిటివ్' తో ప్రారంభించి నెగటివ్‌గా ముగించడం, నెగటివ్‌గా వున్న పాత్ర 'పాజిటివ్' గా ముగించటం కనిపిస్తుంది. పాఠకుల ఊహకు అందకుండా కథనం నడపడం పంతుల జోగారావుగారికి వెన్నతో పెట్టిన విద్య. 'దమ్ము ధూళి', 'అల్లుడోడు', 'అమ్మ బళ్ళోకి వెళ్ళవే', 'గోవు మా లచ్చిమికి' అనే వీరి కథలు తప్పక చదవవలసినవి.

పంతుల జోగారావు గారు ప్రముఖ కథకులు డాక్టర్ బి.యస్.యన్. మూర్తి, దూరి వెంకటరావు, కె.కె. రఘునందన వంటి సాహితీ మిత్రులతో కలిసి, కథను ముందుకు నడిపించడానికి ముందు తరాలకు వినూత్న కథా వస్తువులతో కథలు అందించడానికి, సాహితీ సభలు నిర్వహిస్తూ విజయనగరం జిల్లా నుండి కథకులుగా తమ వంతు సహకారాన్ని అందిస్తున్నారు.


రచయిత చిరునామా
**పంతుల జోగారావు**
28-90/5, గొల్లవీధి,
సాలూరు - 535 591.
విజయనగరం జిల్లా.

# పాయసం సుబ్రహ్మణ్య మహర్షి



నెల్లూరు జిల్లా గూడూరు తాలూకా 'కోట' లో జన్మించిన పాయసం సుబ్రహ్మణ్య మహర్షి గారి వయస్సు 48 సంవత్సరాలు. రచయితగా 1971 నుంచి వివిధ పత్రికల్లో కథలు రాస్తున్నారు.

పాయసం జర్నలిస్టుగా ఆంధ్రజ్యోతి, ఆనందజ్యోతి, సప్తగిరి పత్రికల్లో పనిచేసారు. వీరు కథారచయితగానే కాకుండా, చరిత్ర రచయితగా వాస్తు రచయితగా కూడా గొప్ప పేరు సంపాదించారు. చరిత్ర రచయితగా చంద్రగిరి, హంపీ, విజయనగరం, ఇంద్రప్రస్థం తవ్వకాల విశ్లేషణ, చరిత్ర వ్యాసాలు ప్రచురించారు. ఇక వాస్తు రచయితగా 'వాస్తు సంగతులు' 1998 నుంచి 'జమీన్‌రైతు' లో ఫీచర్ నిర్వహణ కొనసాగిస్తున్నారు.

ఆయుర్వేద శాస్త్రంలో బి.ఏ.యం.ఎస్. డిగ్రీ తెలుగు లిటరేచర్ లో బి.ఎ.డిగ్రీ, వాస్తు శాస్త్రంలో డిప్లమా పొందిన పాయసంగారు, కళారంగంలో కూడా విశేషకృషి చేసారు.

1973-75లో ధర్మవరంనుండి (అనంతపురంజిల్లా) సాహిత్యానికేతన్ రచయితల సంఘం తరుపున 'సాహితీ సుధ' లిఖిత మాస పత్రిక నిర్వహించారు. 1975-80 చిత్తూరులో జిల్లా యువరచయితల సంఘం అధ్యక్షులుగా కొనసాగుతూ 'సాహితీ సుధ'ను ప్రచురించారు. 1985-95 వరకు నెల్లూరులో సింహపురి సాహిత్య సాంస్కృతిక అకాడమీ, నిర్వహణ బాధ్యులుగా కొనసాగారు.

బాల సాహిత్యంలో కూడా విశేషంగా కృషిచేసిన పాయసం, పిల్లల కోసం ఎన్నో కథలు రచించారు. వారి కథలు బాలల మాస పత్రికలన్నింటిలోనూ విరివిగా ప్రచురించబడ్డాయి. పిల్లలకోసం 'శాంతిపావురం' పిల్లల నవల ప్రచురించారు. 'ఆరనిజ్వాల' కథాసంపుటిని ప్రచురించారు. ఇంకా కొన్ని కథలమాలతో త్వరలో కథాసంపుటి తీయాలన్న ఆలోచనతో ఉన్న 'పాయసం' సాంఘిక నవల, చరిత్ర, పరిశోధనా గ్రంథాలు ప్రచురించారు.

'అంతరంగ తరంగాలు', 'బాల్యం జైలు', 'రేపటి సూర్యుడు', కవితాసంపుటాలను ప్రచురించి తెలుగు పాఠకులకు అందించారు. 'మహాభారతంలో చారిత్రక అంశాలు (పరిశోధన) 'తొండవాడ అగస్త్యేశ్వర క్షేత్రం' (చరిత్ర), 'తెనాలి రామకృష్ణుడు శ్రీకృష్ణ దేవరాయల ఆస్థాన కవి కాదు' (పరిశోధన) ప్రచురించారు. పాయసం సుబ్రమణ్యమహర్షి గారికి నృత్యం, సంగీతం, ప్రకృతి అంటే అభిమానం.

సాహిత్యంలో అన్ని ప్రక్రియలలో ప్రవేశమున్న పాయసం సుబ్రహ్మణ్య మహర్షికి కథా ప్రక్రియ అంటేనే ఎక్కువ ప్రీతి. తాను తక్కువ కథలు రాసినా కథను వినూత్నంగా చెప్పాలన్న లక్ష్యంతోనే కలాన్ని కదిలిస్తాడు. అయితే స్పందించే హృదయం, పరిశీలనా శక్తి వున్న మహర్షి లాంటి కథకుడికి కథా వస్తువుల కొరత వుండదనే చెప్పవచ్చు. ఇప్పటికయినా మహర్షి తన కలంతో కథలు అందిస్తారని, రేపటి తరం కొరకు సంపుటాలు ప్రచురిస్తారని, తెలుగు కథను మరింత ముందుకు నడపడంలో సహకరిస్తారని ఆశిద్దాం.


రచయిత చిరునామా
**పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**
25/1440, 2వ లైను,
గౌతమీనగర్, పొదలకూర్‌రోడ్,
నెల్లూరు - 4.





# పి.ఎస్.నారాయణ

"చిన్నకథలైనా చాలాకాలం జ్ఞాపకం ఉండేలా రాయండి. సస్పెన్స్‌ని రివర్స్ డైరెక్షన్‌లో తీసుకుపోవాలి. కథలు బైబిల్ గేయాలలోంచి తీసుకుంటే చాలా గొప్పగా వస్తాయి. కథ గుప్పిట మూసినచేయిలాంటిది. అది మెల్లగా తెస్తూ మొత్తం ఏమిటో చెప్పాలి" అంటారు యువ రచయితలనుద్దేశించి పి.ఎస్. నారాయణగారు.

64 సంవత్సరాల క్రితం విజయవాడ, గుంటూరులకు నడుమ ఉన్న మంగళగిరి దగ్గరలోని 'చినకాకాని'లో జన్మించిన పి.ఎస్.నారాయణగారు 'మాధురి' అన్న కలంపేరుతో మనకు అనేక కథానికలు అందించారు. గత 37 సంవత్సరాలుగా ఉద్యోగరీత్యా హైదరాబాదులో ఉంటూ, ప్రస్తుతం ఉద్యోగ విరమణ పొంది సాహిత్యంలో కృషి చేస్తూనే ఉన్నారు.

'మాధురీ' అన్న కలం పేరుతో 1954లో కథలు రాయటం ఆరంభించిన పి.ఎస్.నారాయణ తొలి కథ 'గుంటూరు' పత్రికలో ప్రచురించబడింది. 1962లో ఆయనకథ 'శిక్ష'కు ఆంధ్రప్రభ వారపత్రిక పోటీలలో ద్వితీయ బహుమతి వచ్చింది. అప్పటినుండి ఆయన అన్ని పత్రికల్లో అసలు పేరుతో అంటే పి.ఎస్.నారాయణతో దాదాపు 200పైగా కథలు ప్రస్తుతం వరకు అందించారు.

పి.ఎస్.నారాయణగారు 18 నవలలు, 10 రేడియోనాటికలు, రెండు స్టేజీ నాటికలు అందించారు. పి.ఎస్.గారిది నాటకశైలి, ఉత్తరం రాయటంతోనో, ప్రయాణంతోనో కథను ప్రారంభిస్తారు. కథను ముడులు వేసుకుంటూ రాసుకుపోవటం వీరి ప్రత్యేకత.

1962లో ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో వీరు మొదటిసారి కథకు బహుమతి పొందారు. ఆ తరువాత 1987లో మరోసారి అదే పత్రికలో బహుమతి సాధించారు. వీరి నవలలకు ఆంధ్ర సచిత్ర పత్రిక నుండి 1998లో స్వాతి సచిత్రవార పత్రిక నుండి బహుమతి లభించింది.

పి.ఎస్.నారాయణ గారికి కుటుంబపరమైన కథలన్నా, మానసిక విశ్లేషణతో కూడిన కథలన్నా రాయటం ఎనలేని ప్రీతి. వీరి కథలు 'శిక్ష', 'నన్ను చెప్పనీయ్', 'నాలాంటివొకరు', 'వెలుగు', 'ఆద్యంతాల మధ్య నేను', 'చీకటిపువ్వు', 'పునీత', 'ఆకుపచ్చని ఆశ', 'దేవుడూ మన్నించు' మంచి పేరు సంపాదించి పెట్టాయి. ఈ కథలు పాఠకులు విశేషంగా ఆదరించారు కూడా!

"నేడు వస్తున్న కథల్లో పూలచెట్లు కనబడవు. ఆకులు కనబడవు. పచ్చదనం కనబడదు. పేకముక్కలు పేర్చినట్లుగా రంగురంగుల కథలు... మనసుకు హత్తుకోలేని బలహీన అంతర్గతం" అంటూ ఆవేదన చెందే పి.ఎస్. నేటి పాఠకులను పాతతరం కథలు సేకరించి చదవమని కోరుతున్నారు. "సామాన్య దృష్టికి అందని మనిషి వికారాలనూ, సద్గుణాలనూ వెలికితీసి కథల్లో ఆవిష్కరించగల అక్షరశిల్పి పి.ఎస్." అంటారు ప్రముఖ కథారచయిత కప్పగంతుల మల్లికార్జునరావు.

రచయిత చిరునామా
పి.ఎస్.నారాయణ
డో.నెం.8-3-168/20/బి/7,
సిద్ధార్థనగర్ (నార్త్), ఎ.జి.కాలనీ దగ్గర,
హైదరాబాద్ - 500038.



# పి.వి. రమణకుమార్

"కథ జీవిత సమస్యలకు పరిష్కారం చూపాలి, మార్గదర్శం కావాలి. అంతేకాని పలాయనాన్ని, పిరికితనాన్ని, ప్రతీకారాన్ని, చావును ముగింపుగా చూపకూడదు" అంటారు 'హిమజారమణ' కలం పేరుతో కథలు రాస్తున్న మన పి.వి. రమణకుమార్. స్వంత వూరిలోనే చిన్న వ్యాపారం చేసుకుంటూ కథా రచనను ప్రవృత్తిగా మార్చుకొని సుమారు 400కు పైగా కథలు రాసిన మంచి కథకుడు పి.వి. రమణకుమార్.

'చిలుకలూరిపేట' లోనే పుట్టి, పెరిగి, చదివి, ప్రస్తుతం ఉంటున్న పి.వి. రమణకుమార్ 'హిమజారమణ' అనే కలం పేరుతో కొన్ని కథలు అందించారు.

1981లో 'దేవుడే ఇచ్చాడు వీధి ఒక్కటి' అనే కథ ఆంధ్రజ్యోతి లో అచ్చులో చూసుకున్న మొదటి కథగా చెబుతారు పి.వి.రమణకుమార్. సాహిత్య ప్రక్రియల్లో కష్టతరమైన బాలసాహిత్యం వీరికి వెన్నతో పెట్టిన విద్య. బాలమిత్ర, బాలజ్యోతి, బొమ్మరిల్లు, బుజ్జాయి, చందమామ వంటి బాలల పత్రికల్లో వారి కథలు లెక్కకు మించి ప్రచురించబడ్డాయి. అలాగే ఎన్నో వ్యాసాలు, ఆర్టికల్స్ వీరివి ప్రచురించబడ్డాయి.

స్వాతి వీక్లీ నిర్వహించిన కామెడీ కథల పోటీలో "అది అంతే- ఇది ఇంతే" కథ బహుమతి పొంది తెలుగు సాహితీ ప్రియుల ప్రశంసలు అందుకుంది. జాగృతి దీపావళి కథల పోటీలో "అమ్మపాలు" అనే కథ ద్వితీయ బహుమతి పొందింది.

వీరి కథల్లో వ్యంగ్య హాస్య కథలు, వృద్ధుల సమస్యలకు సంబంధించిన కథలు, స్త్రీ హృదయావిష్కరణకు, సెంటిమెంటాలజీకి సంబంధించిన కథలు, మనిషి మనస్తత్వంలోని చిక్కు ప్రశ్నలతో సంబంధం ఉన్న కథలు ఎక్కువగా కీర్తిని తీసుకొచ్చాయి. వీరి కథలన్నీ చదివించేగుణం కల్గి ఉంటాయనటంలో అతిశయోక్తిలేదు.

కథారచనతోపాటు నవలా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న పి.వి. రమణకుమార్ "లవ్‌ట్రాప్" నవల 1994లో ప్రచురించి పాఠకులకు అందించారు. ఆ తరువాత వరుసగా 5 నవలలు డైరెక్టుగా విడుదలయ్యాయి ఘోస్టు రచయితగా కూడా ఉన్న వారు మరో 10 నవలలు కూడా రాయటం జరిగింది. ఈ మధ్య కాలంలోనూ, ఇప్పటికే దాదాపు వేయికి పైగా జోకులు, కొన్ని వందల ఆర్టికల్స్ వివిధ పత్రికల్లో వివిధ కలంపేర్లతో వ్రాయడం జరిగింది.

"రాయడం అన్నది బాధ్యతగా తీసుకొనిబాలల కథలు రాస్తున్నాను" అని గర్వంగా చెప్పుకునే పి.వి.రమణకుమార్‌కు కూడా 'ప్రతిమగాడి విజయం వెనుక ఆడది ఉంటుంది' అన్న సత్యవాక్కు వర్తిస్తుంది. తన సహ జీవిత భాగస్వామి 'హిమజ' ప్రోత్సాహం లేకుంటే తన కలం కదలదంటూ చెప్పే 'హిమజారమణ' కథల సంపుటి త్వరలోనే తెలుగు సాహితీ ప్రియులకు అందిస్తారని ఆశిద్దాం.


రచయిత చిరునామా
పి.వి. రమణకుమార్
వై. రాములు స్ట్రీట్,
చిలకలూరిపేట - 522616.





# పులి కంటి కృష్ణారెడ్డి

బంగారం లాంటి రైల్వే ఉద్యోగాన్ని వదలిపెట్టి అక్షరాన్ని నమ్ముకొని గత 40 సంవత్సరాలుగా అశేష పాఠక లోకం గుండెల్లో సాహిత్యయాత్ర చేస్తూ, ఎంతో ఎత్తుకు ఎదిగిన పులికంటి కృష్ణారెడ్డి 'జానపద కవి కోకిల' బిరుదాంకితులు.

"కథ చాలా దూరం నడిచాక ముందర అనుకొన్న ఆలోచనకు భిన్నమైంటే మానుకుంటాను" అని గర్వంగా చెప్పుకొంటారు పులి కంటికృష్ణారెడ్డి. 1931 జులై 30లో రాయలసీమ గడ్డపై జన్మించిన 'పులికంటి' సుమారు 80కి పైగా కథలు, నలభైకి పైగా పాటలు, బుర్రకథలు, కవితలు, జానపద సాహిత్యం, రంగి పాటలు, ప్రాచీన విశేషాలపై వ్యాసాలు, ప్రముఖులతో ఇంటర్వ్యూలు ఇలా అన్ని రకాల సాహిత్య ప్రక్రియల్లో ప్రవేశించి విశేషకృషి చేస్తున్నారు.

భారతప్రభుత్వ సమాచార ప్రసారాల శాఖ న్యూఢిల్లీవారిచే అక్టోబరు 2, 1992 లో ఆకాశవాణి, దూరదర్శన్ విభాగాల సలహాదారునిగా ఎన్నుకోబడ్డారు. వీరి కథానికలు ప్రముఖ తెలుగు పత్రికలన్నింటిలోనూ వెలుగు చూసాయి. సుమారు 14 కథానికలకు జాతీయస్థాయిలో బహుమతి లభించాయి. 1981లో 'పులికంటి కృష్ణారెడ్డి కథలు' 1982లో 'గుడ్డుకోసం గువ్వలు', 1984లో 'కోటిగాడు స్వతంత్రుడు' అనే కథానిక సంపుటాలు పాఠకులను విశేషంగా ఆకట్టుకున్నాయి. వీరి కథలు అనేక భాషల్లోకి అనువదించబడ్డాయి.

1976-92లో ఆంధ్రప్రదేశ్‌లోని ఆకాశవాణి కేంద్రాల్లోవీరు సుమారు 150 కార్యక్రమాలు ఇచ్చారు. అలాగే సమారు 17 ప్రోగ్రాములు హైద్రాబాద్, మద్రాసు దూరదర్శన్ కేంద్రాల్లో సమర్పించారు. వీరిని చిన్నస్థాయి నుండి జాతీయ స్థాయి వరకు అనేక సాహితీ సంస్థలు అనేక బిరుదులు అందజేసి గౌరవించాయి. వాటిలో నటశేఖర, గ్రేట్ స్టేజ్ యాక్టర్, జానపద కవికోకిల, సుప్రసిద్ధ గేయకవి ఇలా కొన్ని.

సాహిత్యంలో విశేషకృషి చేస్తున్న పులికంటి కృష్ణారెడ్డిగారిని గుర్తించి వీరి సేవలను అనేక సంస్థలు వినియోగించుకొంటున్నాయి. 1988-91 వరకు ఆకాశవాణి కడపకు జానపద సంగీత, ఆడిషన్ కమిటీ సభ్యులుగా, చిత్తూరు జిల్లా రచయితల సంఘ ప్రెసిడెంటుగా, రాయలసీమ వర్కింగ్ జర్నలిస్ట్‌గా, ఎస్.పి మహిళా యూనివర్సిటీ తిరుపతి విజిటింగ్ లెక్చరర్‌గా ఇంకాఎన్నో రకాలుగా తమవంతు సాహితీ సేవ చేస్తూ సాహితీ శిఖరాలు అందుకోనున్నారు పులికంటి కృష్ణారెడ్డి. వీరు స్థాపించిన సాహితీ సంస్థ పులికంటి సాహితీ సత్కృతి ద్వార సాహిత్యంలో విశేష సేవలందిన వారికి అవార్డు అందజేసి గౌరవిస్తున్నారు. 2002 సం.లో సాహిత్యం నందు విశిష్ట కృషి చేసిన శ్రీ కలువకొలను సదానంద ఈ అవార్డు అందుకున్న ప్రముఖులో ఒకరు.


రచయిత చిరునామా
**పులికంటి కృష్ణారెడ్డి**
467, బండల స్ట్రీట్,
తిరుపతి - 517 501.



# పెద్దింటి అశోక్ కుమార్

రా. వి. శాస్త్రి, బి.ఎస్. రాములు కథల్ని, కేశవ రెడ్డి నవలల్ని, గోపి, సి.నా.రె. కవిత్వాన్ని ఇష్టంగా చదివే అశోక్ కుమార్ 'నాకు రాయడం కన్నా చదవడం, చెప్పడం కన్నా వినటం అలవాటు' అని నిజాయితీగా ఒప్పుకునే మంచిమనస్కులు.

మానేరు నది తీరానగల 'భీముని మల్లారెడ్డి పేట' అనే పల్లెటూరులో 19-4-1966న జన్మించిన యువకథకుడు పెద్దింటి అశోక్ కుమార్ వృత్తిరీత్యా ఉపాధ్యాయులు.

కథారచయితగా 1998లో అడుగుపెట్టిన అశోక్ కుమార్ ఇప్పటి వరకూ 40కి పైగా కథలందించారు. ఒక కథా సంకలనాన్ని వెలువరించారు. పొట్టచేత పట్టుకొని గల్ఫ్‌తీరాలపైపు వెళ్ళి మోసపోయే వలస బతుకులపై సింగిల్ కాన్సెప్ట్‌తో (పత్రికల్లో అచ్చయిన కథలు) పదికథలతో 'వలస బతుకులు' అనే కథా సంకలనాన్ని వెలువరించారు.

అశోక్ కుమార్ రాసిన 'వలసపక్షి' అనే కథకు 2000 సంవత్సరంలో తెలంగాణా కథకులకు యిచ్చే వట్టికోట ఆళ్వార్ స్వామి కథా పురస్కారం లభించింది. 'వలస బతుకులు' కథా సంకలనానికి విశాల సాహితీ జగిత్యాల వారు యిచ్చే విశాల సాహితీ అవార్డు లభించింది.

పెద్దింటి మల్లవ్వ, అంజయ్యల నాలుగో సంతానమైన ఈ కథకుడికి తన మొదటి పాఠకురాలు తన శ్రీమతి అని చెప్పుకుంటారు. కథాంశాలలో గ్రామీణ జీవితాంశాలకు, భాషలో తెలంగాణా మాండలికానికి పెద్దపీట వేస్తూ, జీవితాలకు దగ్గరగా వుండే అంశాలనే కథావస్తువులుగా ఎన్నుకుంటారు. వీరు ఎక్కువగా కథల్లో జీవితాన్ని గెలుచుకునే క్రమాన్ని చూపిస్తారు.

ఆధునీకరణ, వ్యాపార సంస్కృతి, పారిశ్రామికీకరణ, యాంత్రికీకరణ మొదలైన అంశాలు తెస్తున్న మార్పులను చూస్తూ వీరు చక్కని కథలు రాశారు. వ్యాపార సంస్కృతితో మారుతున్న మానవ సంబంధాలను కూడా చిత్రిస్తూ కథలు రాశారు. వీరి కథల్లో వస్తువు ప్రభావ వంతంగా వుండటమేకాదు, భాష, శైలి భావాలు కూడా విలక్షణంగా ఉంటున్నాయి. తెలంగాణా భాష, నుడికారాలతో కథలు రాయటం వీరికి వెన్నతో పెట్టిన విద్య. తెలంగాణా జీవితం, సమస్యలు, వ్యక్తుల పేర్లు, ఊర్ల పేర్లు, తెలంగాణా సంస్కృతి, పండుగలు, ఆచారాలు వీరి కథల్లో చిత్రిత మవుతాయి.

కథా ప్రక్రియలోనే కాకుండా నవలా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న అశోక్ కుమార్ 2 నవలలు కూడా రాసారు. 'చతుర' లో ప్రచురించిన 'ఎడారి మంటలు' నవల వీరికి మంచిగుర్తింపుని తీసుకొచ్చింది. తెలంగాణ మట్టివాసనంటే ఇష్టం పడే అశోక్ కుమార్ కలం నుండి మరిన్ని మంచి కథలు ఆశిద్దాం.


రచయిత చిరునామా
పెద్దింటి అశోక్ కుమార్
మల్లారెడ్డిపేట (పోస్టు) గంభీరావుపేట(మం.),
కరీంనగర్ జిల్లా- 505 304.



# పెండెం జగదీశ్వర్

నల్లగొండ జిల్లా 'రామన్నపేట'కు చెందిన పెండెం జగదీశ్వర్ సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లోనూ మంచి పేరు తెచ్చుకుంటున్నారు. చాలాకాలంగా బాలలకథలు రాస్తున్న జగదీశ్వర్ కథకుడే కాదు, చక్కని కార్టూనిస్టు కూడా.

వృత్తిరీత్యా నల్గొండ జిల్లా రామన్నపేట మండలం 'వెల్లంకి' గ్రామంలోని 'మైత్రి విద్యాలయం'లో ప్రధానోపాధ్యాయుడిగా పనిచేస్తున్న జగదీశ్వర్ "బాలలకథలు" అనే కథాసంపుటి ప్రచురించారు. ఈ కథలన్నీ బాలసాహిత్యానికి చెందిన ప్రముఖ పత్రికలైన 'బాలమిత్ర', బాలజ్యోతి, చిన్నారి, బుజ్జాయి, బాలభారతి, పత్రికల్లోనూ, ఇంకా వార్త, ఆంధ్రప్రభ, విద్యార్థి, చెకుముకి మొదలగు వాటిల్లో ప్రచురించబడ్డాయి.

పెండెం జగదీశ్వర్ కథలను పిల్లలు సరదాగా చదువుతూనే చాలా విషయాలు నేర్చుకుంటారు. కథల్లో శాస్త్రీయ దృక్పథం, నైతికవిలువలు, ధర్మచింతన అలవోకగా లభిస్తాయి. వీరు ఎంత క్లిష్టమైన విషయాన్నయినా చిన్న చిన్న పదాలతో అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు పిల్లలకు అర్థమయ్యేలారాస్తారు.

కథకోసం కలలో కూడా ఆలోచించే జగదీశ్వర్ తను పనిచేస్తున్న పాఠశాల బాలలతో "జానపద కథలు" అనే కథాసంపుటి ప్రచురించారు. ఈ సంపుటిలోని కథలన్నీ 'మైత్రీవిద్యాలయం' బాలలు (4,5,6 తరగతలు చదువుతున్న) రాసినవే! నిజంగా ఇదో గొప్ప ప్రయోగం. అయితే ఈ కథలన్నీ ఆ చిన్నారులు సేకరించినవి. ఈ బాలలు భవిష్యత్తులో మంచి రచయితలుగా ఎదగాలని, వారికి ఉజ్వల భవిష్యత్ ఉండాలన్నది పెండెం కాంక్ష.

"ప్రతిరచయిత ఒక లక్ష్యాన్ని ఎంచుకొని రచనలు చేయాలి. పిల్లలకు తమ శక్తి సామర్థ్యాలు మీద నమ్మకం పెంచే బాలసాహిత్యం అందుబాటులోకి తేవాలి" అని అభిప్రాయపడే పెండెం జగదీశ్వర్ జన విజ్ఞాన వేదిక వారు ప్రచురిస్తున్న విద్యార్థి, చెకుముకి పత్రికలకు కొంత కాలం పాటు సంపాదక వర్గ సభ్యునిగా కొనసాగారు. సుమారు మూడున్నర ఏళ్ళపాటు ఆ పత్రికలో "బాలానందం భలే వినోదం" శీర్షికకు 400 పైగా కార్టూన్లు గీసారు.

జగదీశ్వర్ రాసిన 'అసలు విషయం' కథలో దొంగ స్వాములవారి గుట్టురట్టు చేయటం శాస్త్రీయంగా ఉంటుంది. 'మూఢ నమ్మకం' కథలో కూడా ఒక శాస్త్రీయ నిజాన్ని చెప్పటం విశేషం. అంధ విశ్వాసాలకు దూరంగా మసలుతూ ప్రతి విషయం వెనుకగల శాస్త్రీయ కారణాన్ని అన్వేషించే వ్యక్తిగా ఈ కథల ద్వారా మనకు కనిపిస్తాడు. 'దిష్టి', 'భ్రమ', కథల్లో కూడా వైజ్ఞానిక దృక్పథం మనకు స్పష్టంగా కనిపిస్తుంది. కథే శ్వాసగా జీవిస్తున్న వీరు సాహితీ శిఖరాలు చేరుకోవటం పెద్ద కష్టమేమీ కాదు.

2002 సంవత్సరం నవంబరులో పెండెం తను గీసిన కార్టూన్లన్నింటినీ ఓ సంకలనంగా ప్రచురించారు.


రచయిత చిరునామా

**పెండెం జగదీశ్వర్**

ఇం. నెం. 8-53, క్రిష్టియన్స్ కాలనీ,

రామన్నపేట మండలం,

జిల్లా నల్గొండ - 508113.



# పోతుకూచి సాంబశివరావు

"పత్రికల వాళ్ళు చిన్న కథలకు ఎక్కువగా అవకాశం ఇస్తారు. చిన్న కథను ఎక్కువగా వర్ణించకూడదు. కథను ఎక్కువగా వేగంగా నడపాలి" అంటారు యువ రచయితలను ఉద్దేశించి డా. పోతుకూచి సాంబశివరావు.

తూర్పుగోదావరి జిల్లా 'అలమూరు' లో 72 సంవత్సరాల క్రితం పండిత కుటుంబం నందు జన్మించిన పోతుకూచి నేటికీ బ్రహ్మచారే.

1948 ప్రాంతంలో పోతుకూచి హైదరాబాదు వచ్చి సాహిత్య రంగంలో విజృంభించింది, రచనారంగంలోనూ, కార్యకర్తృత్వంలోనూ విశేషమైన కృషి చేసారు. కథారచయితగా అనేక పత్రికలలో కథలు ప్రచురించడమే కాక దాదాపు 350 కథలు రాసారు. పన్నెండు కథా సంపుటాలు వెలువడ్డాయి. కొన్ని కథలు ఇతర భారతీయ భాషల్లోకి హిందీ, కన్నడ, తమిళం మరియు ఇంగ్లీషులోకి అనువాదం అయ్యాయి. రష్యన్ భాషలో కూడా ఆయన కథలు అనువాదమై ఆయన కథాశీర్షికే సంకలనమకుటంగా నిర్ణయించబడింది. యావదాంధ్ర లోనూ, సాహిత్య అకాడమీ సదస్సులోనూ, ఆల్ ఇండియా రచయితల సభల్లోనూ, కథా సదస్సుల్లోనూ ఆయన పాల్గొన్నారు.

కవిగా పోతుకూచి పది కవితా సంపుటాలు ప్రచురించారు. శిఖరాలు, అగ్నినాదాలు, చైతన్య కిరణాలు, పోతుకూచీయం, సాంబ శివానందలహరి, పద్యకవిత, వచన కవితా గ్రంథాలు వెలువడ్డాయి. రాష్ట్రస్థాయి, జాతీయ స్థాయి కవి సమ్మేళనాల్లో ఆయన పాల్గొన్నారు. అనేక పత్రికలలో వారి కవితలు వెలువడ్డాయి. ఇతర భాషా సాహిత్య కవితలను పోతుకూచి అనువాదం చేసారు.

1963-64 ప్రాంతాలలో పోతుకూచికి మునిమాణిక్యం నరసింహారావుతో పరిచయం ఏర్పడింది. ఆయన రాసిన కాంతం కథలు పోతుకూచిని బాగా ఆకర్షించాయి. అందులో సంసారిక, హాస్యం రసవత్తరంగా వుండేది. కాంతం మునిమాణిక్యంగారి భార్య. ఆయన భార్య నాయికగా రాసిన ఈ కథలు పోతుకూచికి ప్రేరణ కల్గించి 'శేఖరం కథలు' రాసే అవకాశం కల్గింది. శేఖరం ఒక భగ్న ప్రేమికుడు. తెలుగు సాహితీ చరిత్రలో శేఖరం కథలు ఒక ప్రత్యేక శైలి, విశిష్టత కలిగి ఉన్నవి.

సాంబశివరావు కథ, నవల, నాటకం, పద్య, వచనకవిత్వాలు, పాటలు, సినిమా నవలలు, అనువాదాలు, ఇతరుల జీవితకథలు, తన జీవిత కథ రాసారు. విశ్వరచన దిన, పక్ష పత్రికల, యువానిలిట్ ఆంగ్ల పత్రికల సంపాదకులు. చిన్నపత్రికల సంఘానికి గౌరవాధ్యక్షులు. తెలుగు సాహిత్యంలో విశిష్టమైన వ్యక్తిగా, పట్టుదల, కార్యదీక్షగల సాహిత్య సిపాయిగా, సాహిత్య సృష్టికర్తగా డా. పోతుకూచి మరో తరానికి మార్గదర్శి. దివంగత ప్రఖ్యాత కవుల పేరిట మొదటిసారిగా పోతుకూచి గారికి శ్రీశ్రీ అవార్డు లభించింది. "పోతుకూచి గారు ఉదయం కృష్ణభక్తులు, మధ్యాహ్నం న్యాయవాది, సాయంత్రం ప్రజారంగ కార్యకర్త" అని ప్రముఖ కథకురాలు డా. వాసా ప్రభావతి అంటారు.

రచయిత చిరునామా
పోతుకూచి సాంబశివరావు
విశ్వసాహితి, 1-3-1-18, కవాడిగూడ,
కల్పనా థియేటర్ దగ్గర,
సికిందరాబాద్ - 500 080.

# పోలవరపు కోటేశ్వరరావు





కృష్ణా జిల్లా 'వీరమాచనేని వారి పాలెం' లో జన్మించిన పోలవరపు కోటేశ్వరరావు గారు "సహజ కథా కథన సవ్యసాచి" అనే బిరుదును పొందారు. కృష్ణా జిల్లాకు చెందిన మన ప్రముఖ కథకుల్లో పోలవరపు కోటేశ్వరరావు గారు ముందువరుసలో ఉంటారు.

కోటేశ్వరరావుగారు కృష్ణానదీ తీర ప్రాంతాలకు చెందిన దివిసీమ ప్రజాజీవితాలను, రైతులజీవన హేలను కథావస్తువులుగా వివిధ కోణాల్లో తీసుకొని రైతులను గూర్చి రోజుకొక కథచొప్పున యాభై రోజులలో యాభై కథలు ఓ యజ్ఞంలా రాసి గొప్పరికార్డు సృష్టించారు. వీరి కథలను లోతుగా పరిశీలిస్తే కృష్ణాజిల్లాకు కూడా యాసవున్నదని ఆ గ్రామీణుల సంభాషణలతో రమ్యంగా వినిపించటం స్పష్టంగా తెలుస్తుంది.

ఇప్పటివరకూ కోటేశ్వరరావుగారు ఆరు కథా సంపుటాలు ప్రచురించారు. వీటిలో 'నాకుళయ్యకథలు' అనే కథా సంపుటి జాతీయస్థాయి పురస్కారం లభించింది. 'వెండికళ్ళు' అనే వీరికథను మద్రాసులోని కళాసాగర్ వారు ప్రచురించిన ప్రతిష్టాత్మకమైన 'కథాసాగర్' సంపుటిలో ముద్రించటం విశేషం.

కోటేశ్వరరావుగారి నవల 'చినబాబు' ను టెలీఫిలింగా తీస్తున్నారు. 'లచ్చుమయ్య కథలు', 'నాటిగాథలు-నేటికథలు' అనే రచనలను దూరదర్శన్‌వారికి కోటేశ్వరరావు గారు సీరియల్స్‌గా అందించారు. ఇవి త్వరలో దూరదర్శన్‌లో ప్రసారం కానున్నాయి.

పోలవరపు కోటేశ్వరరావుగారు మూడు టి.వి. సీరియల్స్, రెండు తెలుగు సినిమాలు మిత్రులతో కలసి నిర్మించారు. 'దక్షిణ గంగ గోదావరి' అనే కమీషన్డ్ టి.వి. సీరియల్‌కు గోదావరి నదిని గూర్చి అన్నిరంగాలను వివరిస్తుంది. ఈ సీరియల్ కోటేశ్వరరావుగారికి మంచి పేరు తీసుకొచ్చింది.

'ఆంధ్రమహా విష్ణువు - ఆముక్త మాల్యద' లేక 'రాయలు-రంగన్న' అనే వీరి నాటకాన్ని టెలిస్కూలు వారు రెండు ఎపిసోడ్సుగా నిర్మించారు. చరిత్ర, సాహిత్యం మిళితమైన యీ సీరియల్ పిన్నలకు, పెద్దలకూ ఎంతగానో ఉపయోగపడుతుంది.

కోటేశ్వరరావుగారికి అనేక సంస్థలు పురస్కారాలందించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ వారు 1998 సం.పు 'ఉత్సవ' పురస్కారమందించి ఘనంగా సన్మానించింది. గుంటూరు జిల్లా అరసం వారు1998 సం.లో 'కొండేపూడి శ్రీనివాసరావు' స్మారక అవార్డు ఇచ్చి గౌరవించటం కోటేశ్వరరావుగారికి బాధ్యతను పెంచాయి.

విజయవాడలో తుమ్మలపల్లి వారి క్షేత్రయ్య కళాక్షేత్రంలో చలం కాంస్య విగ్రహాన్ని నెలకొల్పటానికి విజయవాడ ప్రాంత కన్వీనర్‌గా కృషిచేశారు. కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి విగ్రహాన్ని నిలిపేందుకు కమిటీ కన్వీనర్‌గా నడుం కట్టి పనిచేశారు. హనుమంతరాయ గ్రంథాలయ అనుబంధ సంస్థ, ఆంధ్రా ఆర్ట్సు అకాడమీకి ప్రధాన కార్యదర్శిగా కళారంగానికి సేవలందిస్తున్నారు.


రచయిత చిరునామా
**పోలవరపు కోటేశ్వరరావు**
33-16-12, కస్తూరిబాయ్ పేట,
విజయవాడ - 520010.



# పోలాప్రగడ సత్యనారాయణమూర్తి



"కథను మొదటి వాక్యంలోనే అద్భుతంగా చెప్పవచ్చు, కథా గమనానికి సింహద్వారంలాంటిది ఈ ప్రారంభ వాక్యం. 'ఓలమ్మో పాములో! లేదా రమేష్ తన పెండ్లానికి చీరకడుతున్నాడు'తో మొదలుపెడితే పాఠకుడికి ఆసక్తి కలిగించవచ్చు!" అంటారు ప్రముఖ కథా రచయిత పోలాప్రగడ సత్యనారాయణమూర్తిగారు.

తూ.గో.జిల్లా 'ఆలమూరు'లో 1929లో జన్మించి రాజమండ్రి ఆర్ట్స్ కళాశాల, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాల్లో విద్యాభ్యాసం గావించిన వీరు భీమవరం, అనంతపురం, ఏలూరు, బాపట్ల కళాశాలల్లో ఆంగ్ల ఉపన్యాసకులుగా ఉద్యోగాలు చేసారు. 1947లో కథారచనకు శ్రీకారం చుట్టారు. తరుణ సాహితీ సంస్థను స్థాపించి మిత్రులతో కలిసి అనేక సాహిత్య కార్యక్రమాలను జన్మస్థలంలో నిర్వహించారు.

'యోగక్షేమం మాయామయం' కథలో రైల్వేపోర్టర్లు పన్నెండేళ్ళ కుర్రాడిని చావగొడతారు. పాసింజరు లగేజీ మోసుకొచ్చి తమనోళ్ళు కొడుతున్నాడని! ఆస్టేషన్ తన డివిజన్ పరిధిలో రైల్వే వెల్ఫేర్ ఆఫీసర్ రంగనాథ్‌కు మనిషిగా ఆ కుర్రాడిపట్ల జాలి కలుగుతుంది. "మీ పెట్టె రైల్లో పెడతాను, ఒక్కరూపాయి యిప్పించండి" అని రంగనాథ్‌ను ప్రాధేయపడతాడు ఆ కుర్రాడు. ఓపికంతా కూడదీసుకొని ఇన్నిదెబ్బలు తిన్నా మళ్ళీ అదేపనా వీడికి అని ఆశ్చర్యపోయి పోర్టర్లతో ఎందుకొచ్చిన రగడ అనుకొని ఏంచేస్తాం? వాడి కర్మ వాడిది అనే కర్మ సిద్ధాంతాన్ని మననం చేసుకుంటూ దేవుడే వాడి యోగక్షేమాలు చూసుకుంటాడని మనస్సును సరిపెట్టుకుంటాడు. రంగనాథ్ జాలిగుండెకు ఒక్క రూపాయి వాడికి దానం చేద్దామనే ఆలోచన మాత్రం రాదు అని విశదీకరిస్తారు.

వీరి రచనల్లో ఆణి ముత్యాలుగా నిలిచిపోయేవి కౌసల్య(1984), భోగి మంటలు (1965), దీపశిఖ (1968), సంఘంచేసిన మనిషి (1970), కవిసార్వభౌమ (1972), నవోదయం(1973), ప్రేమాయణం(1980), ప్రేమకలాపం (1986), మనసిచ్చి చూడు (1983) నవలలయితే, దాదాపు 120పైగా కథలు చక్కటి ఇతివృత్తంతో పాటు కథకు శిల్పం చేకూర్చి తమదైన శైలిలో కరుణరస ప్రధానంగా పాఠకులకు అందించారు. 1964లో ఆంధ్రప్రభ నవలలో ద్వితీయ బహుమతి, 1989లో స్వాతి కథల పోటీలో ప్రథమ బహుమతి లభించాయి. 1971లో ఉత్తమ సినీ కథా రచయితగా నంది అవార్డు 1992లో రవీంద్రనాథ్ ఠాగూర్ అవార్డు పొందారు.

తల్లిదండ్రులు, రామరాజ్యం, ప్రేమాయణం మొదలైన సినిమాలకు కథలు వ్రాసారు. మరెన్నో రేడియో నాటకాలు మనకు అందించారు. జాతీయ టి.వీ. సీరియల్ 'అప్నా అప్నా ఆస్మాన్' కథా రచయితగా ప్రేక్షకుల మన్ననలు అందుకున్నారు.

కథానికలో 'శీర్షిక' ముఖ్యం. సస్పెన్స్ కథల్లో శీర్షిక ద్వారా కథ అసలు చెప్పకూడదు అంటూరు. కరుణరసంతో పాటు మరోచేత్తో హాస్యరసాన్ని, పండించగల సవ్యసాచి పోలాప్రగడ. వీరి కథల్లో లోతుగా పరిశీలిస్తే ఇలాంటి కథల్లో హాస్యం వెనుక లోకరీతితో పాటు విషాదచిహ్నాలు కూడా కనిపిస్తాయి.

వీరి భార్య శ్రీమతి పోలాప్రగడ రాజ్యలక్ష్మి ప్రఖ్యాత రచయిత్రి కావడం ఆయనకి దేవుడిచ్చిన వరం అని భావిస్తుంటారు. 'ఆంధ్రభూమి' వారపత్రికల్లో 'ఆ రోజుల్లో' అనే శీర్షికతో వ్యాసాలు రాసి దేశ నలుదిక్కులా ఉన్న తెలుగు పాఠకులను విశేషంగా ఆకర్షించారు.

ఇటీవలె వీరు మరణించడం సాహితీ లోకానికి తీరని లోటు.


రచయిత చిరునామా
**పోలాప్రగడ సత్యనారాయణమూర్తి**
2/డి, బ్రహ్మానంద నగర్,
మలకపేట, హైదరాబాద్ - 36.



# పోలాప్రగడ రాజ్యలక్ష్మి

'రచయిత, రచయితకు మధ్య నేడు 'జలసీ' వుంది. ఒక రచయిత పైకి వస్తుంటే మరో రచయిత చూసి ఓర్వలేదు' అని అభిప్రాయపడతారు ప్రముఖ కథారచయిత్రి శ్రీమతి పోలాప్రగడ రాజ్యలక్ష్మి.

తూ.గో.జిల్లా 'అలమూరు' లో 1938లో జన్మించిన రాజ్యలక్ష్మిగారు అలమూరు గరల్స్ హైస్కూల్‌లో విద్యాభ్యాసం చేసారు. సుమారు వందకు పైగా కథలు రచించిన వీరి మొదటికథ 1964లో ఓ ప్రముఖ పత్రిక ప్రచురించిన 'ఏమైనా సరే కథరాయాలి' తో ప్రారంభమయింది. ఇప్పటివరకు 4 కథాసంపుటాలు, 12 నవలలు ప్రచురించబడ్డాయి. వీరి కథలు అన్ని ప్రముఖ పత్రికల్లో ప్రచురించబడ్డాయి.

స్త్రీల సమస్యల ఆధారంగా కథా వస్తువు తీసుకొని కథలు అల్లడం రాజ్యలక్ష్మిగారికి వెన్నతో పెట్టిన విద్య. స్త్రీల ధోరణులను రకరకాల కోణాల్లో తన కథల్లో చిత్రించారు. స్త్రీల సమస్యలు పరిష్కరించటానికి అనేక పదవులు చేపట్టారు. 'తరుణ సాహితీ సమితి ఉపాధ్యక్ష పదవి', 'భీమవరం, అనంతపురం, బాపట్ల మహిళా సంఘాలకు' అధ్యక్షురాలిగా, బొంబాయి ఆంధ్ర మహాసభ జీవిత సభ్యురాలిగా, హైదరాబాదు సరోజినీ నాయుడు మహిళాసంఘం అధ్యక్షురాలిగా, 'సఖ్యసాహితీ సమితి' ఆంధ్రప్రదేశ్ అకాడమీ, సాహితీ సమితులకు సభ్యురాలిగా తమవంతు సేవలందించారు.

వాషింగ్టన్ గ్రంధాలయానికి రాజ్యలక్ష్మి కథలసంపుటి ద్వారా ఎన్నికైన గ్రంథరచయిత్రి, ఫెమినిస్ట్ సొసైటీ వారి ప్రపంచ ఉత్తమ కథాసంపుటికి కథారచయిత్రిగా ఎన్నికకావటం తెలుగువారిగా మనం గర్వించదగ్గ విషయం. జాతీయ టి.వి. కార్యక్రమాల్లో వీరి 'కాలాపూస' కథ, 'కష్మకష్' కథాక్రమంలో ప్రసారమైంది. 'కలకత్తా తెలుగుసమితి' వీరి కథలను, వ్యాసాలను ఇతర భాషల్లోకి అనువదించారు.

నాగార్జునా యూనివర్సిటీలో 'రాజ్యలక్ష్మి'గారి కథానికలపై ఎమ్.ఫిల్ సిద్ధాంత గ్రంథం, ఆంధ్రయూనివర్సిటీలో రాజ్యలక్ష్మి నవలలపై పి.హెచ్.డి.లు చేసారు. 'రెల్లుపొదలు' నవల హిందీ అనువాదం ఎమ్. ఫిల్‌కు ఉపయోగించారు.

1999లో 'మద్రాసు అకాడమీ' సాహితీ పురస్కారం, 1990లో నాగార్జున విశ్వవిద్యాలయం వారిచే 'ఉన్నవ లక్ష్మీరమణ అవార్డు', 1994లో 'తెలుగు విశ్వవిద్యాలయం' నుండి ఉత్తమ రచయిత్రి అవార్డులు అందుకున్నారు. తన భర్తగా 'పోలాప్రగడ సత్యనారాయణమూర్తి' లాంటి ప్రముఖ కథకుడు లభించటమే గొప్ప అవార్డుగా తలుస్తారు. ఇటీవలె మూర్తిగారు ఆకస్మికంగా దుబాయ్‌లో మరణించటం కథా సాహితీ లోకానికి తీరనిలోటు. రాజ్యలక్ష్మి గారు గతంలో మూర్తి గారితో పోటీ పడి కథలు రాసేవారు. నేడు వారు లేకున్నా అదే స్ఫూర్తితో నేటి యువ కథకుల కొరకు తనదైన వినూత్నశైలిలో కథలు ఎప్పటిలా అందిస్తూ, తెలుగు కథను మరింత ముందుకు నడిపిస్తారని ఆశిద్దాం.


రచయిత్రి చిరునామా

**పోలాప్రగడ రాజ్యలక్ష్మి**

2/డి, బ్రహ్మానందనగర్,

మలక్‌పేట, హైదరాబాద్ - 36.

# పోరంకి దక్షిణామూర్తి





1933 ఆగస్టు 24న తూర్పు గోదావరి జిల్లా 'ఆలమూరు'లో జన్మించిన పోరంకి దక్షిణామూర్తిగారు తమ పి.హెచ్.డి. పరిశోధన విషయంగా తెలుగు కథానిక స్వరూప స్వభావాలు ఎన్నుకోవటం నేటి యువ కథారచయితల అదృష్టం. దీన్ని 1988లో గ్రంథరూపంలో ప్రచురించారు.

“కథలో ఒక విషయాన్ని చూపించేది కథ. జీవితాన్ని చూపించేది నవల” అన్నారు శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారు.

వీరు 1954 నుండి కథానికలు రచించటం మొదలుపెట్టి నేటికి దాదాపు 50 కథలు పైగా రచించారు. కాని పుస్తకరూపంలో వెలువడకపోవటం తెలుగు కథా ప్రియులకు లోటు! ప్రముఖ కథా రచయిత శ్రీ వేదగిరి రాంబాబుగారు అన్నట్లు ఎవరి సాహిత్యాన్ని వారే భద్రపరచుకుంటే భవిష్యత్‌లో ముందుతరం వారికి అందజేసిన వారవుతామన్నది పోరంకి గారికి తెలియనిది కాదు. మనం వారి నుండి కథాసంపుటి కోరుకుందాం.

పోరంకి దక్షిణామూర్తిగారు ఓ సందర్భంలో కథానిక లక్షణాలను ఇలా పొందుపరిస్తే చక్కటికథానిక రూపొందుతుంది. “కథ ఏక అంశం మీద నడవాలి. ఏక కాలంలో నడవాలి. కథ ప్రక్రియ కాదు, వస్తువు కథలో స్ప్రెడ్ పెట్టి కట్ చేయకూడదు” అంటారు.

ఆంధ్రదేశంలోని కోస్తా, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల ప్రజా జీవితం, ఆచార వ్యవహారాలు, వారి వారి మాండలిక భాషలతో కూడాఆయన పేరు అంత గాఢంగా ముడిపడి వుంది. నవలా రచయితగా మూడు మాండలికాల్లో ఆయన రచనలు చేసారు. 'వెలుగు వెన్నెల గోదావరి' కోస్తా మాండలికంలో (1961 ఆంధ్రప్రభ నవలల పోటీలో ప్రథమ బహుమతి), తెలంగాణా మాండలికంలో 'ముత్యాల పందిరి' (1964 ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక పోటీలో తృతీయ బహుమతి) రాయలసీమ మాండలికంలో 'రంగవల్లి' ఆ రోజుల్లో పండిత, పామరుల ప్రశంసలను పొందాయి. అయితే ఆయన 1954లో కలం పట్టింది కథతోనే. ఆ కథ పేరు 'పిచలూ జాబులూ' ఆ పేరుతో తర్వాత కాలంలో నవల కూడా రాసారు. వీరి కథల్లో వారికి గొప్ప పేరును సంపాదించి పెట్టినవిగా చంద్రవంక, మాలినివృత్తం, పొగడపూలు, కోమలి నవ్వింది, పునరపి జననం, చలితరంగ, ఏలినవారు, కారప్పూస పొట్లం, జాగృతి, చిత్రలత మొదలైనవి.

వీరు కథకు ఎంత వినూత్నంగా టైటిల్ పెడతారో వారి కథావస్తువులు కూడా అంత వినూత్నంగా మనకు కనిపిస్తాయి. వీరి గ్రంథం తెలుగు కథానిక స్వరూప స్వభావాలు నేటి యువ రచయితలంతా తప్పక చదివితీరాలన్నది అక్షర సత్యం. పోరంకి దక్షిణా మూర్తి గారు యిప్పుడు అంతగా కథలు రాయటం లేదు. నేడు వస్తున్న కథల్లో కొత్తదనానికి కరువయింది. నేటి యువ కథకుల కోసం ఆయన తిరిగి గతంలోలా ఓ యజ్ఞంలా కథలు రాయాలనికోరు కుందాము.

రచయిత చిరునామా
పోరంకి దక్షిణామూర్తి
ఫ్లాట్ నెం. ఎ.2, ఫ్లోర్ నెం. 5,
3-3-835/2, మీరా నికేతన్,
కుత్బిగూడ లేన్, హైదరాబాద్ - 27.



# పాత్తూరి రాజేంద్ర ప్రసాద్ వర్మ



"రాయడంలో ఉన్న సరదా రాస్తానని చెప్పుకోవడంలో నాకు ఉండదు. నా చుట్టూవున్న చాలా మంది స్నేహితులకు రచయితనన్న విషయం అసలు తెలీదు" అంటారు 'భీమునిపట్నం'కు చెందిన కథకుడు పొత్తూరి రాజేంద్రప్రసాద్ వర్మ.

గత పది సంవత్సరాలుగా వీరికథలు అనేక వార, మాస, పత్రికలు ప్రచురిస్తున్నాయి. 'పొత్తూరి రాజేంద్ర ప్రసాద్ వర్మ' పేరుతోనే కాకుండా రాజి, మల్లిక, పాంచజన్య పేర్లతో కూడా వర్మగారు కథలురాస్తుంటారు. వర్మ రాసిన కథలు అన్ని వార, మాస పత్రికలు కలిపి 60 సాంఘీక కథలు, 50 పిల్లల కథలు ప్రచురించబడ్డాయి. అపరాధపరిశోధన పత్రికలో 40 డిటెక్టివ్ కథలు రచించారు. కధారచనతో పాటు కవితలు, రేడియోనాటికలు, కార్టూన్లు గీయటం వీరి హాబీలు.

వర్మగారి సాహిత్యగురువు 'వసుంధర'. ఆ పేరుతో కథలు రాసే దంపతులకు ఏకలవ్య శిష్యుడ్ని అని పలు సందర్భాల్లో వర్మగారు చెబుతుంటారు.

"రాయాలని కాకుండా రాయాలన్పించినప్పుడే రాయడం ఇష్టం" అనే వర్మగారు విద్యార్థి దశలోనే అంటే, 20 ఏళ్ళ క్రితం "వర్ధమాన" అనే సాహిత్య పత్రికని నిర్వహించారు. అంతేకాకుండా 'కళాసాహితీ సాంస్కృతిక', 'వర్ధమాన రచయిత'ల సంఘాలను ప్రారంభించి కార్యదర్శిగా కొనసాగారు.

వర్మగారు వృత్తిరీత్యా విశాఖ జిల్లా 'ఆనందపురం' మండలంలో 'లొడగలవానిపాలెం' ప్రభుత్వ పాఠశాలకి ప్రధానోపాధ్యాయులుగా బాధ్యతలు చేపడుతున్నారు. ఇంకా జిల్లా ప్రాధమిక విద్యాపధకం, పాఠశాలల కేంద్రానికి కార్యదర్శిగా, పంచాయతీ రాజ్ టీచర్ల యూనియన్ రాష్ట్ర కారదర్శిగా, భారత వికాస్ పరిషత్ భీమునిపట్నం యూనిట్‌కి కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

వర్మగారికథలు చదివించేగుణం కలిగి ఉంటాయి. కథలో మలుపు, కొసమెరుపు తప్పనిసరని వీరు నమ్ముతారు. నిజానికి వర్మగారి కథలు పరిశీలిస్తేమనకు ఆ విషయం స్పష్టంగా కనిపిస్తుంది. రాష్ట్ర సాంస్కృతిక మండలి నిర్వహించిన 'కథానిక' శిబిరంలో విశాఖ జిల్లా నుంచి హైదరాబాదు వచ్చి పాల్గొని రాష్ట్ర కధారచయితలతో తమ అభిప్రాయాలు పంచుకున్నారు. శిబిరంలోని రచయితలతో ఓ కధాసంకలనం తీసుకురావటంలో ముఖ్య పాత్ర పోషించారు. జర్నలిజంలో కూడా ఆసక్తి ఉన్న వర్మగారు గత 25 సంవత్సరాలుగా ఓ ప్రముఖ దినపత్రికలో రిపోర్టర్‌గా పనిచేస్తున్నారు.

వర్మగారు ఇటీవల 'రచన' సాహిత్య మాస పత్రికలో, 'పత్రిక' సాహిత్య పత్రికల్లో క్రమంగా కథలు రాస్తూ రాష్ట్ర నలుమూలల ఉన్న ప్రముఖ కథకుల, పాఠకుల మన్ననలు పొందుతున్నారు. ప్రచారం అంటే అంతగా ఇష్టపడని వర్మగారు అతి త్వరలోనే తుఫానులా సాహితీ క్షేత్రాన్ని చుట్టుకొనున్నారు.


రచయిత చిరునామా
పొత్తూరి రాజేంద్రప్రసాద్ వర్మ
తోట స్ట్రీట్, భీమునిపట్నం,
విశాఖపట్నం - 531163.



# బలివాడ కాంతారావు

"నేను తెలుగు సాహిత్యానికి ఇచ్చింది తక్కువే కాని.. తెలుగు పాఠకులనుంచి నేనెంతో తీసుకున్నాను" అంటారు ప్రముఖ కథా రచయిత బలివాడ కాంతారావు.

1927, జులై 3వ తేదీన శ్రీకాకుళం జిల్లా 'మండపం' గ్రామంలో జన్మించిన బలివాడ వృత్తిరీత్యా నావికాదళంలో పనిచేసారు. ఉద్యోగరీత్యా సువిశాల భారతదేశంలో వివిధ ప్రాంతాల్లో ఉండడం ఆయనకు దేవుడిచ్చిన వరం. భిన్న జీవిత ధోరణులను చూసారు. విభిన్న మనస్తత్వాలను పరిశోధించారు. తన సొంత అనుభవాలను, అనుభూతులను, ఇతరుల అనుభూతులనూ తన సొంతం చేసుకొని కథా వస్తువులు తయారు చేసుకోవటం వీరికి వెన్నతో పెట్టిన విద్య. చెడ్డవాళ్ళలో కూడా మంచిని చూసే గుణం మొదటి నుంచీ వీరికుంది. వీరి కథలు లోతుగా చదివితే అది స్పష్టంగా మనకు తెలుస్తుంది.

ఆయన సుమారు 350కి పైగా కథానికలు, ఐదు నాటికలు కొన్ని రేడియో నాటికలు, చారిత్రక నాటకాలు, 38 నవలలు రచించారు. వీరి రచన 'దగాపడిన తమ్ముడు' ఆంగ్లంలోనే కాకుండా భారతీయ భాషలన్నిటిలోకీ అనువదించబడ్డది. వీరి రేడియో నాటిక 'అడవి మనిషి'ని ఆకాశవాణి వారు దేశంలోని అన్ని కేంద్రాలనుంచి అన్ని భాషల్లోకి అనువదించి ప్రసారం చేసారు. ఇంకా వీరి పలు రచనలు అనేక ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి.

1950 వ దశకంలో బలివాడవారు 'భారతి' పత్రికలో విరివిగా కథలు రాసారు. అందులో ముఖ్యమైన కథలుగా 'కోరికల సత్యం', 'ఉద్యోగాలు', 'సాంబయ్య బావ లేడం', 'చక్రతీర్థ', 'మనిషి-పశువు', 'పాడు మనుషులు-పాడు లోకం', 'యాత్ర', 'రంగస్థలి' మొదలైనవి విశేష కీర్తిని వీరికి అందించాయి. ఈ కథలన్నీ మనిషి మంచితనానికి నిలువుటద్దాలుగా నిలిచినవే. వీరికి మనిషి మంచితనం మీద ఉన్న విశ్వాసం ఈ కథలు చదివితే తెలిసిపోతుంది.

"కథారచయిత-పాఠకుడు తన కన్నా తెలివైనవాడన్న భావనతోనే రాయాలి. పాఠకునికి నా కథను చదివి విమర్శించే హక్కుంటుంది. పాఠకుడు కథ చదివి హృద్యంగా వుందని ఆనందాన్ని, జ్ఞానాన్నీ పొందితే అప్పుడే కథారచయిత చరితార్థుడవుతాడు" అని అక్షర లక్షలు విలువ చేసే మాట పలుసందర్భాల్లో అనే బలివాడ గారికి 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ' వారు తెలుగు యూనివర్సిటీలు 1972, 1986 సం లో వీరి నవల 'పుణ్యభూమి', 'వంశదార'లకు ఉత్తమ నవల అవార్డులిచ్చి గౌరవించింది.

"ఒక వర్గంపై ఇంకో వర్గాన్ని ఉసి కొల్పే దోరణిలో చాలా కథలు వచ్చాయి. కథల్ని ఇన్ని విభాగాలుగా భాగించటం దేనికి? కథల్లో మంచి కథలు ఉంటాయి, చెత్త కథలు ఉంటాయి. అలా విభజిస్తేనే మంచిది. మన తెలుగు కథలు మిగితా భాషల కథలు అనుసరించినప్పుడే తెలుగులో గొప్ప కథలు వచ్చాయనుకుందా" అంటారు. బలివాడ వారిప్పుడు మన ముందు జీవించి లేకున్నా వీరి రచనలు చిరంజీవులేకదా.

రచయిత చిరునామా
**బలివాడ కాంతారావు**
*58-15-48, శాంతి నగర్,*
*విశాఖపట్నం - 530009.*



# బల్లెం వేణుమాధవ్

**1987** వ సంవత్సరంలో బాల చంద్రిక (ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ వారి ప్రచురణ) పత్రికలో ఒకేసారి రెండు కథలు ప్రచురించబడడంతో రచయితగా పాఠకులకు పరిచయమైనారు బల్లెం వేణు మాధవ్.

ఆ తర్వాత ఆంధ్రజ్యోతి, ఉదయం ఆదివారం అనుబంధాలకి, ఉదయం వీక్లీ, స్రవంతి, మయూరి, హారిక, బాలమిత్ర, రమ్య, అన్వేషణ, పల్లకి తదితర పత్రికలకి కథలని, 'సురక్ష' వంటి ప్రభుత్వ పత్రికలకి అనువాదాలని అందించారు.

బల్లెం వేణు మాధవ్ కథా రచనతో పాటు వివిధ పత్రికల్లో కొన్ని శీర్షికలు నిర్వహించి పలువురి ప్రశంసలు అందుకున్నారు. 'శివ రంజని' లో సినిమా కాలమ్స్ 'అన్వేషణ' లో కళారంగ పరిచయాలు రాసిన వీరు 'శ్రీ షిర్డీసాయి విభూతి' మాస పత్రికలలో 'బాలల విభూతి' అనే శీర్షికను, 'స్రవంతి' లో 'జూపార్క్ చూస్తారా?' అనే శీర్షికను, కృష్ణా పత్రికలో 'సినిమాక్షరాలు', సరదా పక్షపత్రికలో 'సినీమహల్' వంటి శీర్షికల్ని పాఠకులకు అందించారు.

బల్లెం వేణుమాధవ్ బాలలకోసం ప్రత్యేకంగా ఓ కథాసంపుటిని 'బల్లెం వేణుమాధవ్ బాలసాహిత్యం' పేరిట ప్రచురించారు. ఈ కథలన్నీ బాలపాఠకులతో పాటు పెద్దల్నీ ఎంతో ఆకట్టుకున్నాయి. ప్రముఖ సినీ రచయిత, నటులు శ్రీ తనికెళ్ళ భరణి వీరిని ప్రత్యేకంగా అభినందించారు. బాలసాహిత్యంతో పాటు పెద్దలకు సాంఘీక కథలు కూడా రాసిన వేణు మాధవ్ 'బల్లెం వేణుమాధవ్ కథలు' కథా సంపుటిని ప్రచురించారు.

"బల్లెం వేణుమాధవ్ కథలలో చెణుకులుంటాయి చమత్కారాలు వుంటాయి. కనువిప్పు కలిగించే సందేశాలుంటాయి. పిల్లలకు రాసే కథలు కాకమ్మ కబుర్లు మాత్రమే అని కొట్టి పారేయడానికి వీల్లేదని, అణుమాత్రంగా ఉండే చిట్టి చిట్టి కథల్లో అణు బాంబుకు ఉన్నంత శక్తి ఉందని వేణు మాధవ్ తన కథల ద్వారా రుజువు చేయగలిగాడు" అని ప్రముఖ కథకులు చొక్కాపు వెంకటరమణ అంటారు.

వీరి వివిధ సాహితీ ప్రక్రియలకు అభినందన పూర్వకంగా సాహితీ సాంస్కృతిక సంస్థ 'పద్మమోహన ఆర్ట్ థియేటర్స్' వారు 'కథా రచన ప్రవీణ' బిరుదుప్రధానం చేసారు. ఆ తరువాత సాంస్కృతిక రంగంలోకి అడుగుపెట్టిన శ్రీ వేణు మాధవ్ 'బల్లెం వేణు మాధవ్ ఆర్ట్ థియేటర్' సాహితీ, సాంస్కృతిక, సంఘసేవా సంస్థను స్థాపించి అనతికాలంలోనే విశేషమైన పేరు ప్రఖ్యాతలు సంపాదించారు. వీరి కథాసంపుటాలలో వీరి సోదరి 'శ్రీలతా మాధురి' బొమ్మలు గీయటం విశేషం. 'బల్లెం' సాహితీ సాంస్కృతిక శిఖరాలు చేరుకోవటం మరెంతో కాలం పట్టదు.

రచయిత చిరునామా
బల్లెం వేణుమాధవ్,
2-1-17, మెయిన్ రోడ్, ఉప్పల్,
హైదరాబాద్ - 500 039.



# భాగవతుల సుబ్రహ్మణ్యం

**1958** సం. లో శ్రీకాకుళం జిల్లా 'వీరఘట్టం' లో కనులు తెరచిన భాగవతుల సుబ్రహ్మణ్యం సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లో ప్రవేశమున్నా తన కిష్టమైన ప్రక్రియ కథ అని బల్లగుద్ది చెబుతుంటారు.

సుబ్రహ్మణ్యంగారు తన 17వ ఏటనే అంటే 1975లో రాసిన తొలికథ ఆంధ్రప్రభ వార పత్రికలో ప్రచురింపబడింది. హేమాహేమీ రచయితల కథల మధ్య ప్రముఖ సంపాదకుడు 'విద్వాన్ విశ్వం' గారి సంపాదకత్వంలో, అంత చిన్న వయసులో తొలికథ ప్రచురితం కావడం, సుబ్రహ్మణ్యం గారి రచనా జీవనానికి గొప్ప నమ్మకాన్నిచ్చింది. ఆ తరువాత వరుసగా ప్రముఖ వార, మాస పత్రికలన్నిటిలోనూ ప్రచురిత మయ్యాయి. "ఇప్పటివరకు కేవలం నలభైకథలు మాత్రమేరాసాను. అయితే అన్నీ ప్రచురించబడటం చాలా ఆనందం కల్గిస్తుంది" అంటారు సుబ్రహ్మణ్యం.

1993, 1995లో 'రచన' మాసపత్రిక, 'విపుల' మాసపత్రికలు నిర్వహించిన కథల పోటీల్లో వీరికి బహుమతులు లభించాయి. యండమూరి సంకలించిన 'అభిషిక్తం' లో సుబ్రహ్మణ్యంగారి కథ 'ధ్వజస్థంభప్రతిష్ట' చోటు చేసుకోవటమే కాకుండా రచయితగా మంచి గుర్తింపు తీసుకువచ్చింది. అయితే ఈ కథ 'భారతి' సాహిత్యమాస పత్రికలో వచ్చింది.

కథారచనతో పాటు నవలా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న సుబ్రహ్మణ్యంగారు 1990లో పత్రికవీక్లీలో 'భారతమహాకవిత్రయం', 1997లో భూమిడైలీ లో 'అభినయని', 2000-2001 లో ఆంధ్రప్రభ వీక్లీలో 'కళాపూర్ణోదయం' అను సృజనాత్మక సీరియల్ ప్రచురించబడ్డాయి. పౌరాణిక, చారిత్రక గాధలు బాగా రాయగలరని నిరూపించాయి.

1993 'చతుర' లో ప్రచురించిన 'చైత్రంలో చిరుజల్లు' నవల, 1995 చతురలోనే ప్రచురించబడిన 'సూపర్ హిట్' నవలలు, 1996 'స్వాతి' లో ప్రచురించిన 'సోడాల్రాజు-వీడియో ఫిల్మో' నవలలు రచయితగా సుబ్రహ్మణ్యంగారిని ఒక స్థాయికి తీసుకొచ్చాయి. జెమిని టి.వీ ఛానల్‌లో తొలిమెగా సీరియల్ "ప్రియసఖి" కి సంభాషణల రచయితగా పనిచేసిన వీరు, 1997లోనే జంధ్యాల గారి 'హాస్యదర్బార్' సీరియల్‌కు సహదర్శకుడిగా సేవలందించారు.

దాదాపు పాతిక కవితలు వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి. డా వెలుదండ నిత్యానందరావు గారు వీరి 'పేరడీ' లపై పరిశోధన (ఉస్మానియా) చేసారు. 1990లో ఈ సిద్దాంతవ్యాసం వచ్చింది.

"సరదాకైనా ఒక్క కథా సంకలనం కూడా ప్రచురించలేదు, ఐతే త్వరలో కథాసంపుటి ప్రచురిస్తాను". అంటున్నారు భాగవతుల సుబ్రహ్మణ్యంగారు.


రచయిత చిరునామా

**భాగవతుల సుబ్రహ్మణ్యం**

26-125, గ్రేస్ స్కూల్ ఆఫ్ నర్సింగ్ వెనుక భాగం, బుట్టాయిపేట, మచిలీపట్నం.

# డా. బి.ఎస్.ఎన్. మూర్తి



విజయనగరం జిల్లా 'సాలూరు' ప్రాంతానికి చెందిన డాక్టర్ బలుసు సూర్యనారాయణ మూర్తి గారు కథకుడిగా 'డా. బి.ఎస్.ఎన్. మూర్తి' పేరుతో తెలుగు సాహితీ ప్రియులందరికీ పరిచయమే.

విశాఖపట్నం ఆంధ్రమెడికల్ కాలేజీలో వైద్యవిద్య పూర్తి చేసిన బి.ఎస్.ఎన్.మూర్తి గారు మెడిసిన్ విద్యార్థిగా ఉన్నప్పుడే పులువురు సాహితీ ప్రియుల పరిచయాలు, సాంస్కృతిక వాసనలు, మంచి పుస్తకాల పఠనానికి, వినసొంపు సంగీతాల ఆస్వాదానికి, ప్రముఖ కథకులతోటి సంబంధాలు ఏర్పడ్డాయి.

డా. బి.ఎస్.ఎన్.మూర్తి గారి కథలు విజయ, గీతాంజలి, జ్యోతి, స్వాతి, ఆహ్వానం, చందమామ, మందాకిని మాసపత్రికల్లోనూ, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, కృష్ణాపత్రిక, స్రవంతి, స్వాతి వార పత్రికల్లోనూ, ఇంకా ఈనాడు దినపత్రికల్లో ప్రచురించబడ్డాయి.

జులై 2000 సంవత్సరంలో డా.మూర్తి గారు తన కథల్లో ఆణిముత్యాలుగా గుర్తించబడ్డ కొన్ని కథలు అంటే... 36 కథలతోటి 'గాంధీ మేకు', కథాసంపుటిగా 'శ్రేష్ఠ లిటరరీ ట్రస్టు' ద్వారా పాఠకులకు అందించారు. 'గాంధీ మేకు' కథా సంపుటిలో పెద్దల కథలతో పాటు ఒకటి, రెండు బాలల కథలు కూడా చోటు చేసుకోవడం విశేషం.

సగటు మనిషి జీవితంలోని దారిద్ర్యం, భయం, అజ్ఞానం, నైరాశ్యం, రాజకీయం యిన్ని ఇబ్బందులున్నా ప్రేమ, కృషి, ఆశ, హాస్యం కూడా వున్నాయి కదా అని ఊరట చెందే స్నేహవాది డా.మూర్తి. తన జీవితంలో ఎదురైన చిన్న చిన్న సంఘటనలకు చక్కటి శైలిలో కల్పితం జోడించి కొసమెరుపుతో కథలుగా మలచటం మూర్తిగారికి దేవుడిచ్చిన వరం.

డా. మూర్తిగారి కథల్లో 'గాంధీమేకు', 'జీవిత చరిత్రలు', 'బ్రెయిన్ ఫర్ సేల్', 'బ్ర బాబాగారి దర్శనం', 'రంగుల రాట్నం', 'గదిలో చేమంతి', 'కాకి-కుక్క', 'మహానటుడు', 'జాంగీరు జమా జమా' కథలు తప్పక చదవ వలసినవి. ఈ కథల్లో ఆ సాంతం చదివించేగుణంతోపాటు, చక్కటి హాస్యం, సందేశం తప్పకుండా ఉంటుంది.

డా.మూర్తిగారికి ప్రముఖ కథకులు, పంతుల జోగారావు, పోతుబరి నారాయణరావు గార్లతో మంచిస్నేహం వుంది. నిజానికి వారి ప్రోత్సాహమే మూర్తి గారు కథకుడిగా నిలబడటానికి ఒక కారణం.

హాస్యనాటికలు రాయడమన్నా ఎంతో ప్రీతి ఉన్న మూర్తిగారు 'బ్రెయిన్ ఫర్ సేల్', 'రహస్యం' అనే పెద్ద నాటికలు రాసారు. 'బ్రెయిన్ ఫర్ సేల్' హాస్యనాటిక ఆంధ్రజ్యోతిలో సీరియల్‌గా ప్రచురించబడటం విశేషం. విజయనగరం జిల్లా నుండి కథకులుగా సాహిత్య సేవలు అందిస్తూ ప్రతినెలా సాహితీ సభలు నిర్వహిస్తున్నారు.


రచయిత చిరునామా
**డా. బి.ఎస్.ఎన్.మూర్తి**
శ్రీనివాస హాస్పిటల్, కొంకి వీధి,
సాలూరు - 535591
విజయనగరం జిల్లా.



# బి.యస్. రాములు



"కారుల్లో తిరిగి ఏ.సి.లో నిద్రించేవాడు ఓ పేదవాడిగురించి కథరాస్తే ఆ కథకు న్యాయం చేకూర్చలేడు. ఆ పేదరికాన్ని అనుభవించి అనుభూతి చెంది స్పందించి రాస్తే అద్భుతమైన కథ తయారవుతుంది" అనే వారు ప్రముఖ కథారచయిత బి.యస్. రాములు.

జైత్రయాత్రల ఖిల్లా అయిన కరీంనగర్ జిల్లా జగిత్యాలలో 1949 ఆగస్టు, 23న ఓ నిరుపేద కుటుంబంలో జన్మించిన బి.యస్. రాములు తొలి కథ 1968 జనవరి 'బాలమిత్ర'లో 'జగిత్యాలకథ' పేరుతో ప్రచురితమైంది. అయితే బి.యస్. రాములు చందమామ, బాలమిత్రవంటి పత్రికల్లో రచనలు చదివి స్ఫూర్తి పొంది తొలిసారిగా 1963-64లో తొమ్మిదో తరగతి విద్యార్థిగా ఉన్నప్పుడే పాఠశాల ప్రత్యేక సంచిక 'స్రవంతి' లో వీరి పద్యాలు ప్రచురించబడ్డాయి.

ఆ తర్వాత కొంతకాలం కవిత్వం వైపుకు ఆకర్షితులైనా, ఎన్నో కవి సభలు నిర్వహించినా, ఎందరినో కవులుగా ఎదిరించినా... 1978 ప్రాంతంలోతిరిగి కథారచనను చేపట్టారు. 1980లో పాలమూరు జిల్లా లేబరు గురించి సృజనలో రాసిన 'తిరుగుబాటు' కథలో బి.యస్. రాములు తెలుగు పాఠకులకు మళ్ళీ కొత్తగా పరిచయమయ్యారు. అది మొదలు భారతీయ చరిత్ర, తెలుగు చరిత్ర, తెలంగాణా ప్రాంతీయ చరిత్రల్లోని ముఖ్య లక్షణాల్ని పట్టించుకుని రచనలు చేసారు. కులం, వర్గం, ప్రాంతం, అభివృద్ధి, ప్రేమలు, చదువులు, స్త్రీ పురుష వివక్ష, ఉద్యమాలు అన్నీ వీరి కథల్లో కనిపిస్తాయి.

ఇప్పటికి 60కిపైగా కథల్ని రాసిన బి.యస్. రాములు 'పాలు', 'స్మృతి' పేర రెండు కథా సంకలనాల్ని తెచ్చారు. ఎందరినో కథకులుగా తీర్చిదిద్దారు. 1982లో 'బతుకుపోరు' (నవల), 1982లో 'పాలు' (కథల సంపుటి), 1983లో 1982లో 'పాలు' (కథల సంపుటి), 1983లో 'దొంగలు' (నవల), 1985లో విశ్వ సహజాతాలు (నవల), 1998లో 'స్మృతి' కథలు, 'కథలబడి', 1999లో 'మమతలు - మానవ సంబంధాలు'(కథల సంపుటి) వెలుగు చూసి పాఠకలోకాన్ని ఎంతో ఆకర్షించాయి. 'తెల్లబట్ట'కథలో సాంఘిక పరిస్థితులు బలీయమైనవని సగటు మనిషి జీవితాన్ని తీర్చడంలో ముఖ్య పాత్ర వహిస్తాయని, ఆ సగటు మనిషి అనుభవంలో ఎదిగాక తాను కోల్పోయిన జీవితాన్ని అదే మనుషుల మధ్య అదే సమాజంలో తిరిగి తన కృషితో గెలుచుకోవాలని అదే విప్లవము, జీవితము అని చెప్పే ముగ్గురు బాల్య స్నేహితుల కథ.

వీరి సాహిత్య సేవను గుర్తించి రాష్ట్ర నలుమూలల నుండి కథా రచయితలు, అభిమానులు, పోషకులు వీరి '50వ జన్మదిన స్వర్ణోత్సవ, సాహిత్యోత్సవ సంవత్సరం ఏడాదంతా పండుగ 1998-99' అనే కార్యక్రమం జగిత్యాల లో ఘనంగా జరిపారు. రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుగారు ప్రత్యేక అభినందనలు తెలుపుతూ వీరికి లేఖ రాసారు. మరి ఇదంతా వీరి సాహిత్య కృషికి గుర్తింపే కథా! సమాజం అవకాశాలు కల్పించకపోయినా సమాజంతో పాటు ఎదిగి సమాజాన్ని ఎదిగించే కథారచయిత బి.యస్. రాములుగారు సామాజిక చైతన్యం కోసం మరిన్ని కథానికలు వారి కలం నుండి వెలువడాలి.


రచయిత చిరునామా

బి.ఎస్. రాములు

6-2-157, మిషన్ హాస్పిటల్ దగ్గర,

జగిత్యాల - 505 327.

కరీంనగర్ జిల్లా.





# బులుసు-జీ-ప్రకాష్

"కథను వీలైనంత క్లుప్తంగా శిల్పం, కొసమెరుపుతో ఉండి, చెపితే పాఠకుడిని ఆకట్టుకుంటుంది" అంటారు బులుసు-జీ-ప్రకాష్ గారు. ఆయన పూర్తిపేరు 'బులుసు గురుప్రకాష్'.

మొదట బాలసాహిత్యం ఎక్కువగా రాసారు బులుసు. కథా రచనలో బాలసాహిత్యం చాలా కష్టమని రచయితల అభిప్రాయం. కాని వీరికి ఇది వెన్నెతో పెట్టిన విద్య. "నాకు కథలురాయటానికి, ప్రేరణ, ప్రోత్సాహం కల్పించింది 'బాల' అనే బాలల సాహిత్య పత్రిక" అంటారు. నిజానికి వీరి మొదటి కథ 'బాల నాటకం' ప్రచురించబడిందికూడా 'బాల' పత్రికలోనే. 1949 నుండి వీరు కథలు రాయడం మొదలుపెట్టి నేటికీ తమ కలాన్ని కదిలించటం పాఠకుల అదృష్టం.

చిన్న కథల పెద్ద రచయితగా పేరు గాంచిన బులుసుగారు "కథను వీలైనంత క్లుప్తంగా చక్కటి కథా వస్తువు ఎన్నుకొని, చక్కటి శైలి, శిల్పంతో నడిపిస్తూ కొసమెరుపుతో ముగించటం పాఠకుడిని ఆకర్షిస్తుంది" అంటారు. వీరిని ప్రముఖ కథా రచయిత శ్రీ కప్పగంతుల మల్లికార్జున రావుగారు 'మినీ కథాప్రపూర్ణుడు' అని వర్ణించారు. అచ్చులో ఒకటి లేక ఒకటిన్నర పేజీలకు మించని మినీ కథలో రసానుభూతులూ, సామాజిక ప్రయోజనాలు, తర్కాల్లాంటివి ఉంటే ఉండవచ్చునేమోగాని, ప్రధానంగా ఉండాల్సింది ఒక సన్నివేశం బిల్డప్, చివరన కొసమెరుపు.

వృత్తిరీత్యా విద్యుత్ శాఖలో పనిచేసిన వీరు ప్రవృత్తి కథాసాహిత్యరంగాన్ని ఎన్నుకోవటం పాఠకుల అదృష్టం. వీరు తమ కథల్లో టైటిల్ నుంచి ప్రారంభం, ముగింపు వరకు ఎంతో వినూత్నంగా కలాన్ని కదలిస్తారు. మచ్చుకు కొన్ని కథానికల పేర్లు గమనించండి. 'క్షీరాభిషేకం', 'రాజిక్కు-మేజిక్కు', 'కేసబియాంకా', 'ఇప్పటికే భూమి గుండ్రంగా వుంది', 'కర్ణపిశాచి' మొదలైనవి. ఇలాగే పాత్రలపేర్లూ వినూత్నంగా, 'ఆయన', 'ఖగపతి', 'సరిత్పతి', 'ప్రద్యుమ్నరావు', 'జలజ పంథి', 'గోపీ వల్లభరావు', 'మైథిలీ పతి', 'వటపత్రశాయి', 'పుణ్యశ్లోక రావు', 'నీలోత్పలరావు', 'శేషతల్పం', 'వృషాకపి', 'అహీపతి', 'చతురాననం' అనే పేర్లు పెట్టారు.

నిన్నటి దాకా బభ్రాజమానం లాంటి వ్యక్తి ఎలా పేరు సంపాదించాడో 'కర్ణపిశాచి' కథలో చూపిస్తారు. అలాగే.... లంచం పడందే ఏ కాగితాలు చూడవద్దని ఆర్డరు జారీచేసిన బావి శాంక్షన్ చేసే ఆఫీసర్‌కు తన ఆర్డర్ భస్మాసుర హస్తంగా ఎలా మారుతుందో 'కష్టార్జితం' కథలో వివరిస్తారు. వీరు ఇప్పటికీ ఎంతో ఉత్సాహంగా ఇలాంటి చిన్న కథలు రాస్తున్నారు.

భారతీయ సంస్కృతి, విలువలు ఆయనకు ప్రాణం. ఆయన కథా వస్తువులుగా పత్తిరైతుల ఆత్మహత్యలు, కరువుకాటకాలు, అతివృష్టి, భూకంపం మొదలైన వినూత్న వస్తువులు ఎన్నుకొని పాఠకులను రంజింపజేస్తూ ఇంకా నేటి యువ రచయితలతో పోటీపడి రచనలు సాగిస్తున్న కథల మాంత్రికుడు.


రచయిత చిరునామా
బులుసు - జీ- ప్రకాష్
25-11-14, అయ్యకోనేరు ఈస్ట్‌బ్యాంక్,
విజయనగరం - 535 002.



# భూపాల్

'సామాజిక స్పృహలేనిదే కథ రాయకండి' అంటారు. కథా రచయిత భూపాల్. ఈయన పూర్తి పేరు 'భూపాల్‌రెడ్డి' 'భూపాల్ కలం పేరుగా ఎన్నో కథలు అందించిన ఈయన **1953** లో జన్మించారు.

భూపాల్ కేవలం కథా రచయితే కాదు నటుడు కూడా నాటక రంగాలలో రచయితగా, దర్శకుడిగా, నటుడిగా ఎన్నో సేవలందిచారు. కొన్ని సినిమాలకు కథలు రాసారు, నటించారు, దర్శకత్వం చేపట్టారు. ఎన్నో అవార్డులు సాధించారు. 1978లో 'భూపాల్ కథలు', 1980లో 'పెద్ద పోచమ్మ' పాటలు, కన్నీటి కథ (పాటలు), 1983 'వెన్నెలలో', 1995లో 'అంబల్లబండ' సంపుటి, 1996లో 'కొమరంభీం' పిల్లల నవల, 1998లో 'వస్తావా చిలుకల కొలికి' పిల్లల నవల, 1998లోనే 'పట్నమొచ్చిన పల్లె' నవల వీరివి వెలుగు చూసి విశేష ఆదరణ పొందడమే కాక వీరికి గొప్ప పేరు ప్రఖ్యాతలు తీసుకొచ్చాయి.

తెలంగాణా ప్రాంతానికి చెందిన ఈయన "తెలంగాణా భాష మాట్లాడే వాళ్ళను స్వీపర్‌గా, గూండాలుగా ఈ రోజుల్లో సినిమాల్లో చూపిస్తున్నారు" అంటూ ఆవేదన వ్యక్తం చేసారు. వీరి కథల్లో ఎక్కువగా తెలంగాణా మాండలికం ఉపయోగిస్తారు. భూపాల్ హీరోగా నటించిన 'మాభూమి' సినిమా 1980 రాష్ట్ర జాతీయ అవార్డు పొందింది. అలాగే 1983లో 'పార్' హిందీ సినిమాకు రాష్ట్ర, జాతీయ అవార్డు అందుకున్నారు. 'మా భూమి', 'దాసి', 'కుమరంభీం', 'ప్యార్ కీ మన్' మొదలగు చిత్రాల్లో భూపాల్‌గారు అవార్డు అందుకొని ఉత్తమ నటుడిగా గుర్తించబడ్డారు.

భూపాల్ ఎన్నో నాటికలు రచించి, నటించి, దర్శకత్వం చేపట్టారు. వాటిలో విషపుత్రుడు, ఫలితం శూన్యం, కవిరాజకంఠంబు, గొర్లు బోయినయి, ఎవరు దొంగ ముఖ్యమైనవి. ఇంకా చాలా నాటికలు ఆకాశవాణిలో ప్రముఖంగా ప్రసారమైనాయి.

తెలంగాణాలో భూస్వాములు బడుగు వర్గాల ప్రజలపై చేసిన దౌర్జన్యాలను తెలిపే కథలు, భూపోరాటాల అనంతరం భూస్వాముల పరిస్థితులలో వచ్చిన మార్పులను, మారుతున్న భావాలకు, మారని విలువలకు మధ్య జరిగే సంఘర్షణను తెలుపుతూ భూపాల్ కలం నుంచి ఎన్నో కథలు వెలువడ్డాయి.

బాలల కోసం ఎన్నో పుస్తకాలు రచించారు భూపాల్. మనబడి, క్రమశిక్షణ, ముద్దూ ముచ్చట్లు, తాతా మనవడు, బొమ్మలు బల్లా చెక్క, ఏమి చదువులు ఇంకా ఎన్నో బాల సాహిత్య సంపుటాలు వీరివి ప్రచురించబడ్డాయి. సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లో ప్రవేశించి అన్నిట్లో పేరు సంపాదించిన వీరు ఇంకా మరెన్నో రచనలు మనకు అందించాలని మనమంతా కోరుకుందాము.


రచయిత చిరునామా

**ఎం. భూపాల్ రెడ్డి**

ఇం.నెం.2-2-985, అంబర్‌పేట,

హైద్రాబాద్ - 500013.



# బోయ జంగయ్య

"జీవన గమనంలో పుట్టే సమస్య, సంఘటన దాని పరిణామమే కథ" అంటారు 'నల్లగొండ' కు చెందిన ప్రముఖ కథకులు శ్రీ బోయ జంగయ్య. ది **1-1-1942**న నల్లగొండ జిల్లా రామన్నపేట తాలూకాలోని 'పంతంగి' గ్రామంలో జన్మించిన వీరిని కథకులంతా ముద్దుగా 'బోజ' అని పిలుచుకుంటారు.

1960 లో అంటే 'బోజ' గారు పదోతరగతి చదువుతున్నప్పుడే 'కష్టసుఖాలు' అనే నాటిక రాసారు. 1964 లో మొదటి కథరాసారు. ఈ రెంటికి బహుమతులు రావటం విశేషం. అయితే 1963 లో 'కష్టసుఖాలు' నాటికను పుస్తక రూపంలో తీసుకువచ్చి తెలుగు సాహితీ ప్రియులకు కానుకగా అందించారు. 1969లో మానవ సంబంధాలపై రాసిన 'మనస్సు' కథ తరుణి అనే మాసపత్రికలో ప్రచురించబడింది.

బోయ జంగయ్యగారు ఇప్పటివరకు మొత్తం 7 కథా సంకలనాలు కథాభిమానులకు అందించారు. 1973లో 'లోకం' అనే సంకలనం ప్రచురించి ఆ తరువాత వరుసగా 'గొర్రెలు', ఎచ్చరిక, దున్న, రంగులు, చీమలు, తెలంగాణా వెతలు సంకలనాలు అందించారు. అయితే 'గొర్రెలు' కథలను, ఎం.ఏ. తెలుగు కు పాఠ్యగ్రంథంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం, 'దున్న' కథలను కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం ఎం.ఏ తెలుగు పాఠ్యాంశంగా ఎన్నిక చేయటం విశేషం.

బోయ జంగయ్యగారు తన కథల్లో ఇతి వృత్తాలుగా తన చుట్టూ వున్న పేదరికం, రోగాలు, మూఢ నమ్మకాలు, దోపిడి, దౌర్జన్యం, అవమానం, అజ్ఞానం, కులతత్వపు చిన్న చూపు... ఇలాంటివి ఎన్నుకుంటారు. దీనంతటికి కారణం... చిన్నతనం నుండే వీటిని ప్రత్యక్షంగా చూసారు. అనుభవించారు. అందుకే వీరి కథ చదివి స్పందించని పాఠకుడు ఉండడంటే అతిశయోక్తి కాదు.

కథలు రాయటానికి అర్హతలుగా ముందు కథ రాయాలన్నా ఆసక్తి, సమాజం తీరు మీద పరిశీలన, సంఘటనల మీద స్పందన మానవత్వం పట్ల అచంచల విశ్వాసం. జీవితాన్ని ప్రేమించగలగడం, మనిషికి మనిషికి మధ్య పెరుగుతున్న పరాయితనం తగ్గించే ప్రయత్నం ఆలోచించే విధానాన్ని నేర్పడం, అన్యాయాన్ని ఎదిరించే శక్తిని పెంచడం, తానుబతుకుతూ ఇతరులను బతకనిచ్చే అవగాహనను కలిగించడం తప్పనిసరిగా ఉండాలనే 'బోజ' 'జాతర' పేరుతో ఒక నవల, నడుస్తున్న చరిత్ర, వెలుతురు, పావురాలు, అనే కవితా సంకలనాలు ప్రచురించారు.

వృత్తి రీత్యా 'ప్రభుత్వ ఖజానాలు మరియు లెక్కల శాఖ' లో పని చేసి ప్రస్తుతం వృత్తికి విరమణ గావించి విశ్రాంతి తీసుకుంటున్నా తన కలానికి మాత్రం విశ్రాంతినివ్వరు, బోయ జంగయ్య గారు మరిన్ని మంచి కథలు మనకు అందిచాలని మనమంతా కోరుకుందాం.

రచయిత చిరునామా
బోయ జంగయ్య
5-9-214, మన్యం చల్క,
నల్లగొండ - 508001.



# బొల్లిముంత వెంకట రమణారావు

"కథ - కల్పనైనాగాని, జీవితానికి దగ్గరగా మనిషి ఆలోచనలు ప్రతిబింబించే విధంగా వున్నప్పుడే నాలుగు కాలాలు నిలుస్తుంది. నలుగురిని చదివిస్తుంది" అంటారు ఖమ్మంజిల్లాకు చెందిన యువ కథకుడు బొల్లిముంత వెంకటరమణారావు.

కథారచయితగా, కవిగా, నాటక రచయితగా, జర్నలిస్టుగా, అనౌన్సర్‌గా పలు ప్రక్రియలలో కృషి చేస్తూ.... తనదైనశైలిని ప్రకటించడానికి ప్రయత్నిస్తున్నారు బొల్లిముంత.

ఆకాశవాణి కొత్తగూడెం కేంద్రంలో దాదాపు 8 సం.లు క్యాజువల్ అనౌన్సర్, ప్రొడక్షన్ అసిస్టెంట్ గా పనిచేసారు.

కథారచయితగా తాను రాసిన కథలు తక్కువైనప్పటికి, రాసిన నాలుగు కథలు మెచ్చుకోదగినవిగా వున్నాయి. కథ మీదకన్నా, కవిత్వంమీద మక్కువ ఎక్కువ. అందువల్ల కథారచయితగా కాస్తంత వెనకబడడం జరిగింది.

ఎక్స్‌రే పత్రిక ద్వారా చిన్న మనసు అనే మినీ కథ తన మొదటికథగా చెపుతారు. ఈ కథ నాటికగా కూడా ప్రసారంకావడం విశేషం. కథ విషయానికొస్తే.... అత్త మామలను అల్లుడు తన కోరికలతో పీడించడం ఆనవాయితీ. కానీ అందుకు భిన్నంగా కూతురు తన తల్లిదండ్రులను ఏవిధంగా బాధపెట్టింది ఈ కథలో మనకు కనిపిస్తుంది.

పిల్లల కథలలో అత్యంత ఆకర్షించే కథ ఎవరు ద్రోహి. ఈ కథ బాలమిత్రలో చోటు చేసుకుంది. ఈ కథలో ఒక దొంగ, ఒక కుక్క వలన ఎలా మోసపోయాడో అతిశయోక్తిగా చూపుతారు.

కథకు తగినశైలి, చెప్పే విధానంమీద తగిన పట్టు వున్నప్పటికి, కవిత్వం అంటేనే ఇష్టపడుతున్నారు. ఇప్పటి వరకు 15 కథలు, 80 కవితలు ప్రచురణ జరిగాయి. రెండు నాటికలు ఆకాశవాణి ద్వారా ప్రసారమయ్యాయి.

చిగురుకల హైకూ సంకలనాన్ని 2000 సం.లో ప్రచురించారు. ప్రస్తుతం ఆంగ్లంలో కూడా కవిత్వం వ్రాస్తున్నారు. దాదాపు 50 కవితలు పలు వెబ్‌సైట్స్‌లో చోటుచేసుకున్నాయి. 'పోయట్రీ డాట్ కామ్' వారి 'పోయట్రీ యిన్ మోషన్' కాంటెస్ట్‌లో అక్టోబర్ 2001సం.లో గెలుపొందారు. వారి సంకలనాలలో వీరి కవితలు చోటుచేసుకున్నాయి.

'షాడో పోయట్రీ డాట్ కామ్' ద్వారా ఆచార్య డా. ఎన్. గోపి గారి నానీ కవితా ప్రక్రియను ఆంగ్లంలో పరిచయం చేశారు. హైకూ కవిత తెలుగులో ఇస్మాయిల్‌గారు పరిచయం చేస్తే టంకాను (జపాన్ సాహితీ ప్రక్రియ) తెలుగులో మొదటగా పరిచయం చేసిన ఘనత బొల్లిముంత వెంకటరమణారావు గారు దక్కించుకున్నారు.

సాహిత్య ప్రక్రియలలో అతికష్టతరమైన బాల సాహిత్యంమీద పట్టువున్న బొల్లిముంత పిల్లలకోసం కథలు రాయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

ప్రముఖ సినీ రచయిత బొల్లిముంత శివరామకృష్ణ, ప్రముఖ కథ, నవలా రచయిత బొల్లిముంత నాగేశ్వరరావు వారసుడిగా సాహితీ రంగంలో దూసుకువస్తున్న బొల్లిముంత వెంకటరమణారావు కథకుడిగా సాహిత్యంలో తన ముద్రను అందించాలని ఆకాంక్ష.

రచయిత చిరునామా
బొల్లిముంత వెంకటరమణారావు
3-1-116, విద్యానగర్ కాలనీ,
చుంచుపల్లి, కొత్తగూడెం - 507 101.



# మల్లాది సూరిబాబు

ప్రముఖ కథకులు కీ.శే. మల్లాది రామకృష్ణశాస్త్రి గారి రెండవ కుమారుడే మల్లాది సూరిబాబు. **1929** జనవరి **24**న 'మచిలీపట్నం'లో జన్మించిన సూరిబాబు గార్కి సహజంగానే రచనావ్యాసంగం తండ్రినుంచి సంక్రమించింది.

1949 సం.లో సూరిబాబు తన మొదటి కథను అచ్చులో చూసుకున్నారు. అప్పటినుండి ఇప్పటివరకు, సుమారు వంద కథలు, అయిదు నవలలు, మూడు నాటకాలు, నూటపాతిక కవితలు, పాతిక ముప్పై సాధారణ వ్యాసాలు రాసారు. గత 25 సం॥గా మద్రాసు ఆకాశవాణిలో మల్లాది సూరిబాబు రచనలు ప్రసారమవుతూవస్తున్నాయి.

1966లో 'ఔటర్ సిగ్నల్' అనే కథకి ఆంధ్ర పత్రిక దీపావళి కథలపోటీలో మల్లాది సూరిబాబుకి బహుమతి లభించింది. అయితే అంతకు ముందే... అంటే 1960 సం.లో ఆంధ్ర పత్రికలో సూరిబాబుగారు రాసిన కథ దక్షిణ నాయకుడును ప్రముఖ సినీ నటులు గుమ్మడి వెంకటేశ్వరరావు గారు చదివి, స్పందించి అది రామకృష్ణ శాస్త్రి గారు రాసిందనుకుని ఆయనన్ను అభినందించారు. అప్పుడు మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు సూరిబాబుని పిలిచి "నీలా నువ్వు రాయాలి, మరొకరి శైలి అనుకరించవద్దు"! అంటూ హితవు చెప్పారు. ఆ తరువాత మల్లాది సూరుబాబు గారు తన కంటూ ఓ ప్రత్యేకశైలి ఏర్పరచుకొని అద్భుతమైన కథలు తెలుగుసాహితీ ప్రియులకు అందించారు.

మల్లాది సూరిబాబు గారు తన కథను ప్రచురించమంటూ పత్రికాఫీసుకు ఎప్పుడూ కథ పంపలేదు. పత్రికాధికారులు అడిగితేనే రాసి పత్రికలకు పంపేవారు. ప్రస్తుతం కూడా ఈ విధానం సూరిబాబు అనుసరించటం మన తెలుగు యువకథకులంతా గమనించాల్సిన విషయం.

మల్లాది సూరిబాబు గారు యిప్పటివరకు 'దక్షిణనాయకుడు', 'పదమూడు మెట్లు', 'కైవల్యపథం', 'శృంగారలహరి' కథా సంపుటులు ప్రచురించి తెలుగు పాఠకులకు అందించారు. 'లీలామనోహరం', 'జీవన సర్వస్వం', 'గమ్యస్థానం' నవలలు ప్రచురించబడ్డాయి. 'దారిఇటూ' వంటి నాటికలే కాకుండా 'హరివిల్లు' పేరిట వ్యాసాలు ప్రచురించి తన సాహిత్యాన్ని ముందుతరం వారికోసం భద్రపరిచి ఉంచారు. ఓ హెన్రీ, మొపాసా, సోమర్సెట్‌మామ్ కథలు తనను కదిలించినట్లు సూరిబాబు చెబుతుంటారు. తెలుగులో కంటే తమిళ, మలయాళ భాషల్లో ఇంకా మంచి కథలు వస్తున్నాయంటారు మల్లాది సూరిబాబు. ఈయన సారస్వత పోషకులు కూడా. సరస్వతీ కళాసమితి, త్యాగరాయ గానసభ, నవ్యసాహితి, స్పందన, కవిప్రభా, ఆంధ్ర సారస్వత సమితుల్లో జీవిత సభ్యులు.


రచయిత చిరునామా

**మల్లాది సూరిబాబు**

శ్రీవిద్యా నిలయం, 24/404, ఫోర్ట్‌రోడ్,

మచిలీపట్నం - 521001.





# మందడి కృష్ణారెడ్డి

"సమాజానికి ఉపయుక్తమైన వస్తువుల్నే ఎన్నుకుని కథలు రాయాలన్న తపనతో, వస్తు వైవిధ్యంతో, సాహిత్యాభిలాషతో, కథకు సామాజిక ప్రయోజనం వుందని ఆశించి కథా రచనకు శ్రీకారం చుట్టాను" అంటారు ప్రముఖ కథకులు మందడి కృష్ణారెడ్డి.

సుమారు వందకు పైగా కథలు రాసిన కృష్ణారెడ్డిగారు, నల్గొండ జిల్లా 'తమ్మాజీగూడెం' లో 1956 డిసెంబరు 12వ తేదీన జన్మించారు. జూన్ 2001లో 10 కథలు 'మందడి కథలు' అనే కథా సంపుటి ప్రచురించి సాహితీ ప్రియులకందించారు. ఈ కథా సంపుటి ప్రముఖ కథకుల్ని, కథాప్రియుల్ని విశేషంగా ఆకట్టుకుంది. ఈ సంపుటిలోని కథలన్నీ 1972-80 మధ్య వివిధ ప్రముఖ పత్రికల్లో ప్రచురించబడ్డాయి. ప్రతి కథలోనూ వస్తువైవిధ్యం తప్పక కనిపిస్తుంది. ఊహించని ఉత్తరం, సైక్రియాట్రిస్టు, సైకాలజీ కథలు అద్భుతమైన కథలుగా చెప్పుకోవచ్చు. అయిదేళ్ళ తర్వాత కథలో చమత్కారముంటుంది. నిజానికి ఈ కథలన్నీ మందడి తన పదునైన నేత్రాలతో పరిశీలించి, స్పందించి రాసినవి. కొన్ని కథలు ఇతరులు తమ అనుభవాలు చెప్పగా ఆ వస్తువులో వినూత్నత వుందని గ్రహించి దానికి కల్పన జోడించి తనదైన శైలిలో అందించినవి. మందడి కథల్లో శైలి, శిల్పం కూడా ప్రముఖ కథకులకు తీసిపోదు.

'ఊహించని ఉత్తరం' కథలో దావూద్ భార్య ఫాతిమా సౌదీ వెళ్ళి డబ్బు సంపాదించమని పోరుపెడుతుంది. ప్రేమ, ఆప్యాయతలకన్నా డబ్బే గొప్పదని నమ్ముతుంది. ఇష్టంలేకున్నా కన్నతల్లిని, భార్యను వదిలేసి సౌదీ వెళ్ళి అక్కడ కష్టపడి డబ్బు సంపాదించి మొదట డబ్బు ఇండియాకు పంపినా చిన్నగా అక్కడి సుఖాలకు అలవాటుపడి తన యజమాని భార్యనే పెండ్లి చేసుకొని కోటీశ్వరుడవుతాడు. చివరికి తను కోల్పోయిందేమిటో తెల్సుకొని విచారిస్తుంది ఫాతిమా. చక్కని శైలి శిల్పమున్న కథ.

మందడి కృష్ణారెడ్డి, ఎం.ఎ., ఎం.ఒ.ఎల్., డిప్లొమా ఇన్ థియేటర్ ఆర్ట్స్ చేసారు. ఆ తర్వాత ఓ దశాబ్దం పాటు కె.జి. నుండి పి.జి. దాకా అధ్యాపకుడిగా పనిచేశారు. అనుకోకుండా వ్యాపారవేత్తగా మారిపోయారు.

కన్స్యూమర్ అవేర్‌నెస్ అండ్ రీసెర్చ్ సొసైటి (CARS Trust) నిర్వాహకులుగా, దక్షిణ భారతదేశంలో కెల్ల అతిపెద్ద కన్స్యూమర్ అసోసియేషన్‌గా సంస్థ అభివృద్ధికి అవిరళ కృషి చేశారు. నవంబరు 2002 సం.లో సౌత్ ఆఫ్రికా డర్బన్ ఐసిసి లో జరగిన అంతర్జాతీయ వినియోగదారుల 16వ ప్రపంచ సదస్సుకు ఆంధ్రప్రదేశ్ తరపున ఆహ్వానం అందుకున్న ఏకైక వ్యక్తి మందడి కృష్ణారెడ్డి.

కళలు, సాంస్కృతిక రంగాలకు, సంఘాలకు ఇతోధికంగా విరాళాలిచ్చి, ఎందరో రచయితలకు పుస్తకాల ప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన మందడి వితరణశీలి, కళాపోషకులు. ప్రస్తుతం మందడి 'క్యాప్కో' ఛైర్మెన్‌గా వ్యవహరిస్తున్నారు. ఇటీవలె మందడి తన కలం నుండి వెలువడిన కవితలను మందడి కవితలుగా సంపుటి వేసి సాహితీ ప్రియులకందించారు.

రచయిత చిరునామా
**మందడి కృష్ణారెడ్డి**
153, బి.ఎన్. రెడ్డి నగర్,
వనస్థలిపురం, హైదరాబాదు - 74.

# మన్నె సత్యనారాయణ



పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాలోని 'తిరుపతిపురం' లో జన్మించిన కథకుడు మన్నె సత్యనారాయణ. గత నాలిక సంవత్సరాలుగా తణుకులోనే స్థిరపడ్డారు. సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోనూ ప్రవేశమున్న మన్నె సత్యనారాయణ గారికి ఇష్టమైన ప్రక్రియమాత్రం 'కథానిక'.

తెలుగులో ఉన్న అన్ని ప్రముఖ దిన, వార, మాస, పక్ష పత్రికల్లోనూ మన్నె సత్యనారాయణ కథలు ప్రచురించబడ్డాయి. 'ఇండియాటుడే' పత్రిక సంపాదకులు వీరికి ప్రత్యేకంగా లేఖలు పంపి కథలు రాయించుకున్నారు.

గురజాడ అప్పారావుగారు రచించిన ప్రసిద్ధమైన 'కన్యాశుల్కము' లోని పాత్రల మేలిమైజాన్ని అనుసరించి, మన్నె సత్యనారాయణ గారు వినూత్నంగా తరువాతి కథను నడిపారు. ఇది సాహిత్య చరిత్రలోనే ఓ సరికొత్త పేజీని సొంతం చేసుకుంది. 'కన్యాశుల్కము' లోని పాత్రలు తరువాత తమజీవితాల్లో ఎలా స్థిరపడి వుంటారనేది ఆలోచించి అదే కథా సంవిధానంలో "కన్యాశుల్కము-తరువాయి భాగము" అనే పుస్తకాన్ని రచించి సంచలనం సృష్టించారు. ఈ పుస్తకం నేటి తెలుగు సాహిత్య రంగంలోని ముఖ్యులందరి అభినందనలు అందుకుంది.

విద్యాభ్యాసం పూర్తయిన తరువాత, ఒక స్వాతంత్ర్య సమర యోధునితో కలిసి 'కర్మసాక్షి' అనే రాజకీయ వార పత్రికను నడిపారు. 'కర్మసాక్షి' పత్రికకు ఎడిటర్‌గా వున్నారు. హాస్యంలో లోకరీతిని మేళవించి 'ఆనందరావు అంగారక యాత్ర' అనే చిన్న నవల రాసారు. ఈ నవల 'ఆంధ్రభూమి' మాస పత్రికలో ప్రచురించబడి తెలుగు సాహితీ ప్రియుల మన్ననలందుకుంది.

ఇండియాటుడే, ఆంధ్ర భూమి, జాగృతి, ఆంధ్రజ్యోతి మొదలగు వారపత్రికల్లో వీరి కథలు విరివిగా ప్రచురించబడుతున్నాయి. 'వార్త' దిన పత్రికలో, సమకాలీన రాజకీయ, సామాజిక విషయాలపై సెటైర్‌తో ఎడిటోరియల్ పేజీలో కొంతకాలం 'కాలమ్' రాసారు. ఇది 'వార్త'లో ప్రతివారం వచ్చేది.

తెలుగు అకాడమీవారి 'తెలుగు' తెలుగు విశ్వవిద్యాలయం వారి 'వాఙ్మయి' మొదలగు సాహిత్య పత్రికల్లో కొన్ని సాహిత్య విమర్శా వ్యాసాలు రాసారు.

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలివారు నవల. సాహిత్య విమర్శపై నిర్వహించిన అధ్యయన శిబిరాల్లో ఎంతో ఉత్సాహంగా పాల్గొని ప్రముఖ రచయిత గోవిందరాజు రామకృష్ణారావు, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డా. సి. నారాయణరెడ్డి గార్ల ప్రత్యేక ప్రశంసలు అందుకున్నారు.

మన్నె సత్యనారాయణ గారి దృష్టంతా సాహిత్యంలో ఓ వినూత్న కోణం సృష్టించి, తనకంటూ ఓ ప్రత్యేక స్థానం సంపాదించాలన్నది వారి నవల 'కన్యాశుల్కము-తరువాయి భాగము' చదివితే తెల్సిపోతుంది.

రచయిత చిరునామా
మన్నె సత్యనారాయణ
2,14/2, సజ్జాపురం,
తణుకు - 534211
ప. గో. జిల్లా.



# మంతెన సూర్యనారాయణ రాజు

తూర్పు గోదావరి జిల్లా అమలాపురానికి చెందిన ప్రముఖ కథకుడు మంతెన సూర్యనారాయణ రాజు గారు వృత్తిరీత్యా తెలుగు ఉపన్యాసకులు. **1967** సం.లో వీరి తొలి సాహిత్య వ్యాసం 'మరుగున పడిన జానపద సాహిత్యం' ఆంధ్రజ్యోతిలో ప్రచురించబడింది.

వీరి తొలి కథ విశ్వరచనలో .లోగుట్టు. ప్రచురించబడింది. అదే కథ తమిళ భాషలోకి పి.ఎ.దురైరాజా అనువాదం చేయగా .తామరై. అనే మాసపత్రికలో ప్రచురించబడింది. ప్రసిద్ధ హాస్య రచయిత శ్రీ ముని మాణిక్యం నరసింహారావుగారి ప్రియశిష్యులైన మంతెన సూర్యనారాయణరాజు గారు 1981లో 'అమెనవ్వింది' కథా సంపుటి ప్రచురించారు. ఆ తరువాత1999 ఆగష్టులో 'జీడికి బంటివరోయ్' అనే రెండో కథా సంపుటి ప్రచురించారు ఈ రెండు కథా సంపుటాలు ప్రముఖ కథా రచయితల, తెలుగుసాహితీ ప్రియుల మన్ననలు అందుకున్నాయి. ఆ ప్రోత్సాహంతో 'గజా రోహణం' అనే కథా సంపుటి త్వరలో తెలుగు లోకానికి అందిచబోతున్నారు మన 'మంతెన' గారు.

ఇప్పటి వరకు సుమారు 137 కథలు అన్ని వార, మాస, దిన పత్రికల్లోనూ వీరివి ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. "వీరి కథల్లో సహజ చిత్రణ ఉంటుందని, చక్కని శిల్పం ఉంటుందని, సమయోచిత సంభాషణలు చోటు చేసుకుంటాయి" అని ప్రముఖ కథకులు 'వీరాజీ' అంటారు. మంతెన గారి కథలు కేతువిశ్వనాథ రెడ్డి, పతంజలి, రావూరి భరద్వాజ, మధురాంతకం, కా.రా మాష్టారు వంటి ప్రముఖులచే గుర్తించబడటం మరపురాని విశేషాలంటారు. తన కథల్లోని వైవిధ్యాంశాలను గుర్తించి ప్రోత్సహించిన ప్రముఖులని గర్వంగా చెప్పుకుంటారు 'మంతెన'.

'మంతెన' గారి కథల గురువు శరత్ చంద్ర చటర్జీ "తనమీద ఎవరి ప్రభావం లేదని, ఒక వేళ వున్నా ఆ బెంగాలీ బాబే... అయ్యుంటాడు" అని చెప్పుకున్నారు మంతెన. అయితే వీరికి ప్రముఖ కథకురాలు రంగనాయకమ్మ గారంటే యనలేని అభిమానం. బహుశా ఉంటే రంగనాయకమ్మ గారి ప్రభావం, ఆవిడ శైలి నా కథల్లో కనిపిస్తుండవచ్చు అన్నారు.

రేడియో మాధ్యమం ద్వారా ఎన్నో కథలు, వ్యాసాలు వీరివి ప్రసారమయ్యాయి. వీరి నాటికల్లో 'తాళి ఎగతాళి చేస్తే' కు కర్షక పరిషత్తు శ్రీకాకుళం వారి ప్రథమ బహుమతి, 'సంచలనం' నాటికకు బి.హెచ్.ఇ.యల్ పరిషత్తు వారి నగదుబహుమతి లభించాయి.

అమలాపురంలో తెలుగు ఉపన్యాసకులుగా పనిచేస్తున్న మంతెన గారికి 'సారస్వత విశారద' అనే బిరుదు ప్రదానం జరిగింది. మరి, వీరి మూడో కథా సంపుటి 'గజారోహణం' కోసం మనమంతా ఎదురుచూద్దాం.

రచయిత చిరునామా
డా. మంతెన సూర్య నారాయణరాజు
కవి, రచయిత మరియు నాటక కర్త,
అమలాపురం, తూ.గో జిల్లా - 533201.





# మండవ సుబ్బారావు

**1972-85** వరకు 'సవ్యసాచి' కలం పేరుతోనూ, ప్రస్తుతం 'ఎమ్మెస్సార్' కలం పేరుతోనూ చక్కని కథలందించిన మండవ సుబ్బారావు గారు **1952** మే **23**న గుంటూరు జిల్లా 'రేపల్లె'లో జన్మించారు.

1975 నుండి 85 వరకు సుమారు పాతిక కథలు రాసారు. స్వాతి, సౌజన్య, ఆంధ్రపత్రికలలో వీరి కథలు ఎక్కువగా ప్రచురించబడ్డాయి. 'ఎమ్మెస్సార్' కథలు అనే కథా సంపుటిని శ్రీ లేఖ వరంగల్ వారు 12 కథలతో పుస్తకం వేసారు. ఈ కథాసంపుటిలో 'నగ్జలైట్', 'తీర్పు' అనే కథలు 1975లో వీరికి మంచి గుర్తింపు తీసుకొచ్చాయి. వీరి కథల్లో వాస్తవికత ఎక్కువగా వుంటుంది.

వృత్తిరీత్యా ప్రస్తుతం ఖమ్మం జిల్లా కొత్తగూడెంలోని వివేకవర్ధిని జూనియర్ కళాశాల ప్రిన్సిపల్‌గా మరియు కరస్పాండెంట్‌గా వ్యవహరిస్తున్న సుబ్బారావుగారు మంచి విమర్శకుడు కూడా.

ఆకాశవాణి కొత్తగూడెం నుండి సుబ్బారావుగారి కథానికలు అనేకం ప్రసారమయ్యాయి. కథకులుగా వుంటూ సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లోనూ ప్రవేశించిన వీరు 'మాతృమందిరం' అనే నవల రాసారు. ఈ నవల ఎందరో ప్రముఖ విమర్శకుల మన్ననలందుకుంది. ఉదయం, జనధర్మ, ప్రజాశక్తి, ఆంధ్రభూమి, విజేత, మా సంఘమిత్ర వంటి అనేక పత్రికల్లో వీరి 'సమీక్షలు' ప్రచురించబడ్డాయి. ఇటీవల వీరి ఇంగ్లీషు కవిత 'నేచర్' అంతర్జాతీయ స్థాయిలో ప్రచురించబడే కవితా సంకలనంలో చోటు చేసుకుంది.

తెలుగులో యం.ఎ, యం.ఫిల్. చేసిన సుబ్బారావుగారు ఆరుద్రగారి 'త్వమేవాహమ్'పై పరిశోధన చేసారు. వీరికథ తెలుగుదనం, సహజత్వం ఉట్టిపడుతూ మన కళ్ళముందు కదలాడేలా వుంటాయి. ప్రస్తుతం కొత్తగూడెంలో సాహితీసభలు నిర్వహిస్తూ తోటికథకుల్ని, యువ కథకుల్ని ప్రోత్సహిస్తున్న మండవ సుబ్బారావుగారు విరివిగా కథలు ఇంకా అందించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

మండవ సుబ్బారావు గారు ఇటీవలి కాలంలో కథలు ఎక్కువగా రాస్తున్నట్లు కనిపించటం లేదు. వీరి దృష్టి అంతా సాహితీ విమర్శపై ఎక్కువగా కేంద్రీకృతమై వుంది. నేడు అనేక పత్రికల్లో బుక్ రివ్యూలు అందిస్తున్నారు. అలాగే ఖమ్మం జిల్లా కొత్తగూడెం డివిజన్ సాహితీ స్రవంతి అధ్యక్షులైన శ్రీ బొల్లిముంత వెంకట రమణారావు గారితో అభిప్రాయాలు పంచుకుంటూ అనేక సాహితీ సభల్లో పాల్గొంటున్నారు. సాహితీ స్రవంతి ప్రచురించిన ఖమ్మం జిల్లా కవితా సంకలనం 'ఒక వేకువ కోసం'లో హైకూలు అందించారు. త్వరలో అదే సంస్థ తీసుకురానున్న కథా సంకలనంలో ఓ మంచి కథను అందించటానికి, తాను గతంలో రాసిన కథలన్నీ కలిపి ఓ సంపుటి తీసుకురావటానికి ప్రయత్నం చేస్తున్నారు. వీరు అనేక మంది యువ, నవ రచయితలకు ప్రోత్సాహం అందించారు.

రచయిత చిరునామా
**మండవ సుబ్బారావు**
వివేకవర్ధని జూనియర్ కళాశాల,
లక్ష్మీదేవిపల్లి, కొత్తగూడెం, ఖమ్మం జిల్లా.

# మల్లిరెడ్డి చంద్రశేఖర రెడ్డి



"అనంత సాహితీ వనాన్ని చుట్టుముట్టాలని దురాశపడే ఓ పిల్ల వాయువుని" అంటారు విశాఖ జిల్లాకు చెందిన యువకథకుడు మల్లిరెడ్డి చంద్రశేఖరరెడ్డి.

1985లో కథారచనకు శ్రీకారం చుట్టిన 'మల్లిరెడ్డి' ఇప్పటి వరకు 3 కథా సంపుటాలు ప్రచురించారు. 1996లో వీరి మొదటి కథా సంపుటి 'దేవుడి చెట్టు' ప్రచురించబడింది. 1997లో వీరి రెండవ కథా సంపుటి 'కార్మార్థి' అప్పటి విశాఖ జిల్లా కలెక్టర్ శ్రీ యం.జి.గోపాల్ గారి చేతుల మీదుగా ఆవిష్కరణ పొందింది. 1999లో మూడవ కథా సంపుటి 'వెన్నెల' ప్రచురించి సాహితీ ప్రియులకు కానుకగా అందించారు. ఈ 'వెన్నెల' కథా సంపుటికి గాను హైదరాబాద్ రవీంద్ర భారతిలో డా సి.నా.రె చేతుల మీదుగా 'యువశక్తి' అవార్డు అందుకున్నారు.

'ఆంధ్రభూమి' దినపత్రికలో 'నేటికథ' శీర్షికలో మల్లిరెడ్డి చంద్రశేఖర రెడ్డి కథలు సుమారు 30 వరకు ప్రచురించబడ్డాయి. ఇప్పటివరకు ఆకాశవాణి లో వీరివి సుమారు 25కు పైగా కథానికలు ప్రసారమయ్యాయి.

"మల్లిరెడ్డి కథలు ఎక్కడో ఆకాశం నుండి దిగివచ్చిన పాత్రలలో గాక మన ఇంట్లో, మన ప్రక్క ఇంట్లోని పాత్రల లానే ఉంటాయి" అంటారు ప్రముఖ కథకులు శ్రీ రావూరి భరద్వాజ. నిజానికి వీరి కథలు చదివితే ప్రతి పాఠకుడు ఇదే అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తారనటం అతిశయోక్తి కాదు.

మల్లిరెడ్డి కలంనుండి జాలువారిన భయం, పునర్జన్మ, కార్మార్థి, వెన్నెల, తల్లిమనసు కథలు పాఠకుడి పీలక పట్టుకొని చదివిస్తాయి. కథావస్తువుని ఎన్నుకోవడం లోనూ, శైలిలోను వీరి ప్రత్యేకత వీరి కథలు చదివితే యిట్టే తెల్సిపోతుంది. 'స్మశాన వాతావరణంలో మనిషి ఎందుకు భయపడుతాడో, అక్కడి వాతావరణం కళ్ళకు కట్టినట్లు 'భయం' కథ'లో చిత్రిస్తారు. అద్భుతమైన కథ ఇది.

కథారచనతోపాటు, నవల, కవితా, నాటక ప్రక్రియల్లో కూడా ప్రవేశమున్న మల్లిరెడ్డి చంద్రశేఖర రెడ్డి ఆ ప్రక్రియల్లోకూడా మంచిపేరు సంపాదించారు. 1992లో 'ఆంధ్రభూమి' దినపత్రికలో వీరి నవల 'మృత్యుశ్వాస' సీరియల్‌గా వచ్చింది. 'మృత్యుశ్వాస' ఓ పరిశోధాత్మక నవల. దీని కోసం వీరు 'ఒరిస్సా' కూడా వెళ్ళి వచ్చారు. 1998లో 'ధాత్రి' కవితా సంపుటి ప్రచురించారు. అలాగే నాటక రచనలో కూడా ముందున్న 'మల్లిరెడ్డి' ఆకాశవాణి కోసం ప్రత్యేకంగా 15కు పైగా నాటికలు రచించగా, అవన్నీ విశాఖ కేంద్రం నుండి ప్రసారమయ్యాయి.

వృత్తిరీత్యా 'ఆర్టీసీ' లో ఓ చిరుద్యోగిగా వుంటూ, మరోవైపు సాహితీ సేవలందిస్తున్న 'మల్లిరెడ్డి' ఇంటినిండా సాహితీ సంస్థలందజేసిన అవార్డులు, జ్ఞాపికలే దర్శనమిస్తాయి.


రచయిత చిరునామా

**మల్లిరెడ్డి చంద్రశేఖర రెడ్డి**

55-12-8, ఎమ్.ఎమ్.టి.సి. కాలనీ,
సీతమ్మధార, విశాఖపట్నం - 530022.



# మల్ల లక్ష్మీ ధర్మరాజు

"నేనీరోజు రచయితగా నలుగురిలో గుర్తించబడ్డానంటే దానికి కారణం 'బాలమిత్ర' వారే!" అంటూ పలుసందర్భాల్లో గర్వంగా చెప్పుకుంటారు 'ఏలూరు'కు చెందిన కథకుడు మల్ల లక్ష్మీ ధర్మరాజు.

ఏలూరులో స్థిరనివాసం ఏర్పరుచుకున్న మల్ల లక్ష్మీ ధర్మరాజు జన్మ స్థలం మాత్రం ఏలూరుకు దగ్గరలో ఉన్న 'లక్ష్మీ నారాయణ పురం' అయితే, 'కన్నతల్లిని... ఉన్న ఊరిని మరిచిపోకూడదన్న' సత్యాన్ని గ్రహించిన లక్ష్మీ ధర్మరాజు తన జన్మ భూమిపై ప్రేమతో తనకథల్లో తన పేరు ప్రక్కన వూరి పేరు 'లక్ష్మీనారాయణ పురం' అనే రాసుకుంటారు.

సాహిత్యంలో అన్ని ప్రక్రియలతో సంబంధం ఏర్పర్చుకున్న ధర్మరాజుకు యిష్టమైన ప్రక్రియమాత్రం కథానిక. కేవలం ఒక్క 'బాలమిత్ర' పిల్లల మాసపత్రికలోనే సుమారు 200 కు పైగా కథలు ధర్మరాజువి ప్రచురించబడ్డాయి. బొమ్మరిల్లు, బుజ్జాయి, చందమామ వంటి యితర పత్రికల్లో కూడా అప్పుడప్పుడూ మనం ధర్మరాజు కథలు గమనించవచ్చు.

బాలసాహిత్యంలో విశేషకృషి చేసిన మల్ల లక్ష్మీ ధర్మరాజు గారు చిన్న పిల్లల కోసం బాలలనవలలు, పాటలు అనేకం రాసారు. బాలల పత్రికల్లోనే మరికొన్ని 'గొలుసు నవలలు' వీరివి ప్రచురించబడ్డాయి. 'రామప్పరాజనీతి', 'వినూత్న-శ్వేత' గొలుసు నవలలు ధర్మరాజుకు మంచి పేరు తీసుకొచ్చాయి.

బాలసాహిత్యంతోపాటు పెద్ద పత్రికలకు సాంఘీక కథలు కూడా అనేకం అందించారు ధర్మరాజు. ముఖ్యంగా 'స్వాతి' వార పత్రికలో 'ఆఫీసుకి ఆఫీసరైనా...', 'అమెరికా ప్రేమికుడు', 'గోడమీదబల్లి', 'వెలుగు రేఖలు', కథలు వరుసగా ప్రచురించబడ్డాయి. అలాగే ఆంధ్ర భూమి, ఆంధ్రప్రభ, జ్యోతి, విపుల వంటి పత్రికల్లో వీరి కథలు ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

ఏ కథలోనైనా ఖచ్చితంగా 'కొసమెరుపు' అవసరం అని విశ్వసించే ధర్మరాజుగారి కథల్లో 'కొసమెరుపు' మనకు స్పష్టంగా కనిపిస్తుంది. అలాగే పాఠకుల ఊహకు అందకుండా కథనడపడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. 1996లో జెమిని టి.వీ.లో వీరి కథలు 'పోకిరీ గోల-ఇస్త్రీలీల', 'మావారూ కథలు రాస్తారు', 'గమ్యం చేరిన బాటసారి', 'మూడోకన్ను' లను నాటికలుగా ప్రసారం చేసారు. టి.వీ.కి సీరియల్స్ రాయటంలోనూ, నాటికలు అందించటంలోనూ ప్రస్తుతం తమ సమయాన్ని కేటాయిస్తున్న వీరు బాలసాహిత్యానికి దూరమవుతున్నారన్నది అక్షర సత్యం. సాహిత్య ప్రక్రియల్లో అతి కష్టమైన 'బాలసాహిత్యం' ఏ కొద్ది మంది రచయితలే రాయగలరు. ఆ 'టెక్నిక్' తెల్సిన మల్ల లక్ష్మీ ధర్మరాజు బాలల కోసం మరిన్ని మంచి కథలు అందచాల్సిన అవసరం ఎంతైనా ఉందని గుర్తించాలి.


రచయిత చిరునామా

**మల్ల లక్ష్మీ ధర్మరాజు**

డో. నెం. 24బి-16-20,

ఫతేబాద్, ఏలూరు - 534002.



# మాచిరాజు కామేశ్వరరావు

"నేను కథలు రాయటానికి ప్రేరణ మా తండ్రిగారు ప్రముఖ కథా రచయిత కీ.శే. మాచిరాజు సీతారామయ్య గారే! అంటూ కామేశ్వరరావుగారు పలుసందర్భాల్లో చెప్పుకున్నారు.

బాల సాహిత్యంలో చేయితిరిగిన రచయితగా గుర్తించబడ్డ మాచిరాజు కామేశ్వరరావుగారు 21.5.1955న తూ.గో. జిల్లా 'ప్రత్తిపాడు'లో జన్మించారు. అయితే పెరిగిందంతా తెలంగాణా జిల్లాల్లోనే! మాచిరాజుగారి చదువు నెల్లూరు జిల్లాలోని వి. ఆర్. కళాశాలలో జరిగింది.

మాచిరాజుగారు చాలా చిన్న వయసునుండే కథలు రాయటం ప్రారంభించారు. ఆయన 14వ ఏట అంటే 1969సెప్టెంబరు 'చందమామ' లో 'గుడ్డివాడి డబ్బు' కథతో ఆయన కథారచన ప్రారంభమయింది. ఆ తరువాత 1971 నుండి కథలు రాయటం ఒక యజ్ఞంలా మొదలు పెట్టారు. ఆయన కేవలం 'చందమామ' లోనే సుమారు 230 కథలకు పైగా రాసారు. ఆయన దృష్టిలో బాలసాహిత్యం, సాహిత్య ప్రక్రియలన్నింటిలోకి కష్టము. ఇది నూటికి నూరుపాళ్ళు సత్యం! చిన్న పిల్లలకు కథలు రాయటం, చెప్పటం చాలా కష్టం. కాని మాచిరాజుగారికది వెన్నతో పెట్టిన విద్య.

వీరి పెద్దకథలు ప్రముఖ, వార, మాస పత్రికల్లో సుమారు 130 వరకు ప్రచురితమయ్యాయి. 'ఆంధ్ర భూమి'లో వారి 'పిచ్చితల్లి' కథకు 1993లో ద్వితీయ బహుమతి వచ్చింది. బాలల అకాడమీ నిర్వహించిన పిల్లల నవలలపోటీలో 'అడుగుకో ఆపద' నవలకి ప్రథమ బహుమతి వచ్చింది. "నాకు బాలసాహిత్యంలో ప్రత్యేక గుర్తింపు తెచ్చిన 'చందమామ' కు ఆజన్మాంతం ఋణపడివుంటాను" అంటారు కృతజ్ఞత తెలుపుకుంటూ కామేశ్వరరావుగారు. వీరు 20 కథలను ఒక సంపుటిగా పాఠకులకు 'చందమామ కథలు' పేరుతో అందించారు.

మాచిరాజుగారి 'విధినిర్వహణ' కథను మహారాష్ట్ర గవర్నమెంట్ వారు, ఆరో తరగతి తెలుగువాచకంలో పాఠంగా ఎన్నికచేయటం విశేషం!

వృత్తిరీత్యా కెనరాబ్యాంక్‌లో మేనేజర్ హోదాలో ఉన్నా, ప్రవృత్తిరీత్యా కథా రచనను ఇంకా కొనసాగిస్తూ, సాహితీ సభలకు హాజరవుతూ తమవంతు సాహిత్యసేవ చేస్తున్నారు మాచిరాజుగారు.

"మా బ్యాంక్ సహచరులు నన్ను ఎంతో ప్రోత్సహిస్తారు. ప్రస్తుతం ఇన్స్‌పెక్టర్‌గా అనేక ఊళ్ళు తిరిగే అవకాశం-నాలోని రచయితకి మరింత ఊతంగా భావిస్తున్నాను" అనే మాచిరాజుగారికి స్పందించే హృదయం, పరిశీలనా శక్తి దేవుడిచ్చిన వరాలు.

రచయిత చిరునామా:
**మాచిరాజు కామేశ్వరరావు**
మేనేజర్,
కెనరాబ్యాంక్
గుంటూరు - 522266.

# డా. మిరియాల రామకృష్ణ



నేడు మన కున్న ప్రముఖ కథకులును, పాపులర్ రచయితలనెందరినో తన సలహాలద్వారా, తన ఒరవడిలో కథకులుగా మలచి, తెలుగు సాహితీలోకానికి అందించిన ప్రముఖ కథకుడు డా. మిరియాల రామకృష్ణ.

కాకినాడకు చెందిన మిరియాల రామకృష్ణ గారు యిప్పటివరకు రాసిన కథలు కేవలం 20 మాత్రమే. అయితే నేం... ప్రతి కథా ఒక ఆణిముత్యమే. రామకృష్ణ గారి కథలు ఎక్కువగా 'స్వాతి' వారపత్రికలోను, 'ఉదయం' వీక్లీలోనూ ప్రచురించబడ్డాయి. అయితే వాటినింకా పుస్తకరూపంలో తీసుకురాకపోవటం నిజంగా తెలుగు పాఠకులకు లోటే!

36 సంవత్సరాలు విద్యాశాఖలో పనిచేయుట వల్లనూ, ముఖ్యంగా తెలుగు భాషా సాహిత్యాలు భోధిస్తూ ఉండటంవల్లనూ, కాకినాడ, తణుకు, రాజోలు, రాజమండ్రి, కళాశాలల 'మేగజన్లు' ఎడిట్‌చేసే పూచీ వీరి మీద పడటం 1966-69 మధ్య కాలం 'పి. ఆర్.' కళాశాలలో విద్యార్థులు తమకథలును మేగజైన్ కోసం యివ్వగా, వాటిని ఎడిట్‌చేసి, శీర్షిక మార్చి, శైలి మార్చి, స్వరూప సంవిధానాలకు మెరుగులు దిద్ది, పత్రికల్లో అచ్చువేయటం జరిగింది. ఆ విద్యార్థుల్లో ఓ కథకుడు, నేటి పాపులర్ రచయిత 'యండమూరి వీరేంద్రనాథ్' కావటం, అతని మొదటి కథ వీరి ద్వారా వెలుగులోకి రావటం విశేషం. అలాగే ప్రముఖ కథా, నవలారచయిత 'పైడిపాల' కూడా ఆ బ్యాచ్‌లోనే ఉన్నారు. నిజానికి ఎందరో ప్రముఖ కథా రచయితలు వీరి విద్యార్థులే అనటంలో అతిశయోక్తి లేదు.

డా. మిరియాల రామకృష్ణ గారు రాసిన కథల్లో తప్పక చదవవలసినవిగా 'ఆకుపచ్చని కుక్కపిల్ల', 'ఆశ్చర్యచూడామణి', 'చెరసాలలో సరస్వతి', 'ఉంగరంలాంటిది' చెప్పుకోవాలి. వీరు కథకు టైటిల్ కూడా ఎంతో వినూత్నంగా పెట్టడం గమనించవచ్చు. వీరి కథలకు టైటిల్ ఎంత వినూత్నంగా ఉంటుందో, కథలో కథనం కూడా అంతకన్నా వినూత్నంగా నడిపిస్తారు. 'చెరసాల' కథలో పూర్వ విద్యార్థుల్ని పాఠశాలకే అనుమతించని కుర్ర హెడ్మాస్టర్ ఇక మీటింగ్ పెట్టుకొనిస్తాడా? అలాంటి సందర్భంలో 'పాఠశాల చదువుల తల్లికి చెరసాల' లాగుంది అనే భావన కలుగుతుంది. పూర్వ విద్యార్థులలో డాంబికాలకు పోయేవారిని ఈసడిస్తూ సరదాగా సాగిన కథ.

1995-96 సం.లో 'గీతాంజలి' పత్రికకు సంపాదకులుగా పనిచేసి ఎందరో కథకులతో పరిచయాలు సంపాదించుకున్నారు. "ఆ పత్రికకు వచ్చిన అనేక కథానికలను పరిష్కరించి వెలుగులోకి తీసుకురావటం నేను మరువలేనిది" అంటారు రామకృష్ణ గారు.

కథల మంచిని గుర్తించి, రచయితలను ప్రోత్సహించటానికి 'హిమబిందు అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ లిటరేచర్' సంస్థ స్థాపించి కథకులకు అవార్డులిస్తున్నారు.

రచయిత చిరునామా
డా. మిరియాల రామకృష్ణ
ప్లాట్ నెం. 113, వెన్నెల,
పోస్టల్ కాలని, కాకినాడ - 533003.



# మునిపల్లె రాజు

"కథారచనకు సూత్రాలుండవు పాతరచయితల కథలు బాగా చదవాలి, పరిశీలించాలి" అంటారు మిలిటరీలో చాలాకాలం పనిచేసిన ప్రముఖ కథారచయిత మునిపల్లె రాజు.

మిలిటరీలో చేరి ఉద్యోగరీత్యా దేశమంతా తిరిగి భిన్న సంస్కృతి, వాతావరణాల్లో ఇమిడిపోయి, మనుష్యులకు రకరకాల ప్రవృత్తులను అర్థం చేసుకొని, వాటిని మస్తిష్కం అనే ఖజానాలో పదిలంగా దాచుకొని తనకలం ద్వారా ఎన్నో కథానికలను తెలుగు ప్రజలకు అందించారు మునిపల్లె.

"వాస్తవ సంఘటనలకు కల్పన జోడిస్తే శిల్పం వస్తుంది. కల్పన+వాస్తవం=శిల్పం" అంటారు మునిపల్లె.

'కథానిర్మాణంలో ఇతివృత్తమే కాకుండా కథా శిల్పంలో ఒకలయ వుండాలి. ఆ లయే పఠితను చదివిస్తుంది' అని విశ్వసించే మునిపల్లె రాజుగారి కథల్లో కథన శిల్పం, లయల్లోకూడా వైవిధ్యం కనిపిస్తుంది.

1925 మార్చి, 16న గుంటూరులో జన్మించిన మునిపల్లె సినిమాలకు కూడా కథలందించారు. 'పూజారి' అనే కథను 'పూజాఫలం' పేరుతో తెరకెక్కించారు. వీరి కథల్లో ముఖ్యమైనవిగా 'విశాఖ కనక మహాలక్ష్మి', 'భోగం మనిషి', 'కస్తూరి తాంబూలం', 'చెప్పుల దానం', 'జట్టి', 'లక్ష్మీ ఉపాసకుడు' చెప్పుకోవచ్చు.

మునిపల్లె కలంనుండి జాలువారిన కథా సంపుటి 'మునిపల్లె రాజు కథలు' పాఠకుల మన్ననలు అందుకున్నాయి. ఇంకా 'పుష్పాలు - ప్రేమికులు - పశువులు', 'దివోస్వప్నాలుతో ముఖాముఖి' అనే కవ్యాస గ్రంథమాలలు, వేరొక ఆకాశం-వేరెన్నో నక్షత్రాలు' అనే కవితా సంపుటి తెలుగు, ఆంగ్ల భాషల్లో పాఠకులకు అందించారు. రాష్ట్ర సాహిత్య అకాడమీ పొట్టి శ్రీరాములు అవార్డు వీరి ఉత్తమ కథా సంపుటికి గాను అందించారు. తల్లి ఒడిలో అబ్బిన సంస్కారం, శిష్యరికము, పుస్తకపఠనమూ, మాధవపెద్ది, స్థానం, చలం లాంటి ప్రముఖుల ప్రభావం వీరిని ఉత్తమ కథకుడిగా తీర్చిదిద్దింది. 'వారాలపిల్లాడు' కథలో బాగా బతికిన కుటుంబ పెద్ద ఆర్థికంగా చితికిపోయి చనిపోతే, కొడుకు నారాయణ వారాల పిల్లాడిగా ఎన్నో చేదు అనుభవాలను ఎదుర్కొని, చివరికి బొంబాయిలో దాదాల గొడవల్లో హత్య చేసేటంత భ్రష్టుడవుతాడు. నిజజీవితంలో చిన్నప్పుడు, తన తల్లి వారాల పిల్లాడిని ఆప్యాయంగా చూసుకోవటాన్ని ప్రత్యక్షంగా చూసిన మునిపల్లె రాజు ఆ అనుభవాన్ని కథా రూపంలో పాఠకులకు అందించడం విశేషం.

రావి శాస్త్రి 'స్మారక అవార్డు', 'శిష్టా' సాహిత్య అవార్డు, 'నూతలపాటి గంగాధరం' సాహిత్య అవార్డులు వారి కథా సంపుటాలకు గుర్తింపుగా అందుకున్నారు. మిలిటరీలో చాలా కాలం ఉన్నారు. పరమ సాత్వికులు, సహృదయులు, వ్యక్తిగత జీవితంలో క్రమశిక్షణ పాటించినా, మిత్రులకు ఆయనొక అమృత భాండం... విజ్ఞాన ఖని.


రచయితచిరునామా
మునిపల్లె రాజు
ఎ-30/1ఎ (ఎ.ఎఫ్. ఒ.సి. హెచ్.ఎస్)
సైనిక్‌పురి, సికింద్రాబాద్ - 500 034.



# ముదిగొండ శివప్రసాద్

అత్యంత ప్రతిష్ఠాత్మక నోరి శతజయంతి పురస్కార గ్రహీత, ప్రముఖ కథా రచయిత ముదిగొండ శివప్రసాద్ గారు గుంటూరు జిల్లా 'ఒంగోలు'లో **23-12-1940**న జన్మించారు.

ముదిగొండ శివప్రసాద్ గారు కథలే కాక, అనేక నవలలు కూడా రచించారు. వీరు రచించిన నవల 'సగం విరిగిన చంద్రుడు', కృష్ణా పత్రికలో ధారావాహికంగా ప్రచురించబడింది. ఆంధ్రప్రభలో 'అమృత సరోవరం', జాగృతిలో 'దశాశ్వమేధ్', 'శ్రీపదార్చన', 'నాగానిక', నవలలు ధారావాహికలుగా వెలువబడ్డాయి.

'శ్రావణి' ఆంధ్ర భూమిలో ధారావాహికంగా వెలువడింది. విజయ, నీలిమ మాసపత్రికలలో 'అనుపమ కథ', 'అంబుధిలో అంగారం', 'అమృతవాహిని', 'ఆవాహన', 'శ్రీలేఖ', 'అగ్నిగీతం', 'నన్నయ భట్టు మళ్ళీపుట్టాడు' వంటి ప్రముఖ రచనలు వెలువడ్డాయి.

దాదాపు 30 నవలలు వందలాది కథలు, సారస్వత వ్యాసాలు దేశ విదేశాలలోని వివిధ పత్రికలలో ప్రచురించి సాటిలేని సాహితీ మూర్తిగా లబ్ధ ప్రతిష్టులైనారు. హిందీ, కన్నడం, తమిళం, ఇంగ్లీషు వంటి భిన్న భారతీయ, పాశ్చాత్యభాషల లోనికి కూడా వీరి రచనలు అనువదించబడ్డాయి. ముదిగొండ శివప్రసాద్‌గారి రచనలలో అనుభవ మండపము.... బసవేశ్వరుని జీవితముపై వచ్చిన మొట్టమొదటి ప్రామాణిక చారిత్రాత్మక నవల. దీన్ని వివిధ విశ్వవిద్యాలయాల్లో పాఠ్యగ్రంథములుగా వుంచారు. వీరి శ్రీప్రదార్చన 'తెలుగు విశ్వవిద్యాలయము' వారి అత్యుత్తమ నవలాపురస్కారమును అందుకున్నది. సారక్క, సమ్మక్కల జీవితముపై వీరు రచించిన 'చంద్రకళ' సిద్ధిపేట వారి పురస్కారమును పొందినది.

ముదిగొండ శివప్రసాద్ గారు అనేక పురస్కారాలు అందుకున్నారు. సాహిత్యంలో విశేషకృషి చేసిన వీరికి రాష్ట్ర ప్రభుత్వము వారి కళానీరాజన పురస్కారం, పైడిపాటి కళాపీఠం పురస్కారం, కురంగంటి సీతారామ భట్టాచార్య పురస్కారం, నెల్లూరు కవిత్రయ పీఠా సత్కారం, పాల్కురికి సోమనాథ కళా పీఠాపురస్కారం, కిన్నెర, ఉగాది సాహితీమూర్తి సత్కారం, భాషాకుటీరం పురస్కారం ఇంకా... వందలాది సాహిత్య సాంస్కృతిక సంస్థల సన్మానాలు వారి అఖండ ప్రతిభకు అంకురిత సాహిత్య దీక్షకు దర్పణాలు.

ఢిల్లీ ఆకాశవాణి 1990లో ముదిగొండ శివప్రసాద్ గారిని 'జాతీయ కవి'గా గుర్తించింది. 6, ఫిబ్రవరి 2000 నాడు నోరి శతజయంతి వేదిక హైదరాబాదులో వీరికి నోరి శత జయంతి పురస్కారం అందజేసి గౌరవించింది.

ముదిగొండ శివప్రసాదరావు గారు వృత్తిరీత్యా ఎంతో బిజీగా వున్నా నేటికీ అనేక సాహితీ సభల్లో పాల్గొని యువ కథకుల సంపుటాల ఆవిష్కరణ సభలకు ఎంతో ఉత్సాహంతో హాజరై ఆశీస్సులు అందిస్తున్నారు. కానీ ఇటీవలి కాలంలో వీరు కథా రచనను అంతగా కొనసాగించటం లేదు. నేటి యువ కథకుల కొరకు వీరు మునుపటిలా కథలు అందిస్తారని ఆశిద్దాం.


రచయిత చిరునామా
**ముదిగొండ శివప్రసాద్**
2-2-647/132-బి.
సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ,
హైదరాబాద్ - 500013.



# ముద్దం శెట్టి హనుమంతరావు

శ్రీకాకుళం జిల్లాలోని 'కలివరం' గ్రామంలో 1-12-1928న జన్మించారు ప్రముఖ కథా రచయిత ముద్దంశెట్టి హనుమంతరావు ఖర్గపూర్ రైల్వే డిపార్ట్‌మెంటు ఆఫీస్ సూపరింటెండెంటుగా వృత్తిరీత్యా పనిచేశారు. ప్రస్తుతం విశాఖలో స్థిరపడ్డారు.

కొడవటిగంటి కుటుంబరావు రచనల ప్రేరణతో కథలు రాయటం మొదలుపెట్టిన ముద్దంశెట్టి గారి కథలు సుమారు 600 లకు పైగా ప్రచురించబడినాయి. వీరి మొదటి కథ 1950లో 'పూర్వపరిచయం' టైటిల్‌తో ప్రచురింపబడింది. సుమారు 42 నవలలు, 50 నాటికలు వ్రాసారు. వీటిలో కొన్నిటికి బహుమతులు కూడా పొందారు.

వీరి కథలు లోతుగా పరిశీలిస్తే... ఆయన నేరుగానో, నర్మగర్భితంగానో ఒక నీతిని చెప్తారు. అదీ ఉపదేశంలా కాదు. లోక కళ్యాణాన్ని సమాజహితాన్ని, వ్యక్తి శ్రేయస్సునూ కాంక్షించే మంచి మనిషిలా వుంటుంది. వ్యక్తిగత జీవితంలో, రచనల్లో కూడా నిరాడంబరతకు అలంకారాన్ని ఔన్నత్యాన్నీ చేకూర్చిన ఘనుడు ముద్దంశెట్టి హనుమంతరావు.

విశాలాంధ్ర ప్రచురించిన కథా సంపుటితోపాటు మొత్తం ఐదు సంపుటాలు వీరివి వెలువడినాయి. నలభైరెండు నవలలు ప్రచురించ బడ్డాయి. 'అహం-అనర్థం', 'దైవఘటన', 'అగుపించని అంకుశం', 'పసిడి మనసు', ఎమ్మెస్కోవారు ప్రచురించగా 'చైతన్యపథం', 'కక్ష' చతురలో ప్రచురించబడ్డాయి. 'మంచికి వారసులు', 'మళ్ళీ వసంతం', 'వ్యామోహం' స్వాతి మాస పత్రికలో ప్రచురించబడ్డాయి. ఇప్పటివరకు వీరు నాలుగు నాటకాలు రాసారు. ఇందులో 'ఈ అనుభవం చాలు' నాటకాన్ని కే.కే.స్థానం వారు హైద్రాబాద్ ఆకాశవాణి నుండి ఒక గంట నాటకంగా ప్రసారం చెయ్యడం మరచిపోలేని అనుభవంగా ముద్దంశెట్టిగారు పలు సంధర్భాల్లో చెబుతుంటారు.

ముద్దంశెట్టిగారు డజనుకు పైగా నాటికలు రాసారు. అయితే 'అంతామోసం' ఒక్కటే పుస్తక రూపంలో వచ్చింది. అయితే శ్రవ్యనాటికలు సుమారు అరవైకి పైగా రచించి సాహిత్యాభిమానులకు ఆ లోటు తీర్చారు.

హనుమంతరావు గారు 'కన్యాశుల్కం' నాటకంపై రెండు వ్యాసాలు ఆంధ్రభూమిలో రాసారు. అదే పత్రికలో 'నేటికథ' శీర్షికన మూడున్నరేళ్ళు నిర్వహించడం గొప్ప అనుభవం అని ఆయన చెప్తారు. వీరి కథ 'ఉషోదయం'ను టి.వీ. అండ్ ఫిలిమ్స్ డివిజన్ వారు డాక్యుమెంటరీ చిత్రంగా రూపొందిచారు. 1999 మార్చి 14వ తేదీన మద్రాసు తెలుగు అకాడమీ వారు 'ఉగాది పురస్కారం' వీరికి అందజేసి గౌరవించారు.

ప్రస్తుతం వీరు విశాఖ సాహితీ ఉపాధ్యక్షుడిగా, 'అమ్మ' సంస్థ కార్యనిర్వాహక సభ్యుడిగా వుంటూ ఓపిక వున్నంతవరకూ సాహిత్య నాటక రంగాలకు ఇతోధికంగా సేవచెయ్యాలన్న లక్ష్యంతో ఉన్నారు.


రచయిత చిరునామా
**ముద్దం శెట్టి హనుమంతరావు**
నం. 1, దేవీ టవర్స్, అక్కయ్యపాలెం,
విశాఖపట్నం - 530 016.



# ముదిగంటి సుజాతా రెడ్డి



"కథను ప్రజల యాసతో రాయడం ఇష్టం" అంటారు ప్రముఖ కథా రచయిత్రి ముదిగంటి సుజాతా రెడ్డి. నల్గొండ జిల్లా 'ఆకారం' గ్రామంలో పుట్టిన సుజాతా రెడ్డి హైదరాబాద్‌లో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. వృత్తిరీత్యా తెలుగు ఉపన్యాసకురాలిగా వున్నారు.

పల్లె వాస్తవిక జీవితాన్ని ముఖ్యంగా తెలంగాణా పల్లెపట్టులను, పల్లె వాతావరణాన్ని పల్లెవాసుల జీవితాలను ఆర్థిక సంబంధమైన, భూ సంబంధమైన సమస్యలను చిత్రించారు సుజాతా రెడ్డిగారు. ప్రజల యాసలో రాయడమంటే ప్రీతివున్న వీరు తన 'విసుర్రాయి' కథా సంపుటిలో స్త్రీ ఎలా శ్రమ దోపిడికి, అన్యాయాలకు గురవుతుందో వాస్తవ జీవితాలను ఇతివృత్తాలుగా తీసుకొని చిత్రించారు. ఈ సంకలనంలోని ఇర్వై కథల్లోని మొదటి కథే 'విసుర్రాయి'. స్త్రీల జీవితంలోని అన్ని కోణాల్ని స్పృశిస్తూ రాసిన కథలు ఈ కథా సంపుటిలో చేర్చబడ్డాయి. ఈ కథాసంపుటిలో చేర్చిన కథల్లో 'స్వేచ్ఛ', 'రౌడీయిజం', 'మోక్షం', 'బందీ', 'బొమ్మలో చైతన్యం' కథలు చాలా మంచి కథలుగా పాఠకుల మన్ననలందుకున్నాయి. కథా సంకలనాలైన 'కదంబం', 'నూరేళ్ళపంట', 'కరీంనగర్ కథానికలు' ఒకటి, రెండవ భాగాల్లో వీరి కథలు చోటు చేస్కుని పలువురి ప్రశంసలందుకున్నాయి.

కథారచనతోపాటు నవలా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న సుజాతా రెడ్డిగారు 'మలుపు తిరిగిన రథచక్రాలు', 'సంకెళ్ళు తెగాయి', 'ఆకాశంలో విభజన రేఖల్లేవు' వంటి నవలలు ప్రచురించి తెలుగు పాఠకులకు అందించారు. ఉద్యమాన్ని చిత్రిస్తూ మహిళలు నవలలు రాయడం ఇంతవరకూ సాహితీలోకంలో రాలేదు. అయితే వీరు 'మలుపు తిరిగిన రథ చక్రాలు' నవలలో విప్లవ ఉద్యమాన్ని చిత్రిస్తూ ఆలోటు పూడ్చారు. కాబట్టి ఈ విషయంలో మనమంతా సుజాతా రెడ్డిగార్ని అభినందించాల్సి ఉంటుంది.

'సంకెళ్ళు తెగినాయి' నవలలో ఒక క్రింది వర్గానికి (దళిత) చెందిన యువకుడు వ్యక్తిత్వ పైకి రావడాన్ని వాస్తవిక చిత్రణతో రచించారు. ఇటీవల 12 కథలతో 'భూమి'ని గురించి ప్రసక్తి ప్రతి కథలో తెస్తూ 'మింగుతున్న పట్నం' కథల సంపుటి తెచ్చిన సుజాతా రెడ్డిగార్కి ఎన్నో అవార్డులు, సన్మానాలు లభించాయి. విజేత దినపత్రిక 'మహిళ పేజీలో "ఈ మధ్యకాలమ్" శీర్షికను వీరు విజయవంతంగా నిర్వహించారు. కరీంనగర్ జిల్లా ప్రముఖ కథకులను, యువ కథకులను కల్పుకుంటూ వీరు కథకొరకు ఎంతో కృషి చేస్తున్నారు. ఎప్పటికప్పుడు సమాజంలో వస్తున్న మార్పులను గమనిస్తూ, సమస్యలకు పరిష్కార మార్గాలను చూపుతూ ముఖ్యంగా బడుగు వర్గాల ప్రజలపై జరుగుతున్న దౌర్జన్యాలను వ్యతిరేకిస్తూ తన దైన శైలిలో కథలు రాస్తున్నారు. వీరికి ప్రముఖ కథకులు బి.ఎస్. రాములు, కాలువ మల్లయ్య అల్లం రాజయ్య, ఆడెపు లక్ష్మీపతి, డాక్టర్ నలిమెల భాస్కర్ వంటి తెలంగాణా సీనియర్ కథకులంటే ఎంతో అభిమానం. సుజాతా రెడ్డిగారు మరిన్ని మంచి కథలు మనకు అందించాలని కోరుకుందాం.


రచయిత్రి చిరునామా
ముదిగంటి సుజాతా రెడ్డి
రోహిణం, 2-2-1105/21,
తిలక్‌నగర్, హైద్రాబాద్ - 500044.



# ముక్తేవి భారతి

1941 జూన్ 10న జన్మించిన డా. ముక్తేవి భారతి గారు నేటి మనకున్న ప్రముఖ కథా రచయిత్రులలో ముఖ్యులు. వృత్తిరీత్యా హైదరాబాద్‌లోని ఆర్.బి.వి.ఆర్.ఆర్. ఉమెన్స్ కాలేజీలో తెలుగు ఉపన్యాసకురాలిగా పనిచేసి ప్రస్తుతం విశ్రాంతి తీసుకుంటున్నారు.

ముక్తేవి భారతిగారు కథలే కాకుండా కవితలు, నవలలు, వ్యాసాలు కూడారాసి, మంచి గుర్తింపు పొందారు. ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, రామ కృష్ణ ప్రభ, సూర్యశక్తి పత్రికల్లో 'శీర్షికలు' నిర్వహించి తన వంతు సాహితీసేవను అందిస్తున్నారు.

ప్రస్తుతం ఆంధ్రభూమి మాసపత్రికలో ముక్తేవి భారతిగారి రచనలు 'షష్ఠిపూర్తి కథలు' శీర్షికన ప్రచురించబడుతున్నాయి. ఈ కథలు పాఠకుల మన్ననలు అందుకుంటున్నాయి. 'సాహితీ కౌముది' అనే త్రైమాసిక పత్రికలో ఆధునిక పద్యసాహిత్యంలో 'స్త్రీపాత్రలు' శీర్షిక రాస్తున్నారు. 'తృణకంకణం' పత్రికలో వీరి నవల 'సౌభద్రుని ప్రణయయాత్ర' వస్తున్నది. బాలలకోసం 'కంచేచేనుమేస్తే' కథాసంపుటి ప్రచురించి చిన్నారులకు కానుకగా అందించారు. త్వరలో 'పొరిగింటి పుల్లకూర' అనే మరో కథా సంపుటి బాలలకోసం తీసుకొస్తున్నారు. ఈ కథా సంపుటిని 'ఆంధ్రమహిళాసభ', 'సాక్షరతాభవన్' వారు ముద్రిస్తున్నారు.

'ముక్తేవి భారతి కథలు' అనే ఒకటి, రెండు సంపుటాలు వీరు ప్రచురించారు. ఈ రెండు కథాసంపుటాలు తెలుగు కథాప్రియుల్ని విశేషంగా ఆకట్టుకున్నాయి. నవలారచయిత్రిగా 'మళ్ళీ వచ్చిన వసంతం'కు వీరికి మంచి గుర్తింపు లభించింది. భారతంలో ప్రేమ కథల పుస్తకం, 'భారతీయం', 'వ్యాసకథ' కవిత, వ్యాసాల పుస్తకాలు ప్రచురించి పాఠకులకు అందించారు. సాహిత్యపరంగా రచయిత్రిగానే కాకుండా, సాహితీ సభలకు జీవిత సభ్యురాలిగా వ్యవహరిస్తున్నారు. 1986-89 వరకు రీజినల్ ఫిల్మ్ సెన్సార్ బోర్డ్ ఎడ్వైజరీ పానెల్ మెంబర్‌గా వ్యవహరించారు. ప్రస్తుతం 'త్యాగరాయ గానసభ, ఆంధ్రమహిళాసభ, వంశీ ఆర్ట్స్, రెడ్ క్రాస్ సొసైటీలకు జీవిత సభ్యురాలిగా, 'మానస' మానసిక వికలాంగుల పిల్లల పాఠశాలకు వైస్ ప్రెసిడెంట్‌గా వ్యవహరిస్తున్నారు.

ఆంధ్రభూమి దినపత్రికలో 'కథనం', ఆంధ్రప్రభ దినపత్రికలో 'భావలహరి', రామకృష్ణ ప్రభ మాసపత్రికలో 'భారతంలో నీతి కథలు' సూర్యశక్తి మాసపత్రికలో 'మనసాహిత్యం' శీర్షికన ప్రస్తుతం విజయవంతంగా నిర్వహిస్తున్నారు.

1991 సంలో రాష్ట్ర ప్రభుత్వం 'ఉత్తమ ఉపాధ్యాయురాలు' అవార్డు, 1966 సం లో 'గృహలక్ష్మి స్వర్ణకంకణం' అవార్డు, 1998 సం లో 'మద్రాసు తెలుగు అకాడమీ ఉగాది పురస్కారం' అవార్డు, 1998 సం. లో 'వాసిరెడ్డి రంగనాయకమ్మ పురస్కారం', 1998 సం లో అభినందన ఆర్ట్స్ వారి దుర్గాభాయ్ దేశ్‌ముఖ్, 2001న ఇల్లిందిల సరస్వతీదేవి 'స్వర్ణ పతకం' అందుకున్నారు.


రచయిత్రి చిరునామా
డా. ముక్తేవి భారతి
6-1-107/22, పద్మారావు నగర్,
సికింద్రాబాద్ - 500 025.





## మేడిచర్ల సూర్య ప్రకాశరావు

పశ్చిమగోదావరి జిల్లా 'నరసాపురం'లో జన్మించిన మేడిచర్ల సూర్యప్రకాశరావు తన సొంత పేరుతోను, కలంపేరు 'మేడిచర్ల అనుపమ'తోను అనేక కథానికలు పాఠకులకు అందించారు.

మేడిచర్ల కథల్లో చాలా కథలు ప్రముఖంగా పత్రికల్లో ప్రచురించబడ్డాయి. కొన్ని కథలకు బహుమతులు, అవార్డులు లభించాయి. వీరి కథ 'చెరపకురా చెడెదవు'కు కొత్తపట్నం-కళాసాహితి (ప్రకాశంజిల్లా) వారి రాష్ట్రస్థాయి కథల పోటీలో, ప్రథమ బహుమతి లభించింది. కథా రచనల్లో విశిష్ట సేవ చేసినందుకుగాను 1993లో శ్రీ మేడిచర్లకు 'సావిత్రి స్మారక అవార్డు' లభించింది.

మేడిచర్ల అనుపమ పేరుతో చాలా పొడుపు కథలు రచించారు. పొడుపు కథలు బాలలను విశేషంగా ఆకర్షిస్తాయని, బాలసాహిత్యం ద్వారా చిన్నారులకు విజ్ఞానం అందించాలని ఆరాటపడుతుండే వీరు వృత్తిరీత్యా ఉపాధ్యాయులు.

"ఏ అంశమైనా కథకు పనికొస్తుంది. ఇంటరెస్టింగ్‌గా చెప్తూ చివరి అంశం పాఠకుల ఊహకు విడిచిపెడితే, ఆకథ చదవగానే పాఠకుడు ఒక్క నిముషం ఆలోచనలో పడతాడు. వాళ్ళ ఊహకు భిన్నంగా ఉండే ఆ కథ అద్భుతమైన కథ అవుతుంది" అనే మేడిచర్ల సమాజంలో మంచి మార్పుకోసం ఎక్కువగా రచనలు చేస్తున్నారు.

కథారచనతో పాటు కవితలు, జోక్స్ కూడా రాసే మేడిచర్ల, ఆప్రక్రియల్లో కూడా మంచి గుర్తింపు సాధించారు. 'నిద్రాజగత్‌లో ప్రజాస్వామ్యం' అనే వీరి కవిత 'కళాసాహితీ' వారి ప్రశంసలు పొందింది.

ఆకాశవాణి విజయవాడ నుండి వీరి అనేక కథానికలు ప్రసారం చేసారు. ఆకాశవాణి విజయవాడలో 'కెరటాలు' శీర్షికలో వీరి కవితలు ప్రసారమయ్యాయి. కథ చదివి, ఆకథ హృద్యంగా ఉందని ఆనందాన్ని, జ్ఞానాన్ని పొందితే అప్పుడే కథారచయిత తన శ్రమకు ఫలితం పొందినవాడవుతాడని నమ్మే మేడిచర్ల, త్వరలో ఓ కథాసంపుటి తీసుకురావటానికి ప్రయత్నిస్తున్నారు. వీరి కథలను లోతుగా పరిశీలిస్తే, కథకు టైటిల్, శిల్పం, మలుపులు, కొసమెరుపులతో పాటు కథా ప్రారంభాన్ని కూడా ఓ విశదాత్మంగా నడపటానికి ప్రయత్నించినట్లు తెలుస్తుంది.

వివిధసాహితీసంస్థల నుంచి సన్మానాలు, అవార్డులు, బహుమతులు లెక్కకు మించి సాధించిన మేడిచర్ల సూర్యప్రకాశరావుగారు కథాసంపుటి అందిస్తారని ఆశిద్దాం.

మేడిచర్ల కథా రచనతో పాటు కవితా ప్రక్రియలో కూడా విశేషంగా కృషిచేస్తున్నారు. కానీ కష్టతరమైన కథా ప్రక్రియ అంటేనే ఆయనకు మక్కువ ఎక్కువ. ఎప్పటికప్పుడు రాష్ట్ర నలుమూలల వున్న కథకులతో ఉత్తరాల ద్వారా సంభాషణలు జరుపుతూ, ప్రముఖ కథకుల సహాయ సహకారాలను పొందుతూ, కథా రచనలను కొనసాగిస్తూ ముందుకు సాగుతున్నారు.


రచయిత చిరునామా
మేడిచర్ల సూర్యప్రకాశరావు
డో.నెం.7-109,
రామరాజులంక - 533 253,
రాజోలు తాలుకా, తూ.గో.జిల్లా.



# యలమర్తి అనూరాధ



జాతీయ స్థాయిలో సాహిత్య కార్యక్రమాల్లో పాల్గొని రాష్ట్రస్థాయిలో కూడా రాష్ట్ర యువజన సర్వీసుల శాఖవారి రాష్ట్రస్థాయి ఉత్తమ సాహితీ అవార్డు అందుకున్నారు యలమర్తి అనూరాధ. సాహిత్యములో అన్ని ప్రక్రియల్లో ప్రవేశమున్న అనూరాధ కృష్ణాజిల్లా 'ముదునూరు'లో జన్మించారు.

యలమర్తి అనూరాధగారి కథల్ని లోతుగా పరిశీలిస్తే ఎదుటి వారిలో మంచిని గ్రహించడం, సమాజంలో సమస్యలను ఎత్తిచూపి తగిన పరిష్కారాన్ని తన కథలద్వారా చూపటం స్పష్టంగా కనిపిస్తుంది. గులాబీకి ముళ్ళుంటాయ్, సోదరులారా మీ ప్రయాణం ఎటు?, దారి చూపిన గాలిపటం, కథలు యలమర్తి గారిని కథకురాలిగా తెలుగు సాహితీ లోకానికి గొప్పగా పరిచయం చేశాయి. ఆ తరువాత ఆవిడ ఆగకుండా సుమారు 150కి పైగా కథలు రాసారు. 300 కవితలు, 100వ్యాసాలు ప్రచురించబడ్డాయి.

యలమర్తి గారి కథలు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ప్రతిమూడు మాసాలకొకసారి తప్పని సరిగా ప్రసారం కావల్సిందే! రచయిత్రిగా యలమర్తి 'రాష్ట్ర నవరచయితల అధ్యయన శిబిరం-వచన కవిత' శిబిరానికి కృష్ణాజిల్లా నుండి - 1999వ సంవత్సరంలో పాల్గొన్నారు. ఈ శిబిరాన్ని రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ, రాష్ట్ర సాంస్కృతిక మండలి సంయుక్తంగా నిర్వహించింది.

"నేను గత 20 సంవత్సరాలుగా రచనా సాహిత్యంలోవున్నా ఒక్క పుస్తకం కూడా రిలీజ్ చెయ్యలేక పోవడం, ఏ సంస్థా ముందుకు రాక పోవడం శోచనీయం" అనే యలమర్తి అనూరాధగారు పత్రికల్లో అనేక శీర్షికలు నిర్వహిస్తున్నారు.

వార్త 'చెలి'లో నేస్తం శీర్షిక(ప్రతి గురువారం), వండర్ వరల్డ్‌లో 'సంసారంలో సరిగమలు' శీర్షికలు వీరికి విశేష కీర్తిని చేకూర్చాయి.

'మీ పిల్లలలు సూపర్ కిడ్స్‌లా కీర్తింపబడాలంటే' అనే పుస్తకం ప్రచురించి పాఠకులకు అందించారు అనూరాధ. ఈ పుస్తకం తెలుగు పాఠకులను విశేషంగా ఆకట్టుకుంది. వనితాజ్యోతి లో సైక్రియాట్రిక్ పేజీ 15 మాసాలుగా నిర్వహించారు.

ఆకాశవాణి, దూరదర్శన్ ద్వారా తనవంతు సాహిత్య సేవలందిచాలన్న లక్ష్యంతోవున్న యలమర్తిగారు ఉగాది మహిళా కవి సమ్మేళనంలో పాల్గొని పలువురు ప్రశంసలందుకున్నారు. కథారచయిత్రిగా కొనసాగుతూ నవలా రచయిత్రిగా ఎదగాలన్నది తన లక్ష్యమని అంటారు. ఒంటరిగానే సాగిపో అన్న కథలో ... ఒక కోడలు అత్తగారు పెట్టే హింస భరించలేక ఆత్మహత్య చేసుకుని దానికి కారణం అత్త మామలు, భర్త అని రాసి ఝాన్సీ అనే స్నేహితురాలికి పోస్టు చేస్తుంది. స్నేహితురాలి మాట మీద ఆమె ఆత్మ శాంతి కోసం ఆ ముగ్గురికి శిక్ష పడేలా చేస్తుంది ఝాన్సీ.

ఎన్నో సంస్థల నుండి సన్మానాలు, అవార్డులు అందుకున్న వీరు స్నేహశీలి, మృదుభాషి - ఎక్కడ సాహితీ సభ జరిగితే అక్కడ తప్పక ప్రత్యక్షమవుతారు. రాష్ట్ర నలుమూలలా ఇప్పటికే ఎందరో అభిమానుల్ని సంపాదించుకున్న యలమర్తి గారు కథాసంపుటి తీసుకురావాల్సిన అవసరం ఎంతైనా వుంది.


రచయిత్రి చిరునామా

**యలమర్తి అనూరాధ**

ప్రతిభానికేతన్ వీధి, అభినందన

అపార్ట్‌మెంట్స్, సెకండ్ ఫ్లోర్-2, మాచవరం,

విజయవాడ - 520 004.



# యల్లకర ప్రభావతి

శ్రీమతి యల్లకర ప్రభావతి మంచి రచయిత్రినే కాదు చిత్రకారిణి కూడా, సమాజాన్ని చూసి స్పందించి అటుచిత్రాలు గీస్తారు ఇటు కథానికలు రాస్తారు. "కథలు రాయటం ఒక కళ. ఏ సంఘటన నైనా కథగారాయవచ్చు" అంటారు.

ఒక ఇతివృత్తం, సంధిగల, సంఘటనల పరాకాష్ఠ, ఉత్సుకత, చదివించే లక్ష్యం ఉన్న కథలు బాగా రాణిస్తాయి. అవి చిన్న పిల్లల కథ కానీయండీ పెద్దల కథలైనా... ఏ కథైనా పాఠకుడిని చదివించినప్పుడు అది అద్భుతమైన కథ అవుతుంది. ఆ విధంగా కథలు రాయడంలో యల్లకర ప్రభావతి ప్రవీణురాలని నిరూపించు కున్నారు. స్త్రీలు, స్త్రీవాద రచనలే చేయాలని లేదు. యల్లకర ప్రభావతిగారు తన కథల్ని జానపద రీతిలో సాగించటంలో యిష్టపడతారు. వీరి కథల్లో ఎక్కువగా మునులు, రాజకుమారులు, రాక్షసులు, అరణ్యాలు, ఇంద్రలోకం, సాంఘీక పాత్రలు ఇలా ఎన్నో పాత్ర సన్నివేశాలు పాత్రలుగా కనిపిస్తాయి.

యల్లకర ప్రభావతి గారి కథలు వనిత, ఉదయం దినపత్రికల్లో వరుసగా ప్రచురించ బడ్డాయి. 'పంచభూతాల సాక్షిగా' కథ వనితలో ప్రచురించగా, వీరికి ఆ కథ విశేష అభిమానులను సంపాదించింది. 'పర్యావరణ పరిరక్షణే మానవ తక్షణ కర్తవ్యం, కాలుష్య నివారణే సర్వరోగనివారణి, చెట్లు పెంచడమే... సకల జీవరాసికి ప్రాణవాయువు నింపడమని' సందేశాన్నిచ్చే కథ 'పంచభూతాల సాక్షిగా!'

1999లో యల్లకర ప్రభావతిగారు తన కథలన్నిటిని 'యుగధర్మం' కథా స్రవంతి పేరుతో సంపుటి ప్రచురించి పాఠకులకు అందించారు. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుండి వీరి కథానికలు విరివిగా ప్రసారమవుతుంటాయి. వీరికి మంచిపేరు తీసుకొచ్చిన కథలుగా 'ఆగిపోయిన ప్రయాణం', 'ఈ తరం కోడలు', 'కుట్టిన విస్తరి', 'ఆనవాయితీ', 'రుణానుబంధం', 'జిజ్ఞాస', 'మనిషిలోని మృగం' చెప్పుకోవచ్చు.

కథానికలేకాకుండా పద్య రచనా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న యల్లకర ప్రభావతిగారు 'గీతాంజలి', 'శ్రీరామ కథామృతం', 'పద్యకవితాలహరి భారత మహిళ' పేర్లతో పద్యాలను పుస్తకాలుగా ముద్రించి సాహితీ ప్రియులకు అందించారు. హైదరాబాదు న్యూ నల్లకుంట సరస్వతీ నగరంలో వున్న శ్రీ 'సీతారామాంజనేయ ఆలయంలో' భక్తులు ప్రతి రోజు వీరి భక్తి గీతాలు గానం చేయటం విశేషం.

చిత్రలేఖనంలో కూడా ప్రవేశమున్న యల్లకర ప్రభావతి గారు 'యుగధర్మం'కు ముఖ చిత్రంతో పాటు కథలకు చక్కటి చిత్రాలు వీరికుంచె నుండి జాలువారినవి కావటం విశేషం.


రచయిత్రి చిరునామా
**యల్లకర ప్రభావతి**
సి4, పి&టి క్వార్టర్స్,
టెలిఫోన్ ఎక్స్చేంజి, తార్నాక,
హైదరాబాదు - 500007.



# రసరాజు

భట్లవంకుటూరులో జన్మించి 'తణుకు'లో స్థిర నివాసమేర్పరుచుకున్న ప్రముఖ కథారచయిత 'రసరాజు' పూర్తి పేరు 'రంగినేని సత్యనారాయణ రాజు' అని చాలా కొద్ది మందికే తెలుసు. కానీ 'రసరాజు' పేరుతో తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలతోను సంబంధం ఏర్పరుచుకున్నారు.

సుమారు 100కు పైగా కథలు రాసిన 'రసరాజు' గారు అనేక చలన చిత్రాలకు పాటలు కూడా రాసారు. వృత్తిరీత్యా భీమవరంలో ఎలక్ట్రిసిటీ రెవిన్యూ ఆఫీసులో జూనియర్ ఎకౌంట్స్ ఆఫీసర్‌గా పనిచేస్తూ, ప్రవృత్తిరీత్యా కథలు రచించి రాష్ట్ర నలుమూలలా అనేక మంది అభిమానులను సంపాదించుకున్నారు.

కరుణ రసంతో పాటు మరో చేత్తో హాస్యరసాన్ని పండించగల నవ్య సాచి రసరాజు. రసాల్లో కరుణరసం గొప్పదంటారు. తనకథల ద్వారా జనాన్ని ఏడ్పించగల "కథారాజు" రసరాజు. రచయితగా అజాత శత్రువు. దృష్టి అనన్య సామాన్యం. శైలి అనితరసాధ్యం. లోకంలో దుఃఖం, వేదన వున్నంతకాలం రసరాజు కథల్లోని పాత్రలు చిరంజీవులే.

1992లో 'అసెంబ్లీరౌడి' చిత్రంలో జేసుదాసు గానం చేసిన 'అందమైన వెన్నెలలోనా' అనే గీతానికి 'కళాసాగర్' అవార్డు లభించింది. వీరి కలం నుంచి జాలువారిన ఈ గీతం ఇప్పటికీ శ్రోతల హృదయాల్లో స్పందిస్తూనే ఉంది. 'రసభారతి' అనే పద్యకవితా సంపుటిని వీరు ప్రచురించారు. 'రసభారతి' సంపుటి తెలుగు అభిమాన పాఠకులను ఒక ఉర్రూతలూగించింది. అనేక సాహితీ సంస్థల మన్ననలు, అభినందనలు, సన్మానాలు, బహుమతులు ఈ సంపుటి సాధించిపెట్టింది. ఇంకో ముఖ్య విషమేమంటే, ఈ 'రసభారతి' పద్య కవితా సంపుటి బెంగుళూరు విశ్వవిద్యాలయం పాఠ్యగ్రంథంగా ప్రవేశపెట్టింది.

ది.11-7-2002 నాడు హైదరాబాదు లోని నగర కేంద్ర గ్రంథాలయం, చిక్కడపల్లిలో రసరాజు గారు రచించిన 'రసరాజు నానీలు' గ్రంథావిష్కరణ జరిగింది. ఈ గ్రంథాన్ని వీరు గారు జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా. సి. నారాయణరెడ్డి గార్కి అంకిత మిచ్చారు. ఆ సభకు డా. ఎన్. గోపిగారు అధ్యక్షత వహించారు.

"గుడిసెలో మానానికి గుడ్డ కరువు
షోకేసులో బొమ్మకు గుడ్డబరువు..."

అనే మినీకవితకు రాష్ట్రస్థాయి అవార్డు అందుకున్నారు రసరాజు. "కథకుడైనవాడు, రచయిత అయినవాడు మన సమాజం ఆరోగ్యవంతంగా, అభివృద్ధికరంగా ఉండాలనే ఆలోచనతోనే రాయాలి" అంటారు. కథ అయినా, మరో ప్రక్రియ అయినా - అసలు సాహిత్య ప్రయోజనం సర్వజన హితం అవుతుందా? కాదా? అన్నదానిమీదనే విభిన్న అభిప్రాయాలున్నాయి. కథనంలో మంచి మెలకువ చూపించాలి. ఆ కథకొక సార్వజగీతమైన ప్రయోజనం ఉండాలనే లక్ష్యంతో కథలు రాస్తున్న రసరాజు కథలన్నీ మంచి కథలే అవుతాయి.

రచయిత చిరునామా
రసరాజు (సినీ గీత రచయిత)
తణుకు - 534211.



# రావూరి భరద్వాజ

"కథానిక రాసేటప్పుడు డైలాగ్స్ ఎక్కువగా వాడకూడదు. చివరలో ఒక్క డైలాగ్ అయితే బాగుంటుంది". అంటారు 'తెలుగు ఆత్మ గౌరవ పురస్కార 'అవార్డు గ్రహీత డా॥ రావూరి భరద్వాజ.

1927 జులై 5న 'మొగులూరు' గ్రామంలో జన్మించారు. కేవలం ఎనిమిదో తరగతి వరకే చదువుకున్న వీరు సుమారు 500కు పైగా గాథలు, 47 కథాసంకలనాలు ప్రచురించారు. 19 నవలలు, 7 బాల కథాసంపుటాలు, 7 బాల నవలలు, సాహిత్యవ్యాసాలు, నాటకాలు, సామాన్యులకు సైన్సు... ఇలా అనేకాంశాలమీద 131 పుస్తకాలు వీరివి ప్రచురణ అయ్యాయి. భరద్వాజగారి 'విజయవిలాసం' కథల సంపుటికి రాష్ట్రసాహిత్య అకాడమీ అవార్డు, 'జీవనసమరం' వ్యాసాలకు కేంద్ర, రాష్ట్ర పురస్కారాలు, డి. లిట్ సాహిత్య డాక్టరేట్లు... డిగ్రీ చదువులకన్నా 'అనుభవం' అన్నబడిలో చదివిన చదువుకు విలువ ఎక్కువ అని నిరూపించుకున్నారు.

రావూరి భరద్వాజగారు ఎన్నో రేడియో నాటికలు రచించారు. వాటిలో మనం 'ఆత్మగౌరవం', 'భానుమతి', 'దూరపుకొండలు', 'జీవనది', 'స్వర్ణమంజరి' ముఖ్యమైనవి. దూరదర్శన్‌లో బాలల కార్యక్రమాలు ఎన్నో రూపొందించారు. బాలలకు కథలు చెబుతూ మనకు అనేక సార్లు దర్శనమిచ్చారు. పిల్లలకు కథ చెప్పడం వీరికి వెన్నతో పెట్టిన విద్య.

ఐదడుగుల ఆరంగుళాలు ఎత్తుగా నల్లని మొహంలో తెల్లని గడ్డంతో ఘల్లున నవ్వితే తెల్లగా ప్రకాశించే పళ్ళతో, ఏదో అన్వేషించే కళ్ళతో, ఖద్దరులాల్చి, నేతధోవతి, నాటుచెప్పులు ధరించి, ఆకర్షణ శక్తి ఉన్న విలక్షణ కంఠస్వరంతో, అందరిని ఆప్యాయంగా పలుకరించి, కలగలుపుగా సంభాషిస్తూ తిరిగే ఆయనను చూడగానే మనకు రవీంద్రనాథ్ ఠాగూర్ గుర్తొస్తారు. రావూరి భరద్వాజ గారి కథ 'విమల' లో చీకటి ద్రోహుల్ని సహించే సంఘం, ధర్మయుత జీవితాన్ని చూసి కొరకొకలాడే అలనాటి స్థితి నేపథ్యంలో బాల వితంతు వివాహాన్ని సమర్ధిస్తూ రాయబడింది.

బ్రతకటంకోసం ఆయన జీవితపు తొలిదశలో, వ్యవసాయకూలిగా, పసులకాపరిగా, తిత్తులూదే కుమ్మరికూలిగా, కంపోజర్‌గా పనిచేసారు. జీవితంలో ఏరచయితా అనుభవించని దారిద్ర్యాన్ని, పేదరికాన్ని అనుభవించారు. ఆ అనుభవాలు అతని కథలకు ముడి సరుకులయ్యాయి. గొప్ప కథకుడిగా నిలబెట్టాయి.

వీరు రాసిన నవలలో వీరికి విశేషంగా పేరు తీసుకొచ్చిన నవలలు రెండున్నాయి. అవి 'పాకుడురాళ్ళు', 'జీవనసమరం'. వీరు కథను రాయటంలోనే కాదు కథను చెప్పటంలో కూడా ఓ వినూత్న కోణం మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ముఖ్యంగా వీరు చిన్నపిల్లలకు కథచెబుతుంటే పిల్లలు వారి కండ్లలోకే చూస్తుండిపోతుంటారు.

"కాదేదీ కవితకనర్హం!" అన్నారు శ్రీశ్రీ. కథకుకూడా అనర్హమైనది ఏదీ లేదూ... అంటూ నిరూపించారు భరద్వాజగారు. బల్ల, పిల్ల, తూనీగ, దోమ, చిలకలతో చెప్పించారు కథలు. అందుకే ఆయన్ని కప్పగంతులవారు 'ఋషికాని ఋషి! శ్రామిక ఋషి! లౌక్యం తెలిసిన ఋషి!' అంటూ కొనియాడారు.


రచయిత చిరునామా

డా. రావూరి భరద్వాజ

'కాంతాలయం', 159/2 ఆర్.టి,

విజయనగర్ కాలనీ,

హైదరాబాద్ - 500057.



# రావి-ఎన్-అవధాని

**1935** సెప్టెంబర్ **30** వ తేదీన 'విజయనగరం'లో జన్మించిన నరసింహ అవధాని 'రావి-ఎస్-అవధాని' పేరుతో అనేకం కథలు తెలుగు సాహితీప్రియులకందించారు.

విజయనగరం మహారాజా కాలేజీలో బి.కామ్ డిగ్రీ పొంది, గరివిడి ఫెర్రో ఎల్లాయిస్ కార్పోరేషన్ లిమిటెడ్ (ఫేకర్), శ్రీరాంనగర్‌లో మెటీరియల్స్ మేనేజర్‌గా ఉద్యోగం చేసారు. ఉద్యోగ విరమణ అనంతరం స్వస్థలం విజయనగరంలో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు.

1951లో అంటే 'రావి-ఎన్-అవధాని' గారు తన 16వ ఏటనే 'చిత్రగుప్త' పక్షపత్రికలో 'బ్రతుకుతీపి' కథ ద్వారా కథా రచయితగా పాఠకులకు పరిచయమయ్యారు. ఆనాటి మేటి పత్రికలు ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, వినోదిని, స్వాతి, ఆంధ్రభూమి, జ్యోతి, కథాంజలి, కిన్నెర, ప్రజామాత, జాగృతి, సప్తగిరి, ఆనందవాణి మొదలగు వార, పక్ష, మాస పత్రికలలో 300కు పైగా కథలు, 50కవితలు, దిన, మాస పత్రికలలో 60 సాహిత్య వ్యాసాలు, నవలలూ, నాటికలూ ప్రచురించబడ్డాయి. వార పత్రికలలో పుస్తక సమీక్షలు అనేకం చేసారు. చక్కటి విమర్శనా వ్యాసాలు మనకు అందించారు.

రావి-ఎన్-అవధాని గారు బాల సాహిత్యంలో కూడా మంచికృషి చేసారు. బాలసాహిత్యంలో సుమారు 40 కథలు ప్రచురించబడ్డాయి. 'బాలజ్యోతి' మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైన పిల్లల నవల 'కర్ణుడు' పాఠకుల మెప్పుపొంది పుస్తక రూపంలో వెలువడింది. హైదరాబాదు దూరదర్శన్, ఆకాశ వాణి కేంద్రాల ద్వారా వీరి సాహిత్య వ్యాసాలు, ప్రసంగాలు అనేకం ప్రసారమయ్యాయి.

1995వ సం. లో 'బొమ్మలాంతరు' కథల సంపుటి, 2000సం॥లో 'రావి-ఎన్-అవధాని కథలు' పుస్తకరూపంలో తెలుగు పాఠకులకు అందిచగా రావి-ఎన్-అవధానికి ఆ రెండు కథా సంపుటాలు గొప్ప పేరు తీసుకొచ్చాయి. కేవలం తెలుగు భాష లోనే కాకుండా హిందీ, ఆంగ్ల భాషలలో కూడా కథలు రాసి మంచి పేరు సంపాదించారు అవధాని గారు. "ఫేకర్" మూడు భాషల్లో (తెలుగు, హిందీ, ఇంగ్లీషు) వెలువడుతున్న పత్రికకు సుమారు పదిసంవత్సరాలు సంపాదకునిగా సాహిత్య సేవలందించారు. 2000 సం. లో వీరికి మద్రాసు అకాడమీ ఉగాది పురస్కారం, అదే సం. లో హైదరాబాదులో 'బుచ్చిబాబు స్మారక' అవార్డులు లభించాయి.

నాటకరంగంలో ప్రవేశమున్న రావి-ఎన్-అవధాని ఆరంగంలో కూడా అనేక బహుమతులు సాధించారు. లయన్స్‌క్లబ్ బెస్ట్ ప్రెసిడెంట్, చార్టర్ ట్రెజరర్‌గా సమాజసేవ లందించిన 'రావి-ఎన్-అవధాని' ప్రముఖ కథారచయిత 'బులుసు-జీ-ప్రకాష్' గారికి 'కజిన్' అన్న విషయం చాలామందికి తెలియదు.


రచయిత చిరునామా
రావి-ఎన్-అవధాని
25-12-61, ఎల్.కె గార్డెన్స్,
దాసన్న పేట, విజయనగరం - 535002.



# రావిపల్లి నారాయణరావు

ప్రముఖ కథకుడు రావిపల్లి నారాయణరావు 1932 సం. ఆగస్టు 31న విజయనగరం జిల్లా 'రావిపల్లి గ్రామం'లో జన్మించారు. వృత్తిరీత్యా దక్షిణ మధ్య రైల్వే ఆఫీస్ సూపరింటెండ్‌గా పనిచేసి రిటైర్ అయినారు.

రావిపల్లి నారాయణరావు కథలు ఈనాడు ఆదివారం, ఆంధ్రప్రభ వారపత్రిక, ఆంధ్రభూమి మాసపత్రిక, ఇండియాటుడే వారపత్రిక, ప్రియదత్త వారపత్రిక, పల్లకి వారపత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. ఇప్పటివరకు సుమారు 80 కథలు పైగా రాసిన రావిపల్లి 'పెళ్ళాడి ప్రేమించు' కథా సంపుటి ప్రచురించి తెలుగు కథా ప్రియులకందిచారు.

రావిపల్లి రాసిన జీవితం 'ఒకనాటకం', 'కాకతాళీయం', 'స్వయంకృతం', 'కన్నీళ్ళు', 'గురుదక్షిణ', 'సమయోచితం', 'ఆశయానికి సంకెళ్ళు', 'ప్రతిఫలం', 'మారేకాలంలో మారని కథ', 'నన్ను భార్యగా స్వీకరిస్తారా?', 'ఇన్‌విజిలేటర్', 'హంతకుని పరిశోధన' లాంటి కథలు పాఠకుని పిలక పట్టుకొని చదివిస్తాయి. కథను కొంత దూరంనడిపి, అక్కడ నుండి ముడులు వేస్తూపోతారు. పాఠకుడి ఊహకు అందకుండా కథను నడిపి ఓ పెద్ద ముడితో కథను క్లైమాక్స్‌కు చేర్చి ముడి విప్పుతారు రావిపల్లి నారాయణరావు. వీరి కథనశైలి సూటిగా, సరళంగా వుంటుంది. అవసరమైనప్పుడు ఫ్లాష్‌బ్యాక్ పద్ధతిని వాడుకుంటూ కథను నడిపిస్తారు.

రావిపల్లి నారాయణరావు రాసిన చాలా కథలు స్వీయానుభవాలో, దగ్గరి వారివో కనుక, పాత్రలు మనకి తెలియకపోయినా అతి సన్నిహితులా... అన్న భ్రమకలిగిస్తాయి. రైల్వే శాఖలో పనిచేయటం వల్ల రైల్వే కూలీల, కార్మికుల కష్టసుఖాలు దెగ్గర నుంచి గమనించారు. స్పందించే హృదయమున్న రావిపల్లి , వారి కష్టసుఖాలు, ఆర్ద్రత కథల రూపంలో బంధించారు.

రావిపల్లి గార్కి తాను రాసిన అనేక కథలకు బహుమతులు లభించాయి. 1984లో ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక నిర్వహించిన రక్తాక్షి ఉగాది సస్పెన్స్ కథల పోటీలో 'అరకు లోయకథ' కథకు కన్సోలేషన్ బహుమతి, 1974లో దీపావళి కథలపై ఆంధ్రసచిత్ర వారపత్రిక నిర్వహించిన వ్యాస రచన పోటీలో ప్రథమ బహుమతి, 1961 ఉగాది సందర్భాన మద్రాసు ఆంధ్రకళా మండలి (దక్షిణ రైల్వే) నిర్వహించిన కథల పోటీలో రావిపల్లి వారి కథకే మొదటి బహుమతి లభించాయి.

రావిపల్లి కొంతకాలం ఈనాడు (సి.ఇ.బి) కథా విభాగంలో యిచ్చిన కథల్ని తిరగరాసారు. ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో పిల్లల కార్యక్రమంలో అనేక 'నాటికలు' రాసి ప్రసారం చేసారు. కథలు ఓ యజ్ఞంలా రాసే రావిపల్లి నారాయణరావుగారు కథా సంపుటాలు మరికొన్ని తీయాల్సిన అవసరముంది.

రచయిత చిరునామా
**రావిపల్లి నారాయణరావు**
ఇ.నెం.22-101, (ఓల్డ్ నెం. 22-67),
ఆర్.కె.నగర్, మల్కాజ్‌గిరి,
హైదరాబాద్ - 5000047.



# రావిపాటి ఇందిరా మోహన్ దాస్

'యునెస్కో' అవార్డు గ్రహీత శ్రీమతి రావిపాటి ఇందిరా మోహన్ దాస్ గారు 'గుంటూరు' పట్టణంలో పుట్టి, పెరిగి, విద్యనేర్చి గుంటూరులోని ప్రభుత్వ స్త్రీల కళాశాలలో రసాయన విభాగ ముందు డిమాన్‌స్ట్రేటర్‌గా పని చేసి ప్రస్తుతం విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఇందిర గారు ఎన్నో విలువైన కథలు రాసారు. ఆవిడ అశ్రద్ధ వలన ఎప్పుడో వెలుగు చూడవలసిన కథలు అచ్చురూపంలో పాఠకులకు అందించలేక పోవటం నిజంగా కథా ప్రియులకు లోటు. ఇటీవలె తన రచనలన్నీ అచ్చురూపంలో సంపుటాలుగా ముద్రించి ఆ లోటును తీర్చారు.

సాహిత్య విలువలు తగ్గి నైతిక విలువలు వలువలూడ్చు నేటి సమాజానికి తమ కథల ద్వారా చక్కని సందేశాన్నందిచారు. ఇటీవలకాలం లో రచయిత్రిగా సాహితీ శిఖరాలు అందుకోవటానికి ప్రయత్నిస్తున్నారు.

1999 సెప్టెంబరులో ఇందిర గారి కథల సంపుటి 'నింగి నేలను తాకింది' ప్రచురించారు. ఇందులో మొదటి కథ 'పద్మవిభూషణ్ మధుసూదనుని కథ'. నిజానికి వీరు రాసిన సైన్సు వ్యాసం "How to select the sex of the off spring" అన్న దానిని కథగా మార్చారు. స్త్రీ జీవితాన్ని ప్రయోగంగా తీసుకొని ఒక కుటుంబంలో ఇద్దరూ అబ్బాయిలు, ఇద్దరూ అమ్మాయిలే కాకుండా ఒక ఆడపిల్ల, ఒక మగపిల్లవాడు నిర్ణయం ప్రకారం పుట్టేవిధానాన్ని యోగులు రాసిన జెనిటిక్ గ్రంథాలు పరిశీలించి దానికి తగిన ఆలోచనా సరళిని జోడించి 'X', 'Y' క్రోమోజోముల ద్వారా ఒక ఆడ, ఒక మగ పిల్లవాడు పుట్టగల జన్మరహస్యాన్ని సూచిస్తూ వినూత్న ప్రయోగం చేసారు రచయిత్రి ఇందిర. తీర్పు, వేడిపండు, నింగినేలను తాకింది, ఆశయాలు- ఆకర్షణలు, మనసులో తుల్లోకి, నీరజ, అందిన స్వర్గం, తస్మాత్! అమ్మాయిలు జాగ్రత్త కథలు కూడా వినూత్న కథా వస్తువులతో సరిక్రొత్త ప్రయోగాత్మక కథలుగా గుర్తించబడ్డవే!

1999 జనవరిలో వైవిధ్యభరితమైన గీతికల సంపుటిని 'ఉద్భేద' అనే పేరుతో ప్రచురించారు. 'వేంనరికం' నవల విజ్ఞానదాయకము, మనో విశ్లేషణతో కూడిన నవలగా సాహిత్యకారులతో గుర్తించబడింది. అలాగే ఇందిర రాసిన నవల 'జీవనగంగ' ఉదాత్త చరిత్ర గల భార్యా భర్తల సొధ. సూక్ష్మంగా ఇది నవలాకథాకథనం. త్వరలో మరో కవితా సంకలనాన్ని అచ్చులోకి తీసుకురాబోతున్న వీరి అముద్రిత రచనలుగా రసాయనం, చదరంగం, అతీతబంధం, మొదలైనవి మిగిలిపోయాయి. వీలువెంటనే వీటిని వెలుగు లోకి తీసుకురావాలని మనమంతా ఆశిద్దాం! ఎప్పటికప్పుడు విజ్ఞానదాయకమగు విషయాలు తెలుసుకునే అభిరుచి, సాహిత్యమంటే ఎనలేని మక్కువున్న రావిపాటి ఇందారా మోహన్ దాస్ గారికి ఇది ఏమంత కష్టతరంకాదు.

రచయిత్రి చిరునామా
రావిపాటి ఇందిరా మోహన్ దాస్
చంద్రమౌళి 1వ లైను,
గుంటూరు.



# వాసాల నర్సయ్య

**1947** జనవరి **26**న కరీంనగర్ జిల్లా 'చేలపద్ది' గ్రామంలో జన్మించిన ప్రముఖ కథకుడు 'వాసాల నర్సయ్య' వీరు వృత్తిరీత్యా కరీంనగర్ హెడ్ పోస్ట్ మాస్టర్‌గా రిటైర్ అయి ప్రస్తుతం కథా రచనలతో కాలక్షేపం చేస్తున్నారు.

తెలంగాణా ప్రాంతానికి చెందిన వాసాల నర్సయ్యగారు ఆ ప్రాంత ప్రజల కష్టాలు, సమస్యలు, జీవన విధానాలు పేదల కన్నీళ్ళు చూసి స్పందించి తన కలం ద్వార కథలు అల్లుతూ ఆ సమస్యలుకు పరిష్కార మార్గాన్ని చూపుతున్నారు. వీరు కేవలం కథకులే కాదు కవి కూడా...! వీరికి సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోనూ ప్రవేశముంది.

చిన్న పిల్లలకు కథలు చెప్పటమన్నా, వారికోసం కథలు రాయాలన్నా ప్రత్యేక శ్రద్ధ చూపిస్తారు వాసాల నర్సయ్యగారు. వీరికథలు ప్రచురించబడని పిల్లల పత్రికలేదు. బొమ్మరిల్లు, బాలమిత్ర, బుజ్జాయి, బాలజ్యోతి, బాలభూమి, ఆంధ్రభూమి వార పత్రిక, తదితర పత్రికల్లో పిల్లల కథలు విరివిగా వీరివి ప్రచురించబడుతుటాయి. మనకున్న అతికొద్ది బాలసాహితీ మూర్తులలో ముఖ్యులుగా "వాసాల నర్సయ్య" గార్ని చెప్పుకోవటం అతిశయోక్తి కాదు.

పెద్దల కోసం సాంఘిక కథలు జాగృతి, స్రవంతి, యోజన, సైనిక్ సమాచార్, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి పత్రికల్లో కథానికలు రచించి తెలుగు సాహితీ ప్రియుల ప్రశంసలు అందుకున్నారు.

వాసాల నర్సయ్య వృత్తిరీత్యా తను పనిచేసిన తపాల శాఖ కార్మికుల సమస్యలు, జీవితాలు, కష్టాలను ఆధారంగా చేసుకొని కథలు రచించి భేష్ అనిపించుకున్నారు.

కథా రచనతో పాటు కవితా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న వారు అనేక కవితా సంపుటాలు ప్రచురించారు. 1978 సం. లో 'కర్షకుడా! కార్మికుడా!!' గేయసంపుటి, 1982 సం.లో 'ఈ దేశం' కవితాసంపుటి, 1984 సం.లో తపాల ప్రపంచం గ్రంథం, 1989 సం.లో 'గమ్యం' కవితా సంపుటి, 1972 సం.లో 'సమాజానికి సంకెళ్ళు', 1995 సం.లో 'శ్రమగీతం' కవితా సంపుటిలు ప్రచురించి పాఠకులకు అందించారు.

తెల్లకాగితాన్ని తన కలంతో నల్లగా మార్చే వాసాల నర్సయ్యగారు ఒకచోట కాగితం విలువ గురించి ప్రస్తావిస్తూ .... "పెంట కుప్పల్లోంచి చెత్త కుండిల్లోంచి, మురుగు కాలువల్లోంచి, మురికి కూపల్లోంచి, సందుల్లోంచి, గొందుల్లోంచి, సంచివీపున వేసుకొని చిత్తుకాగితాల్ని ఏరుకుంటున్న పోరగానికి ఏం తెలుసు కాగితం విలువ.... కాగితం మీద కవనాలు వెలుస్తాంయి! కల్పనలు రూపుదిద్దు కుంటాయి!" అని అంటారు.

ఆకాశవాణి 'హైదరాబాదు', 'నిజామాబాదు', 'అదిలాబాదు', 'వరంగల్' కేంద్రాల నుండి వీరి కథానికలు, కవితలు విరివిగా ప్రసారమవుతుంటాయి. 'కార్యాలయం కబుర్లు', 'తపాల కార్మికోద్యమ చరిత్ర', అనే గ్రంధాలతో పాటు 'వాసాల నర్సయ్య కథలు' కథా సంపుటి త్వరలో ప్రచురించనున్నారు. వృత్తి, ప్రవృత్తిలకు న్యాయం చేకూరుస్తున్న వాసాల నర్సయ్య అభినందనీయులు.


రచయిత చిరునామా
వాసాల నర్సయ్య
డో.నెం. 2-1-110, రామ మందిర్‌రోడ్,
మెట్‌పల్లి, కరీంనగర్ -505325



# కె. వాణీప్రభాకరి

"సాహిత్యము మనిషి జీవితంలో ఏవయస్సులోనైనా ప్రశాంతినిచ్చి నీడలా వెన్నంటి ఉండి బ్రతుకు బాటలో సుగంధ పరిమళాలు అందిస్తుంది" అని తన అభిప్రాయం వ్యక్తం చేస్తారు రచయిత్రి కె. వాణీప్రభాకరి.

'తణుకు' ప్రాంతానికి చెందిన ప్రభాకరి ఇప్పటివరకు దాదాపు అన్ని పత్రికల్లోనూ కథలు వ్రాశారు. అయితే కథా రచయిత్రిగాకన్నా డ్రెస్‌డిజైనర్‌గా, జర్నలిస్ట్‌గా, వీణా మరియు ఓకల్ ఆర్టిస్ట్‌గా, ఇంటీరియర్ డిజైనర్‌గా బాగా గుర్తింపు పొందారు. దాదాపు అన్ని కళల్లోనూ ప్రవేశమున్న వాణీప్రభాకరిగారు, ఇప్పటి వరకూ 24 కథలు రాశారు. ఈ కథలన్నీ ప్రముఖంగా వివిధ పత్రికలలో ప్రచురింపబడినవే!

వాణీ ప్రభాకరిగారు తన రచనల్లో కథల కంటే ముఖ్యంగా దైనందిన జీవితాలకి అవసరమైన అంశాలను వ్రాయడానికి మక్కువ చూపుతారు. విజేత, వనిత, వనితాజ్యోతి, కలువబాల, ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్ర జ్యోతి, ఆంధ్ర భూమి, వార్త, పల్లకి, స్రవంతి, బాలరంజని మొదలగు దిన, వార, పక్షపత్రికలద్వారా వీరివి 4,823 ఆర్టికల్స్ ప్రచురింపబడడం విశేషం! మరో ఐదు పుస్తకాలు ప్రచురణకు సిద్ధంగా ఉంచారు. ఇందులో వంటింటివి మొదలుకొని హస్తకళలువరకు ఉన్నాయి. సుమారు 350 కిపైగా వివిధ చిత్రాలు, 500 పైగా ఎంబ్రాయిడరీ ఆర్టికల్స్ తయారుచేసిన ప్రభాకరి గారు ఇప్పటి వరకు సమారు 230 పైగా కవితలు రచించారు.

"ఏ యుగంలోనైనా మంచి మార్పు తెచ్చేవి కేవలం రచయితల కలాలు మాత్రమే. అందుకు సంపూర్ణ సహకారం అందించేవి పత్రికలే!" అనే వాణీ ప్రభాకరి గారు ఎం.ఏ., ఇంగ్లీషు చదివారు. తాను ఒక రచయిత్రిగా జీవించాలనే దృఢ సంకల్పంతో పుస్తక పఠనంలో ఆసక్తి పెంచుకొని బాలల పుస్తకాలు వందలకొద్దీ చదివారు. లైబ్రరీయే అసలు విశ్వవిద్యాలయం, ఒక గురువు కూడ నేర్పించని విద్య పుస్తకం నేర్పిస్తుందని అభిప్రాయపడతారు.

వాణీప్రభాకరిగారు అన్నిరంగాల్లోనూ లెక్కకు మించి బిరుదులు వివిధసంస్థల నుండి అందుకున్నారు. వీరు రచించిన 'జీవన సమరంలో సంధ్యారాగం' నవలకు రాష్ట్ర మనోరంజని అవార్డు, ఎన్.టి.ఆర్. అవార్డులు అందుకున్నారు. "బాలబంది పాటలతో పసిపిల్లలా, శేషేంద్ర కవితలకు స్ఫూర్తిగా, సంజీవదేవ్ చిత్రాలకు ఊపిరిగా, సినారె గజల్స్ వింటూ, అన్నమయ్య సాహితీ పదాల బాణిని జీవితంలో అన్వయిస్తూ రేపటి తరానికి ఒక సాహికిరణంగా రూపొందడమే నాజీవిత లక్ష్యం" అంటారు వాణీ ప్రభాకరి.

శ్రీమతి వాణీ ప్రభాకరి గారు "రచయితలకు పత్రికలే అభిమాన పుత్రికలు-రేపటి తరానికి మంచి సందేశమిచ్చే వారసులు" అంటారు. వీరి కథల్లో ఇతివృత్తం, పాత్రలు, శిల్పం మొదలైనవన్నీ కొత్తగా కనిపిస్తాయి. అవే వీరి విజయానికి కారణాలు. స్త్రీ పాత్రలతో రాసిన కథలు చదివి అనేకమంది స్త్రీ పాఠకులు తమని తాము ఐడెంటిఫై చేసుకుని వారి కష్టాలకు కన్నీరు కార్చారు. జీవన పోరాటంలో మనషుల మమతలు, సుఖదుఃఖాలు ఆమె కథల్లో అంతటా కనిపిస్తాయి.


రచయిత్రి చిరునామా

కె. వాణీప్రభాకరి

ఇ.నెం. 34-93, విడులాన్ స్ట్రీట్,

తణుకు - 534 211.





# వాడ్రేవు రమాదేవి

"అన్ని కళల కన్నా జీవించటం గొప్ప కళ అనీ, దాన్ని సాఫల్యం చేసుకుంటే కళల సాఫల్యం జరుగుతుందని నమ్మే వ్యక్తిని నేను" అంటారు తూర్పుగోదావరి జిల్లా 'రాజోలు'కు చెందిన వాడ్రేవు రమాదేవి.

1983 సం.లో కలం పట్టిన రమాదేవి గారు మొదట కవితాప్రక్రియను చేపట్టి ఎన్నో విలువైన కవితలు పాఠకులకందించారు. ఆ తరువాత 1984సం.లో కథా రచన ప్రక్రియకు శ్రీకారం చుట్టి, కథా రచయిత్రిగా స్థిరపడి ఆ ప్రక్రియలో మంచి పేరు సంపాదించారు. 1984 సం.లో విశ్వసాహితి, హైద్రాబాద్ సంస్థవారు నిర్వహించిన దీపావళి కథల పోటీలో 'జీవిత సంధ్యా సమయంలో' అన్న కథకి తొలి సారిగా మొదటి బహుమతి అందుకున్నారు.

వాడ్రేవు రమాదేవి కథలు అన్ని ప్రముఖ పత్రికల్లోనూ ప్రముఖంగానే ప్రచురించబడ్డాయి. ఆంధ్రప్రభ, వనిత, ఆంధ్రజ్యోతి, విశ్వసాహితి, రచన, జాగృతి, ఆంధ్రప్రదేశ్ వంటి పత్రికల్లో వీరి కథలు విరివిగా ప్రచురించబడుతున్నాయి.

1985 సం.లో సాహితీ విద్యాలయ, విశ్వసాహితి వారి ఆధ్వర్యంలో నిర్వహించిన కవితల పోటీలో ప్రథమ బహుమతి, ఆంధ్ర ప్రదేశ్ నవరచయితల సభల కథల పోటీల్లో ఉత్తమ కథా బహుమతి పొందారు. ఆనాటి ఆంధ్ర ప్రదేశ్ అయిదవ నవ రచయితలసభలకి అధ్యక్షురాలిగా ఎన్నిక కాబడటం విశేషం.

కథా, కవితా ప్రక్రియలతోపాటు నవలా ప్రక్రియలో కూడా ప్రవేశమున్న రమాదేవిగారు 'కృష్ణా పత్రిక' లో 'జ్యోతిర్మయి' అన్న నవలను సీరియల్‌గా అందిదారు. 'జ్యోతిర్మయి' నవల ముఖ్యంగా మహిళా పాఠకులను విశేషంగా ఆకట్టుకుంది. దీంతో... రమాదేవిగారు రాష్ట్రవ్యాప్తంగా ఎందరో మహిళా పాఠకులను అభిమానులుగా పొందారు. ఆ తరువాత అదే పత్రికలో రెండు నవలలు వీరివి ప్రచురించబడ్డాయి.

సోమేశ్వర సాహితీ ట్రస్టు, విశాఖపట్టణం వారు నిర్వహించిన కథల పోటీల్లో వరుసగా రెండు సంవత్సరాలు వీరికథలు ఎన్నిక కాబడ్డాయి. రాష్ట్రస్థాయి కవితల పోటీల్లో 'సావిత్రి స్మారక అవార్డు' కళాసాహితీ, కొత్తపట్నం వారిచే, వికారాబాద్‌లోని సాహితీ సంస్థ వారిచే, 'ఎక్స్‌రే' సంస్థవారు నిర్వహించిన కవితల పోటీల్లోనూ బహుమతులు లభించాయి. "తెలుగు కథ ఎంతో దూరం నడిచింది. ఎందరో దానికి తోడు నడిచారు" అన్న విహారి గారి మాటలు వాడ్రేవు రమాదేవి లాంటి రచయిత్రులకు అక్షరాలా సరిపోతాయి. కథ కోసం ఖచ్చితంగా ప్రతి రోజు కొంత సమయాన్ని వినియోగిస్తారు రమాదేవి.

రచయిత్రి చిరునామా
వాడ్రేవు రమాదేవి, W/O వి. అప్పయ్య పంతులు, అడ్వకేట్, రాజోలు - 533242. తూ.గో. జిల్లా.

# వేదగిరి రాంబాబు



సాహిత్య ప్రక్రియలన్నిటిలో ప్రవేశమున్న వేదగిరి రాంబాబు గారికి 'కథానిక' ప్రక్రియ అంటేనే ఎంతో మక్కువ. వీరి జనప్రియమైన 'మంచిమాటల్లో', "కథను పాజిటివ్‌గా తీసుకొస్తే నెగిటివ్‌గా ఎండ్ చేయండి. నెగిటివ్‌గా ప్రారంభిస్తే పాజిటివ్‌గా ముగించండి" అంటారు.

వీరి సాహితీ గురువులు ప్రముఖ కథారచయిత 'విహారి' గారు. రాంబాబు గారు కాలమ్ కథలు, కార్డు కథలు, ఇన్‌లాండ్ కవర్ కథలు, పేజీకథలు, చిన్ని కథలు, పెద్ద కథలు – ఇలా రకరకాల పరిణామాలలో కథలు రాసారు. అలాగే ఒక కాలమ్‌కి సరిపోయే కథల్ని 'కాలమ్ కథలు'గా రాసి, సంపుటి ప్రచురించారు. మామూలుగా ఒక కాలమ్‌కి సరిపడే కథల్ని రకరకాల టెక్నిక్స్‌తో రాసారు. ఆ కాలమ్‌లో మూడు ఉత్తరాలుండేవి. మూడు ఉత్తరాలతో కథ పూర్తవుతుంది. మొదటి ఉత్తరంలో ఎత్తుగడ, రెండవ ఉత్తరంలో కథనడుస్తోంది, మూడవ ఉత్తరంలో కొసమెరుపు. ఇవి 'ఉత్తరాళ్ళ కథలు' అని జ్యోతి మాస పత్రికలో కొన్నాళ్ళుగా వచ్చాయి.

రాంబాబుగారు కథానికలోనే అనేక కొత్త కొత్త టెక్నిక్స్ ఉపయోగిస్తుంటారు. 'పేజీ కథలు' పరిశీలిస్తే వారపత్రికలో సరిగ్గా పేజీకి సరిపోతాయి. ఈ కథల్లో చివరి పేరా ముఖ్యం. ఇవన్నీ సెటైర్స్. అందుకని పేజీ కథల్ని 'పేచీ' కథలుగా ప్రచురించారు. ఈ సంపుటికి పే(జీ)చీ కథలని పేరు పెట్టారు.

వేదగిరి రాంబాబు 'గొలుసు కథలు' కూడా రాసారు. ఒకే కథను మొదటగా నలుగురు రచయితలు అనుకుని నలుగురూ కల్సి ఆ కథను నాల్గు భాగాలుగా రాసేవాళ్ళు. ఈ కథలసంపుటికి 'కస్తూరి' అని పేరి పెట్టి తెలుగు పాఠకులకు అందించారు. పాఠకుడి ఊహకు అందకుండా కథను నడిపించడం వీరి ప్రత్యేకత.

రాంబాబుగారు కొన్ని సంవత్సరాల నుంచి రాష్ట్రవ్యాపితంగానే కాదు దేశ వ్యాపితంగా కూడా ఎన్నో కథా సదస్సుల్ని నిర్వహించి, అన్ని వాదాల రచయితల్ని ఒకే వేదిక మీదికి తీసుకొచ్చి కథా పరిణామం కోసం చర్చలు జరిపారు. సీనియర్, జూనియర్ రచయితలందర్నీ ఏరి, కోరి కొత్తకథలు రాయించి 116 కొత్త కథలతో మూడు డైరెక్ట్ కథాసంపుటాల్ని 'వేదగిరి కమ్యూనికేషన్స్' పేరిట తెచ్చారు. ఏటా తెలుగులో రకరకాల పత్రికల్లో వచ్చే అన్నికథల్ని, సమీక్షింపజేస్తూ ఏటా కథా సమీక్షా సంపుటాల్ని ప్రచురిస్తూ వస్తున్నారు.

1999 ఫిబ్రవరి 14 నుండి 28 తేదీ వరకు రాష్ట్రసాంస్కృతిక మండలి, రాష్ట్రయువజన సర్వీసుల శాఖ సహకారంతో హైదరాబాదులో రాష్ట్రస్థాయిలో నిర్వహించిన నవరచయితల అధ్యయన శిబిరం – కథానికకు కన్వీనర్‌గా వ్యవహరించి, అభ్యర్థులకు కథానిక గురించి పూర్తి అవగాహన కల్పించారు. 'కథ' కోసం ఇంటిని, వంటి మీది నగలునూ కరిగించి సమీక్షలు, కథా సంపుటాలు, సభలు, సమావేశాలు నిర్వహించిన గొప్ప కథకుడు వేదగిరి రాంబాబు.


రచయిత చిరునామా
వేదగిరి రాంబాబు
1-8-481, చిక్కడపల్లి,
హైదరాబాదు - 500020.



# వియోగి

**28-7-1952**లో 'తెనాలి'లో జన్మించిన కోపల్లి విజయప్రసాదు 'వియోగి' పేరుతో సుమారు 100కు పైగా కథలు అందించారు. వృత్తిరీత్యా మార్కాపురం ఎల్.ఐ.సిలో ఏ.ఓగా పనిచేస్తూ ప్రవృత్తిరీత్యా చక్కటి కథలను పాఠకలోకానికి అందించటం తెలుగు పాఠకుల అదృష్టం.

ప్రముఖవార, మాసపత్రికలన్నింటిలో వియోగి కథలు ప్రచురించబడ్డాయి. కొన్ని కథలు కన్నడంలో అనువదించబడ్డాయి. మరెన్నింటికో బహుమతులు లభించాయి.

వీరి కథ 'వినరా' లో కుహనారచయితల కీర్తికండూతిపై, మారిన మన అభిరుచుల పై హాస్యోక్తిగా... తన నాటకం రేడియోలో ప్రసారం అవుతుందని, స్నేహితులకు బంధువులకు ఉత్తరాలు రాయడం దగ్గర నుంచి, ఆఫీసులో పార్టీ ఇవ్వటం వరకు హడావిడి చేస్తే తీరా అసలు సమయానికి కరెంటు పోతుంది. ఆ తరువాత తెలిసిందేమిటంటే ఆ నాటకం స్థానంలో క్రికెట్ కామెంటరీ వేసారని... చక్కటి కొసమెరుపుగల కథ.

కథారచనతోపాటు రేడియో నాటికలు, కవితలు, నవలా సాహిత్యంలో కూడా ప్రవేశమున్న వియోగికి 'ప్రియా ఓ ప్రియా' నవల గొప్ప పేరు తీసుకొచ్చింది. రేడియో నాటికల పోటీల్లో 'విలువలు' నాటకానికి జాతీయ బహుమతి లభించింది. ఈ నాటకం అన్ని భాషల్లోకి అనువదించబడి ప్రసారం చేయబడింది. వివిధ రేడియో కేంద్రాల ద్వారా ఇప్పటివరకు పాతికపైగా రేడియో నాటికలు, నాటకాలు ప్రసారమయ్యాయి.

'విహారి', 'హితశ్రీ', 'శ్రీరాగి' గార్లు వీరి సాహితీ గురువులని చెబుతుంటారు వియోగి. మంచి పుస్తకాలన్నా, మంచి స్నేహితులన్నా ఇష్టపడే వియోగి బాల్యంలో హితశ్రీ గారి రచనలు, శ్రీరాగి గారి రచనలు చదివి స్ఫూర్తి పొందారు. ఉద్యోగరీత్యా విహారిగారితో పరిచయం ఆ కోరికకు బలాన్ని ఇచ్చిందని నిర్మొహమాటంగా చెప్పుకునే వియోగి నిజానికి తెలుగు పాఠకులకు గొప్పకథలే అందించారు. 'పిచ్చితల్లి' కథలో... తల్లి ప్రేమను చూపిస్తారు. తల్లి నిర్లక్ష్యానికి గురవుతుంది. మానవ మాత్రురాలిగా శోకాన్ని బయటపెడుతుంది. కొడుకు కలెక్టరై తల్లి దండ్రులకు దూరంగా వెళ్ళి, బాధ్యతల్లో చిక్కుకు పోతాడు. తల్లిదండ్రులను దాదాపు మరిచిపోయాడు. తన కొడుక్కి ఆపరేషన్ చేయాల్సి వచ్చినపుడు విలవిలలాడతాడు. మరోసారి తల్లిని నిర్లక్ష్యం చేసిన ఇద్దరు కొడుకులను దండిస్తాడు. తల్లిని నిర్లక్ష్యం చేయరాదని చెపుతాడు. కొసమెరుపు అద్భుతంగా ఇవ్వటంలో విజయం సాధించారు వియోగి.

వ్యక్తుల్లో పడిపోతున్న నైతిక విలువల గురించి ఆందోళన కలుగుతుదంటారు వియోగి. "రచనలుచేసి సమాజాన్ని చెడ గొట్టకూడదని ఉద్ధరించకపోయినా...!" అని అంటారు. ఇదే అతని ఆశయం కూడా! కథను సామాజిక ప్రయోజనానికి మానవతా విలువలను రేకెత్తించడానికి వీలైనంత ఎక్కువగా ఉపయోగించుకునే వియోగి కొన్ని కథా సంపుటాలు త్వరలో వెలుగు చూపాలన్న ఆలోచనతో ఉన్నారు. అలాగే అముద్రితంగా వున్న వీరి మూడు నవలలు కూడా త్వరలో పాఠకులకు అందిస్తారని కోరుకుందాం.


రచయిత చిరునామా

**విజయప్రసాద్**

ఎల్.ఐ.సి. ఆఫ్ ఇండియా,

మార్కాపూర్ - 523 318.

# శాంతి నారాయణ



అనంతపురం జిల్లా కథారచయితల్లో ప్రముఖులు డాక్టర్ శాంతి నారాయణ. **1946** జులై 1న అనంతపురం జిల్లా సింగనమల మండలం 'సి. బండమీద పల్లె' లో జన్మించిన శాంతి నారాయణగారు వృత్తిరీత్యా తెలుగు ఉపన్యాసకులు.

ఇప్పటి వరకు మొత్తం 32 పైగా కథానికలు రాసారు. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్ర భూమి, ప్రజాసాహితి, ఉపాధ్యాయం, ఆహ్వానం, రచన, నేత్రం, విపుల, ఉదయం, మా భూమి వంటి దిన, వార, మాస పత్రికల్లో వీరి కథలు ప్రముఖంగా ప్రచురించబడ్డాయి.

1992 సం.లో 'రక్తపు ముద్ద పిలిచింది' అనే కథా సంపుటి ప్రచురించారు. ఈ కథాసంపుటి కేవలం అనంతపురం జిల్లా పాఠకులనే కాదు, రాష్ట్రనలుమూలల వున్న తెలుగు కథా ప్రియుల మన్ననలు అందుకుంది. ఇందులోని కథలు అన్నీ ప్రత్యేక ఇతివృత్తాలు కలిగి పాఠకుల పిలక పట్టుకుని చదివించే తనదైనశైలిలో అక్షరాలు నిర్మించారు. 1979లో 'రస్తా' కథల సంపుటి, అదే విధంగా 1999సం. లో 'పల్లేరు ముల్లు' కథల సంపుటిని ప్రచురించి తన సాహిత్యాన్ని భద్రపరచుకున్నారు. ఈ కథలన్నీ ముందుతరం యువకథకులకు, పాఠకులకు కానుకలనే చెప్పవచ్చు. ముఖ్యంగా రాయలసీమ పరిస్థితులను ప్రతిబింబిస్తూ వారు రాసిన 'స్పర్శ' 'గర్భస్రావం' కథలు తప్పక చదవాల్సినవి.

1999సం.లో విడుదల చేసిన 'పల్లేరుముల్లు' కథలసంపుటి అప్పటి రాష్ట్ర ఉన్నత విద్యాశాఖామాత్యులు శ్రీమతి కె. ప్రతిభా భారతి గారిచే ఆవిష్కరించబడింది. కథా రచనతోపాటు నవలా, కవితా ప్రక్రియల్లో కూడా ప్రవేశమున్న శాంతి నారాయణ 1981 సం.లో 'మాధురి' నవల, అప్పటి మంత్రివర్యులు శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారిచే ఆవిష్కరించబడటం విశేషం. 1970లో 'కళ్యాణవాణి', 1979లో 'నడిరేయి నగరం' కవితాసంపుటాలు ప్రచురించారు.

1976 నుండి 78 వరకు 'వెలుగు' లిఖిత మాసపత్రికను 'రాయదుర్గం' నుండి నిర్వహించారు. 1988లో విశాలాంధ్ర బుక్‌హౌస్ వెలువరించిన స్వతంత్ర భారత స్వర్ణోత్సవ 'సావనీర్' కు సంపాదకత్వం వహించారు. 1976 నుండి 1986సం. వరకు చైతన్య కళాభారతి, రాయదుర్గం సంస్థకు వ్యవస్థాపక అధ్యక్షులుగా ఉన్నారు. 1989 నుండి నేటి వరుకు అనంతపురం జిల్లా కథా రచయితల సంఘం కార్యదర్శిగా బాధ్యతా నిర్వాహణ చేపడుతున్నారు. అనేక సాహితీ సంఘాలలో ప్రాతినిధ్యం వహించిన వీరికి లెక్కకు మించి బహుమతులు, అవార్డులు లభించాయి.

1999 మార్చి, 7 అనంతపురం డిగ్రీ కళాశాలలో అప్పటి రాష్ట్ర ఉన్నత విద్యాశాఖా మాత్యులు శ్రీమతి కె. ప్రతిభా భారతి ఘనంగా వీరిని సన్మానించారు.

రచయిత చిరునామా
డా. శాంతి నారాయణ
6-1-677, కోవూర్ నగర్,
అనంతపురం - 515004.





# శ్రీ విరించి

"నాకు నచ్చే కథ ఇంకా రాయలేదు. చాలా కథలకు నాకు పారితోషికంకూడా రాలేదు" అని నిర్మొహమాటంగా చెప్పుకొనే ప్రముఖ కథారచయిత 'శ్రీవిరించి'. వీరు 14 ఫిబ్రవరి 1935న 'విజయవాడ'లో జన్మించారు. 'శ్రీవిరించి' అసలు పేరు ఎస్.సి. రామానుజాచారి. 'శ్రీవిరించి' వీరి కలం పేరు.

శ్రీవిరించి తన 16 ఏళ్ళ వయసులో అంటే 1951లో తొలికథ '■ాలి విసురు' అచ్చులో చూసుకున్నారు. వీరు వృత్తిరీత్యా మద్రాసులోని 'థియోసాఫికల్ కాలేజీ' లెక్చరర్గా పనిచేస్తున్నారు.

శ్రీవిరించి గారికి మంచి పేరును తీసుకొచ్చిన కథల్లో 'ఎదురు చూడని మార్పు', 'అర్థం', 'కారనికన్నీరు', 'పుత్రోత్సాహం', 'మెట్లులేని నిచ్చెన', 'దూరంలేనిప్రయాణం', 'పర్వతగర్భం', 'దూరంగాపోతారని', 'అనుభవం', 'ఆకాశాత్ పతితం తోయం', 'అభోగి', 'కనకపుగుట్టు' మొదలైనవి.

శ్రీవిరించిగారి చాలా కథలు ఆంగ్ల భాషలోకి అనువదించబడ్డాయి. వీరు కొన్ని కథాసంపుటాలు పాఠకులకు అందించారు. 'మధ్యమవతి', 'కొత్త నక్షత్రం' (1982), 'అర్థం', 'కారనికన్నీరు', 'మెట్లులేని నిచ్చెన'(1995), 'కనకపుగట్టు' (1997), 'గంధపు చెక్క'(2000), కథాసంపుటాలు తెలుగులో వెలుగుచూడగా, 'సెవెన్ బోన్స్'(1991) ఆంగ్లంలో వెలుగు చూసింది. 'మన రచన మనకు స్టేటస్ తీసుకురావాలిగాని, బిరుదులు, హోదాలు కాదు!' అని మనఃపూర్తిగా నమ్మిన శ్రీవిరించి 'నా కథల్లో ఎక్కువగా అధి భౌతిక కథలు ఉంటాయి. మామూలు పాఠకులకు ఆదరించబుద్ధి కాదు. అగమ్య గోచరంగా వుంది, రచయిత ఏంచెప్తున్నాడు? అని ప్రశ్నలు వేసుకొని రచయిత' అని తన కథలపై రాసే తీర్పు చెప్తూనే ఉంటారు' అని చెప్పుకున్నారు.

శ్రీవిరించి రాజనీతి శాస్త్రంలో ఎం.ఎ. చదివారు. 'మతము - వేదాంతము' అన్న అంశముపై తులనాత్మక పరిశోధన చేసి డాక్టరేట్ పొందారు. కేంద్ర సాహిత్య అకాడమీ నేషనల్ బుక్ట్రస్ట్ వారి కోసం అనేకసాహిత్య, సాహిత్యేతర గ్రంథాలను అనువదించారు. తన కథలనే కాక, ఇతరుల కథల్నికూడా ఆంగ్లంలోకి అనువదించి గ్రంథరూపంలో ప్రచురించారు. భారత ప్రభుత్వంవారు వీరికి పలుసార్లు, సీనియర్ఫెలోషిప్ అవార్డు బహూకరించారు.

బుద్ధిజీవులు, హృదయ జీవులు, భోగ జీవులు అన్న మూడు రకాల జీవుల్లో శ్రీవిరించి నామంతో కథలు రాసే డాక్టర్ ఎస్.సి. రామానుజాచార్యులవారు నిస్సందేహంగా బుద్ధి జీవి. "బుద్ధిజీవులది ఆలోచన, హృదయజీవులది అనుభూతి, శ్రీవిరించి కవితా సంపుటి 'ఆలోచనల గొడుగు'. ముందు మాటలో సంజీవదేవ్" అంటారు.

ప్రచారానికి ఏ మాత్రం విలువ ఇవ్వని శ్రీవిరించి పత్రికల్లో తన గురించి ప్రచురించటం ఏ మాత్రం ఇష్టపడరు. కానీ, వీరి గురించి నేటి యువ కథకులు తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.


రచయిత చిరునామా
డా. ఎస్.సి. రామానుజాచారి
(శ్రీవిరించి)
బీసెంట్గార్డెన్స్,
ది థియసాఫికల్ సొసైటీ,
అడయార్, చెన్నై - 600 020



# శ్రీ రాగి

**2-3-1927** గుంటూరు జిల్లా 'బాపట్ల'లో జన్మించిన కోపల్లె పూర్ణచంద్ర సదాశివ సుబ్రమణ్యేశ్వరరావుగారు 'శ్రీరాగి' పేరుతో కథారచనలు అందిస్తున్నారు.

ఉద్యోగరీత్యా వైద్యశాఖలో . కర్నూలు మెడికల్ కాలేజీలో 'లేసెక్రెటరీగా' పని చేసారు. 'అధికారం-అంధత్వం' 1969లో, ఓహెన్రి కథలుఅనువాదం, 1992లో, 'బదిలీ' 1989లో కథలు కథాసంపుటాలుగా ప్రచురించబడ్డాయి. ఇంకా అనేక అనువాద కథలు విపుల మాస పత్రిక 'శ్రీరాగి'వి ప్రచురించబడుతున్నాయి.

1956నుండి ఇప్పటి వరకూ సుమారు 150 కథలు వీరివి ప్రచురించబడ్డాయి. ఇంకా కొన్ని కథానికలు ఆకాశవాణి కడప, ఆకాశవాణి కర్నూలు కేంద్రాల నుండి ప్రసారమయ్యాయి.

'శ్రీరాగి' గారు వాస్తవిక విషయాలను తాను తన కథలలో అద్దంలో చూపించినట్లుగా చూపించగల అసలు సిసలైన రచయిత. వీరు 60 ఆంగ్ల కవితలను చక్కటి, చిక్కటి తెలుగు పదాలతో తెలుగులో 'బ్రతుకువరం' పేరిట అనువదించారు. వీరి అనువాదం మూల కవితలకు మెరుగు దిద్దేదిగా వుంది. ఆంగ్ల భాషలోని కొన్ని క్లిష్టమైన పదాలను, భావాలను కూడా 'శ్రీ రాగి' వారు అతి సులభంగా హృద్యంగా చెప్పగలగడం వారి అను వాద పటిమకు తార్కాణం.

శ్రీరాగి మొదటి కథ 'గుమాస్తా' 13-6-51 ఆంధ్రసచిత్ర వార పత్రికలో ప్రచురించబడింది. 'హితశ్రీ' వీరికి కథారచనలో గురువు. వీరి కథలు 'ఆనాటి రాత్రి', 'విభిన్న స్వరాలు', 'లోగుట్టు', 'తోడికోడలు', 'ఆఫీసరు గారి భార్య', 'అంతరాంతరాలు', 'వాగ్దానం' మొదలైనవి మంచి పేరును తీసుకు వచ్చాయి. వీరి కథలను లోతుగా పరిశీలిస్తే, కథల్లో హాస్యం వెనుక లోకరీతితో పాటు విషాద చిహ్నాలు కూడా కనిపిస్తాయి. ఓ పాత్రనో, సన్నివేశాన్నో తీసుకొని కథకు కొంత బిల్డప్ ఇస్తూ వ్యంగ్యాత్మకంగా చురకలు వేస్తారు. చమత్కారాలు పండిస్తారు. వీరి కథల్లో కొసమెరుపుకు కొదవలేదు. భారతీయుల సంస్కృతీ విలువలు 'శ్రీరాగి'కి ప్రాణం. వాటి పతనాన్ని, విధ్వంసాన్ని మెత్తగా గర్హిస్తారు. వీరు సృష్టించిన పాత్రలన్నీ మంచివే. పరిస్థితులే చెడ్డవి. పాత్ర స్వరూపాన్ని, స్వభావాన్ని, నేపథ్యాన్ని అప్పటి వాతావరణాన్ని వర్ణిస్తూ భూతకాలంలోకి దిగిపోయాయి. ఆ పాత్ర గత కథను చెప్పి మళ్ళీ వర్తమానంలోకి రావటం 'శ్రీ రాగి' కథల్లో ప్రత్యేకత. శ్రీ వేదగిరి రాంబాబు ప్రచురించిన కథా సంకలనం 'కొత్త కథ'లో వీరి కథ 'కేసు' పలువురి కథారచయితల మన్ననలందుకుంది.

వియోగి పేరుతో కథలు రాసే విజయ ప్రసాద్ లాంటి కథకులకు కథా రచనలో మెలుకువలు నేర్పి మనకు అందించిన గురువులు శ్రీరాగి. ఇటీవలి కాలంలో కథా రచనపై అంతగా ఆసక్తి చూపించటం లేదు. కానీ సీనియర్ కథకులైన శ్రీరాగి రేపటి తరం కొరకు తిరిగి కలాన్ని ముందుకు నడిపి కథలు అందిస్తారని ఆశిద్దాం.

రచయిత చిరునామా
శ్రీ రాగి
18-85, కమలానగర్,
బి. క్యాంప్, కర్నూలు.



# శ్రీ సుభా

అరవై మూడు సంవత్సరాల క్రితం జన్మించి ఒకప్పటి ప్రఖ్యాత రచయిత బుద్ధవరపు వెంకటరత్నం (శాండిల్య) గారి ప్రోత్సాహంతో తన **21**వ ఏట (**1958**) కలం పట్టి కథారచనకు శ్రీకారం చుట్టిన శ్రీ సుభా అసలుపేరు 'ఎస్. వి. ఎస్. సుబ్బారావు'.

సుమారు 160కి పైగా కథలు రాసిన 'శ్రీ సుభా' మొదటికథ 'కల్యాణి' ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రచురించబడింది. వీరు కథలేకాక, కొన్ని నవలలు, నాటకాలు, రేడియో, నాటకాలు రాశారు. దినపత్రికల్లో 'పాన్ సుపారీ' 'పిరాక్షరాలు' పేర్లతో కొన్ని కాలమ్స్ నిర్వహించారు.

"నాకు మంచి పుస్తకాలన్నా, లలిత సంగీతమన్నా ఇష్టం! అలాగే, మంచి ఎక్కడ వున్నా చేతులు చాచడం, సంబరపడిపోవటం అంటే మరీ ఇష్టం!" అనే శ్రీ సుభాగారు వృత్తిరీత్యా ఐ.డి.పి.ఎల్. హైదరాబాద్ యూనిట్‌లో స్టోర్స్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసి రిటైరయ్యారు.

రచయితలన్న వాళ్ళు సమాజానికి, పాఠకులకూ వెలుగుబాటలు చూపాలని శ్రీ సుభా గాఢంగా కాంక్షిస్తారు. వేడినెత్తురు ప్రభావంతో అరాచకానికి, అభ్యుదయానికీ మధ్య తేడా తెలియని యువతకు సరైన మార్గ దర్శనం చేసే దిక్సూచి లాంటి రచనలు రావాలని కోరుకుంటారు. రచయిత సమాజంలో మంచి కోసమే రచనలు చేయాలని, అశ్లీలం, చెడును తమ రచనల్లో పొందుపరిచి యువతను చెడువైపు మళ్ళించకూడదని వీరు ప్రార్థిస్తారు.

శ్రీ సుభా కథలు లోతుగా పరిశీలిస్తే, ఆయన కథావస్తువు సమాజం నుండే తీసుకుంటారు. మధ్యతరగతి కుటుంబాల్లో స్త్రీ వివాహం, పెళ్ళిచూపులు, కట్నాలు, ఆశానిరాశలు, త్యాగాలు, వైఫల్యాలు మొదటినుంచి చాలాకాలం వరకు ఆయన ఎన్నుకున్న కథావస్తువులు.

1980వ దశకం తర్వాత శ్రీ సుభా కథల్లో గుణాత్మకమైన మార్పు కనిపిస్తుంది. నగల కోసం, చనిపోయిన ఓ వ్యక్తికి భార్యలమంటూ వచ్చిన ముగ్గురు స్త్రీల కథ 'త్రిభుజం'. మరోకథ 'తీరని దాహం'లో రచయిత భార్య పత్రికకు ఓ కొత్తరచయిత కథను సెలెక్ట్ చేసి భర్త తీరని కీర్తి దాహానికి అడ్డుకట్ట వేస్తుంది. స్త్రీల సమస్యను కొత్త కోణంలో రాసిన 'బాధ' గొప్ప కథ. ఆడపులి కథలో 30ఏళ్ళ అవివాహిత వినత, మగపులుల నుంచి తనని తాను రక్షించుకోవటానికి తానే మెడలో మంగళసూత్రం కట్టుకున్న వైనం అద్భుతంగా చిత్రీకరించారు.

ఈ మధ్యకాలంలో శ్రీ సుభా ఆధ్యాత్మిక స్పర్శ ఉన్న కథలు కూడా రాస్తున్నారు. ఆయన కొన్ని నవలలు కూడా రాసారు. 1973లో ఆంధ్రజ్యోతి వారపత్రిక నిర్వహించిన నవలల పోటీలో స్త్రీ సమస్యమీద 'నవలోకం' రాయగా, అది బహుమతి గెలుచుకుంది. 'కొత్తవెన్నెల', 'చీకటి' (1980)లో రచించగా శ్రీ సుభాకి గొప్ప పేరు తెచ్చిపెట్టాయి.

చలం, బుచ్చిబాబు రచనలన్నా, సోమర్‌సెట్‌మామ్ కథలన్నా శ్రీ సుభాకు ప్రాణం. ముఖ్యంగా శ్రీ అరబిందో రచనలు, వారి ఇంటిగ్రెల్ యోగా అంటే ఈ మధ్య వారికి ప్రాణప్రదం అయ్యింది.


రచయిత చిరునామా

శ్రీ సుభా

డో.నెం.21-225, బాలాజీ నగర్,

కుకట్‌పల్లి, హైదరాబాద్ - 500 072.





# శ్రీ కంఠస్ఫూర్తి

నలభై అయిదేళ్ళ క్రితం తూ. గో. జిల్లా పిఠాపురం తాలూకా 'ఉప్పాడ' గ్రామంలో కండ్లు తెరచిన కంఠస్ఫూర్తి గురురాజుగారు 'శ్రీ కంఠస్ఫూర్తి' పేరుతో తెలుగు పాఠకులకు ఎన్నో కథానికలు అందించారు.

శ్రీ కంఠస్ఫూర్తి ప్రస్తుతం కాకినాడ టెలిఫోన్ ఎక్ఛేంజ్‌లో సీనియర్ టెలిఫోన్ సూపర్‌వైజర్‌గా ఉద్యోగం చేస్తున్నారు. కథకునిగా వారిది నిదానమైన సాహితీ జీవనం. తొలి కథ 'స్వయంకృతం' 1973లో 'ప్రగతి' వార పత్రికలో ప్రచురించబడింది.

1978లో 'చిగురించిన జీవితం' కథ మొదలు 'ఆంధ్రప్రభ'లో సుమారు ముప్పై కథలకు పైగా రాసిన కారణంగా 'ప్రభ రచయిత'గా వీరికి మిత్రులు ముద్ర వేశారు. ఇప్పటి వరకు వందకు పైగా కథలు వివిధ వార మాస, పత్రికల్లో అచ్చులో చూసుకున్నారు.

1983లో 'జాగృతి' వారపత్రికలో 'భవతీ భిక్షాందేహి' కథకు 1999లో 'సహకార సమాచారమ్' పత్రిక (కోపరేటివ్ యూనియన్ హైదరాబాద్) 'హంసధ్వని' కథకు మొదటి బహుమతి రాగా, ఇంకా ఇతర 10 కథలకు ద్వితీయ, తృతీయ బహుమతులు వచ్చాయి..

1996లో 'శ్రీ కంఠ స్ఫూర్తి కథలు' అనే కథా సంపుటి ఆ తరువాత 'అమృతవర్షం' అనే కథా సంపుటి ప్రచురించారు. 'అమృతవర్షం' కథా సంపుటికి విశాఖ జ్యేష్ఠ లిటరరీ అవార్డు వచ్చింది. వీరి కథాసంపుటి 'అమృత వర్షం' వీరికి గొప్ప పేరు తీసుకువచ్చింది. ఇందులో మొత్తం ఇరవై కథలున్నాయి. మనిషికి అన్నపానీయాలెంత అవసరమో అభిమానాలూ, అనుబంధాలూ, ఆత్మీయతలూ అంతే అవసరమన్న' నిజాన్ని 'అమృతవర్షం కథ' చెబుతుంది. ఈ పుస్తకంలో మరో విషయమేమిటంటే వీరు ప్రతి కథకూ చక్కటి బొమ్మను సమకూర్చారు.

శ్రీ కంఠస్ఫూర్తి కలం నుంచి జాలువారిన మరో అద్భుత కథ 'అక్షర సత్యం'. ఇందులో ఒక పిల్లవాడు రోడ్డు మీద వెళుతున్న అపరిచయస్తుడిని పట్టుకొని 'చదువుకుంటున్నాను సార్! నోటుపుస్తకాలు కొనుక్కోవాలి, మీకు తోచిన సాయం చేయండి' అంటాడు. డబ్బు రూపంలో యివ్వటం ఇష్టంలేని ఆ వ్యక్తి ఆ పిల్లవాడికి నోటుపుస్తకాల్ని కొనిస్తాడు. అయితే ఆ పిల్లవాడు ఆ పుస్తకాలు షాపులో రిటనిచ్చి ఆ డబ్బులతో మిర్చిబండి దగ్గర నిలుచోని బజ్జీలు తింటుంటాడు. ఆ విషయం తెల్సుకున్న పెద్దమనిషి ఆ పిల్లవాడిని మందలిస్తాడు.

"కథను ఎంతో కొంత కొత్తగా, ప్రగతిశీలకంగా చెప్పాలన్న కోరిక ఉన్న వాణ్ని నేను!" అనే కంఠస్ఫూర్తి 'విజయ' మాసపత్రికలో 'ఓనాటి కెరటం' నవల ప్రచురించారు. విశాఖ ఆకాశవాణి ద్వారా ప్రతి మూడునెలల కొకసారి వీరి కథానిక తప్పక వుంటుంది. వీరి కథలు లోతుగా చదివితే ఆయన ఎన్నుకునే కథా వస్తువు నుంచి టైటిల్, శిల్పం, కొసమెరుపు, మలుపు, శైలి, అన్నీ మనకు వినూత్నంగా కనిపిస్తాయి.

రచయిత చిరునామా
శ్రీ కంఠస్ఫూర్తి
సీనియర్ టెలిఫోన్ సూపరింటెండెంట్,
కాకినాడ - 533001.

# శ్రీగిరిరాజు విజయలక్ష్మి





గుంటూరు జిల్లా అద్దంకి తాలూకా 'పోతవరం'లో జన్మించిన ప్రముఖ కథకురాలు శ్రీమతి శ్రీగిరిరాజు విజయలక్ష్మిగారు వృత్తిరీత్యా నీటిపారుదల శాఖ (హైదరాబాద్)లో సూపరింటెండెంట్‌గా పనిచేస్తున్నారు.

విజయలక్ష్మి గారి కథలు అన్ని పత్రికల్లోనూ ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. పూరణతో పాటు వ్యాసాలు, కార్టూన్లు, ముగ్గులు ప్రచురించారు. 15-2-95నాడు హైదరాబాద్ సిటీ సెంట్రల్ లైబ్రరీలో వారి కథల సంపుటి 'సంగీత జ్ఞానము', 'వ్యాస సంపుటి', 'వ్యాసమాల' విడుదలైనాయి.

విజయలక్ష్మిగారి కథలన్నీ వాస్తవ జీవితానికి దర్పణాలు. సాహిత్యపరంగా ప్రారంభంలోనూ, మధ్యమధ్యలోనూ, ముగింపు వరకు కల్పన జోడించి కథను నడిపిస్తారు.

ఏ విద్య అయినా సరే నేర్పే గురువులకు సంకుచిత భావాలుండకూడదని సంగీతజ్ఞానము కథద్వారా చెబుతారు విజయలక్ష్మి. ఈ కథకు పతివాడ సుధాకర్ స్మారక బహుమతి లభించటం విశేషం. వీరి కథలు ఎక్కువగా గుంటూరు ఎక్స్‌ప్రెస్ అనే దినపత్రికలో ప్రచురించబడ్డాయి. ఆంధ్రజ్యోతి న్యూజెర్సి నిర్వహించిన కథలపోటీలలో నాలుగుసార్లు వీరి కథలకు బహుమతి లభించటం విశేషం.

శ్రీగిరిరాజు విజయలక్ష్మిగారు 'అగ్నిసాక్షిగా' పేరుతో ఒక సంకలనం కలగూరగంపగా ప్రచురించారు. నిజానికి ఇది వినూత్న ప్రయోగం. సాహిత్యకారులు ఏకొద్ది మందో ఇలాంటి సంకలనం ప్రచురించి ఉంటారు. ఇందులో, గతంలో వీరు రాయగా పత్రికల్లో ప్రచురించబడ్డ కథలు, సమీక్షలు, వ్యాసాలు, పద్యాలు, కవితలు లేఖలు, అనుభవాలు, గల్పికలు చోటుచేసుకున్నాయి. దాదాపు సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోనూ ప్రవేశమున్న విజయలక్ష్మి గారు మార్చి 2001లో 'అమె' పేరుతో ఒక నవల ప్రచురించి సాహితీ ప్రియులకు అందించారు. ఈ నవల విశ్వరచన (దినపత్రిక)లో 1999, 2000 సంవత్సరాలలో ధారావాహికగా ప్రచురించబడింది.

అమె తల్లి ఇటీవలే మరణించారు. అమె మరణించే ముందు రచయిత్రి ప్రశంసనీయమైన సేవ చేశారు. అటు ఆసుపత్రి పాలయినప్పుడు, ఉద్యోగం చూసుకుంటూ తల్లికి సేవచేయటం మామూలు విషయం కాదు. ఈ అనుభవాలు, అమ్మమీది ఆత్మీయతా విజయలక్ష్మి గారిచే అమె నవల వ్రాయించే ప్రయత్నం చేశాయి. నిజానికిది ఓ ప్రయోగాత్మక నవల.

ప్రచారానికి ఎక్కువగా ఆసక్తి చూపని విజయలక్ష్మిగారు, వారి పుస్తకాలన్నిటికి దాదాపు ముందు మాట వారే రాసుకోవటం గమనించదగ్గ విషయం. కొత్తదనం ఎక్కడున్నా మెచ్చుకునే స్వభావం వీరిది. ప్రముఖ కథకులు శ్రీ పోతుకూచి సాంబశివరావుగారంటే వీరికి ప్రత్యేకాభిమానం. శ్రీగిరిరాజు విజయలక్ష్మిగారు మరిన్ని కథా సంపుటాలు అందివ్వాల్సిన అవసరం ఎంతైనా ఉంది.


రచయిత్రి చిరునామా
శ్రీమతి శ్రీగిరిరాజు విజయలక్ష్మి
6-3-785/1, అమీర్‌పేట,
హైదరాబాద్ - 500 016.





# షేక్ కరీముల్లా

'గుర్రం జాషువా' గారి తరువాత 'వినుకొండ' వాసుల్లో జాతీయస్థాయి అవార్డు అందుకున్న రచయిత 'షేక్ కరీముల్లా' ఒక్కడేనంటే అతిశయోక్తి కాదు.

సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోనూ ప్రవేశమున్న షేక్ కరీముల్లా అన్ని ప్రక్రియల్లోనూ రచనలు చేసి 'భేష్' అనిపించుకున్నారు. కథలు, కవితలు, వ్యాసాలు, నవలలు, చారిత్రక రచనలు, ఆధ్యాత్మిక రచనలను చేయటమేకాకుండా, వాటిని పుస్తకాల రూపంలో ముద్రించి తెలుగు సాహితీ ప్రియులకు, ముందుతరానికి కానుకగా అందించిన గొప్పరచయిత.

వృత్తిరీత్యా ఉపాధ్యాయుడైన కరీముల్లా ప్రవృత్తిరీత్యా చక్కటి కథలు రాసారు. వీరు రాసిన 'బలిపీఠం', 'ఆత్మ' కథలు చదివితే కథకుడిగా ఆయనేంటో మనకు ఇట్టే అర్థమవుతుంది. ఈ రెండుకథలు కరీముల్లాను కథకుడిగా ఎంతో ఎత్తుకు చేర్చాయి.

"బలిపీఠం" కథలో భరత్ మంచి చిత్రకారుడు. అతని చిత్రాలను చూసి గొప్పింటి పిల్ల శ్వేత భరత్‌ను ప్రేమిస్తుంది. శ్వేత బావవెంకట్, భరత్ గురించి చెడుగా చెప్తూ శ్వేత మనసులో అనుమాన బీజాలు నాటుతాడు. దురదృష్టవశాత్తు జరిగే అనేక సంఘటల్ని పొరపాటున శ్వేత నిజాలని నమ్ముతుంది. ఫలితంగా శ్వేత, భరత్‌ల ఎడబాటు. భరత్ చిత్రాలను మానివేసి పిచ్చివాడిలా తిరుగుతూ అంతిమంగా ఆత్మహత్యకు పాల్పడుతాడు. శ్వేత కథచివరిలో తను చేసిన తప్పు తెలుసుకొని భరత్ సమాధి వద్ద విలపిస్తూ, జీవిత వైధవ్యాన్ని స్వీకరిస్తుంది.

'ఆత్మ' కథలో మధ్యతరగతికి చెందిన 'విజయ్' తల్లికి హార్ట్ సర్జరీ చెయ్యవలసి రావటంతో దానికయ్యే ఖర్చు నిమిత్తం ఏం చేయాలో తోచని పరిస్థితుల్లో న్యూఢిల్లీ లోని ఒక రిసెర్చ్ లేబరేటరీ మానవమేధపై సజీవంగా వున్న మనిషి మెదడులోని కణజాలంపై చెయ్యవలసిన పరిశోధనల్లో ఒకమనిషి అవసరమవుతాడు. వాళ్ళు రెండు లక్షలు ఆఫర్ చేస్తారు. మానవ కళ్యాణం కొరకు జరిపే ఈ పరిశోధనలో తాను ఆహుతైపోయినా పర్వాలేదనుకుంటాడు విజయ్. ఇలా కథ నడుస్తూ మలుపులు తిరిగి విజయ్ ఆ డబ్బు సంపాదించి తల్లి ప్రాణాలు కాపాడుకుంటాడు.

అద్భుతమైన కొసమెరుపులు, మలుపులు, కరీముల్లా కథల్లో మనం గమనించ వచ్చు. ఇతర ప్రక్రియల్లో 'వినుకొండ చరిత్ర', 'వేదాల్లో మహమ్మద్', 'ఆధ్యాత్మిక రచన', 'ది వారియర్' నవల, 'విద్యార్థి! నీ పయన మెటు' నాటిక, 'ప్రభాత కిరణాలు', ఆయుధాలు మొలుస్తున్నాయి, సుగంధాలు, ఇండియన్ ముస్లీం, అశ్రు సందేశం, నేను, అనే కవితా సంపుటాలు ఇలా మొత్తం 18 పుస్తకాలు ప్రచురించిన కరీముల్లా 'కథాసంపుటి'ని త్వరలోనే ప్రచురించి తెలుగు పాఠకులకు అందించబోతున్నారు.


రచయిత చిరునామా

**షేక్ కరీముల్లా**

గవర్నమెంట్ హాస్పిటల్ వెనుక,

వినుకొండ - 522647.

గుంటూరు జిల్లా.





# సడ్లపల్లె చిదంబర రెడ్డి

"కథలు జీవన మూలాలను తెలిపేవిగా గాని, కదిలించేవిగాగాని ఉండాలి. పాత్రల నాలుకలపై కదలాడే జీవ భాషనే ఆయా పాత్రలకు వాడాలి. ఇక రచయిత భాష అతని సొంతం" అంటారు రాయల సీమకు చెందిన ప్రముఖ కథకులు సడ్లపల్లె చిదంబర రెడ్డి.

అనంతపురం జిల్లా హిందూపురం దగ్గర 'సూగూరు సడ్లపల్లె' అనే గ్రామంలో సామాన్య రైతుకుటుంబంలో జన్మించిన చిదంబర రెడ్డి గారి కథలు, ఇప్పటివరకు సుమారు 50 కి పైగా ప్రచురించబడ్డాయి. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి వారపత్రికల్లోనూ, ఇండియాటుడే సాహిత్యనేత్రం, 'వార్త' ఆదివారం అనుబంధం వంటి ప్రముఖ పత్రికలలో వీరి కథలు చోటుచేసుకున్నాయి. ఆకాశవాణి కడప, అనంతపురం కేంద్రాలనుండి పలుమార్లు వీరి కథానికలు ప్రసారమయ్యాయి.

చిదంబర రెడ్డిగారి కథల్లో శిల్పం, శైలి, వస్తువు వినూత్నంగా కనిపిస్తుంది. 'ఇండియాటుడే' లో ప్రచురించబడిన "కొల్లబోయిన పల్లె" కథ పాఠకులను ఎంతో ఆకర్షించింది. నిజానికి ఈ కథ రెడ్డిగారికి కూడా ఎంతో నచ్చింది. వ్యవసాయం చేయడాన్ని అందరూ నామోషీగా భావించడం. వస్తుమార్పిడి స్థానంలో ద్రవ్యమార్పిడి రావడం, దోపిడీకి మార్గాలేర్పడటం, పారిశ్రామికీకరణ, నగరీకరణ మోజులో పల్లెలు గుల్ల కావటం కథావస్తువుగా తీసుకొని తనదైన శైలిలో కథను నడిపేవారు. ఈ కథలో శిల్పం ప్రముఖ కథకులను ఎంతో ఆకర్షించింది.

ఆంధ్రజ్యోతి వారు అమెరికా తెలుగు పత్రిక కోసం నిర్వహించిన కథల పోటీకి రాసిన 'ఆదర్శం' అనే కథలోకి తొంగిచూస్తే... ఒక ఉద్యోగంలో చేరాలని అనుకుంటుంది. తన దగ్గర డబ్బులేదు తన క్లాస్‌మేట్ పట్నంలో వుంటే ఆమె దగ్గర అప్పుచేసి మరలా తీరుస్తామని ఆమె ఇంటికివస్తుంది. అప్పుడు ఆమె అంగట్లోకూర్చొని సరుకులు అమ్ముతూ వుంటుంది. అక్కడ సరుకులుకొనటానికి వచ్చిన వారందరూ తన గ్రామం, ఆ చుట్టుపక్కల వారే అప్పుడు అనుకోకుండా ఒక ఆలోచన చేస్తుంది. తనకు తెలిసిన మరో నిరుద్యోగ పురుష మిత్రునితో కలిసి ఒక లారీ కొని చుట్టుపక్కల పల్లెలకంతా సరుకులు సరఫరా చేయటం. చేతినిండా డబ్బు సంపాదంచటం... మంచి కథ ఇది. 1976 డిసెంబరు "చందమామ" లో ప్రచురించబడిన 'భూతదయ' అనే చిన్న కథ వీరి తొలి కథ. 1998 లో 'ఇసక' అనే కథల సంపుటి వెలువరించారు. ఇసక, పశువులు, గొర్రెలు అనే కథలకు బహుమతులు లభించాయి.

రాయలసీమ మాండలికంపై పట్టువున్న వీరు ఆ మాండలికంలో ఎన్నో కథలురాసారు. రాయలసీమలోని రైతుల సమస్యలను ఆ ప్రాంత మాండలిక భాషలోనే అక్షరీకరించాలని, పలు కాలాలపాటు నిలిచిపోయే కథలు రాయాలని వీరి ఆకాంక్ష. త్వరలో మరో కథా సంపుటి తీయాలని ప్రయత్నిస్తున్న వీరికి స్థానిక ఆకాశవాణి కేంద్రాల ప్రోత్సాహం ఎంతో వుంది. ఆకాశవాణి కడప కేంద్రం వారు వీరిని రాయలసీమ మాండలిక భాషలో కథ రాయమని ప్రత్యేకంగా కోరటం విశేషం.


రచయిత చిరునామా
సడ్లపల్లె చిదంబర రెడ్డి
'వెలుగు-చిగురు', టీచర్స్ కాలనీ,
హిందూపురం - 515211.
అనంతపురం జిల్లా.



# సత్యవాడ సోదరీమణులు

అంధ సోదరీమణులు అయిన జంట రచయిత్రులు రఘునాదమ్మ, సూర్యకుమారి. వీరిని సాహితీ లోకం ముద్దుగా 'సత్యవాడ సోదరీమణులు' అని పిలుచుకుంటుంది. ఆ పేరుతోనే వీరు చాలా కథలు రాసారు. 'శభాష్'! అనిపించుకున్నారు.

"తన్నుకుంటే రాదోయ్... తన్నుకు వచ్చేదే కవిత్వం!" అని ఒక సభలో గుంటూరు శేషేంద్ర శర్మగారు అనగా విన్నాను. నిజంగా ఆ మాటలు సత్యవాడ సోదరీమణులకు అబ్బుతాయి. కథ కాని, కవిత్వం గాని మనస్సులోంచి తన్నుకురావాలి. 'నేనుసైతం'... అంటూ వీరిద్దరూ అంధులైనప్పటికీ కథారచనలకు శ్రీకారం చుట్టారు. వీరి తొలికథ 1976 జులై 16న విజయవాడ కేంద్రం స్త్రీల కార్యక్రమంలో ప్రసారమయ్యింది. ఆ తరువాత ఇప్పటి వరకు 100కి పైగా కథలు దిన, వార, మాస పత్రికలలోనూ, వివిధ ఆకాశవాణి కేంద్రాల ద్వారాను వెలుగు చూసాయి. వాటిలో కొన్నింటిని 4 కథా సంకలనాలుగా వెలువరించటం విశేషం. 1982లో 'ముత్యాలు నీళ్ళోసుకుంది', 1983లో 'మాయనిపున్నమి', 1992లో 'హరిప్రియం', 1998లో 'మెుక్కుబడి' కథాసంపుటాలు ప్రచురించి కథా ప్రియులను అబ్బుర పరిచారు. ఆనందించారు.

అంధులైన ఈ కథా రచయిత్రులు కథలు సొంతంగా రాయలేరు కాబట్టి వీరు కథ చెబుతుంటే ఇతరులు సహకరించేవారు. నిజానికి కథ చెప్పాలన్న వీరి పట్టుదల నేటి యువరచయిత్రిలందరికీ మార్గదర్శకం కావాలి. వీరి కథలు లోతుగా చదివితే కళ్ళమ్మట నీళ్ల తిరుగుతాయి, మనస్సు కలుక్కుమంటుంది, ఆత్మీయతకీ, మమేకానికి మనస్సు పులకరిస్తుంది. అతి సాధారణమైన విషయాన్ని కథా వస్తువులుగా తీసుకొని ఓ సరికొత్త కోణంలో చెప్పటానికి ప్రయత్నిస్తారు.

'ఆస్ట్రేలియా తెలుగు పలుకు' అనే మేగజైనులో 'గోరంత గోరంతే', 'అనుబంధం' అనే కథలు వీరివి ప్రచురించబడ్డాయి. రేడియో నాటకాలు, సంగీత రూపకాలు రచించారు. 'చిగురు తొడగని వసంతం', 'అగ్గిపుల్ల', 'ప్రేమించు', 'ప్రేమకై', 'గుర్తింపు', 'పొగరు పచ్చ', 'వేపపూలు' అనే నాటికలు వీరు రచించారు. ఈ నాటికలు అధిక సంఖ్యలో శ్రోతలను అలరించాయి. పాటలు, కవితలు కూడా రాసారు. సాహిత్యంలో ఉన్న అన్ని ప్రక్రియలలో ప్రవేశించిన వీరు తమ 'సత్తా' ఏమిటో నిరూపించుకున్నారు.

సత్యవాడ సోదరీమణుల గురించి ప్రముఖ కథకులు భరాగో గారు "ఈ సోదరీమణులు కర్మ చక్షువుల ద్వారా కాకుండా జ్ఞాన చక్షువులద్వారా తమకి అందుబాటులో ఉండి తమ ఆలోచనా పరిధిలోకి వొచ్చే పాత్రల్ని వస్తువుల్నీ మాత్రం ఎంచుకొని, 'గొప్ప పాండిత్యం' ఇచ్చే శిల్ప, శైలీ అవరోధాల్ని అధిగమించి కథలు చెప్పగలరు" అంటారు.

1992 లో 'రసమయి' అనే గేయ సంపుటిని వీరు ప్రచురించారు. 'సత్యసాహితీ' అనే సాహిత్య సంస్థను నెలకొల్పి సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వీరు రాసిన కథలకు బహుమతులు కోకొల్లలు. 'మబ్బు తెరలు', 'ఆశయం', 'పొద్దుపొడుపు' కథలు పాఠకుల, కథకుల మన్ననలందుకున్నాయి. బహుమతులు గెలుచుకున్నాయి.


రచయిత్రిల చిరునామా
**సత్యవాడ సోదరీమణులు**
3-6-123/124, ఫ్లాట్ నెంబర్ 206,
వెంకటవిహార్ అపార్ట్‌మెంట్స్,
హిమాయత్ నగర్, హైదరాబాద్ - 029





# సాహితి

"కథల నిడివి 6-8 పేజీలు వుండాలని నిర్దేశిస్తున్నారు. మంచి కథకులుగా నిలవాలంటే యీ లెంత్ చాలదు. నిడివి నిర్ణయించుకునే స్వేచ్ఛ రచయితకి వుండాలి" అని అభిప్రాయపడతారు వరంగల్ జిల్లా హన్మకొండకు చెందిన రచయిత్రి ఎస్. శ్రీదేవి.

ఎస్. శ్రీదేవి గారు 'సాహితి' కలం పేరుతో పాఠకులందరికీ పరిచయమే. సుమారు 100కి పైగా కథలు ప్రచురించబడిన వీరి మొదటి కథ 1978 లో వనితాజ్యోతి లో "అనగనగా..." టైటిల్‌తో ప్రచురించబడిన వీరి కథలు చదివించే గుణం కలిగివుండటమే కాకుండా చక్కటి ముగింపుతో కూడి వుంటాయి.

ఇండియాటుడేలో ప్రచురించబడిన బందీ, పాతకాలం మనిషి, విముక్తి కథలు విపులలో ప్రచురించబడిన 'ఆ వుత్తరం', బేబీ ఆఫ్ అర్చన, గుండెలోతు, గూడు, వాకిళ్ళు దాటలేము, యుద్ధం ముగిశాక, వంటింటికిటికీ వీరికి కథా రచయిత్రిగా కీర్తిని తీసుకొచ్చాయి. 'గుండెలోతు' కథ వాసిరెడ్డి నవీన్ గారి 'కథ 2000' లో కూడా ప్రచురించబడటం విశేషం.

'సాహితి' గారి కథల్ని పరిశీలిస్తే ఇండియాటుడేలో ప్రచురించబడిన 'విముక్తి'... అరవై సంవత్సరాలు నిండగానే ఆఫీసులో వుద్యోగాలకి విరమణ వుంటుంది. పెద్ద బాధ్యత నుంచి రిటైరవుతున్న భావనతో మగవాడు టీవీ ముందో, న్యూస్ పేపర్ వెనుకో సెటిలైపోతారు. మరి స్త్రీకి గృహ బాధ్యతల నుంచి అలాంటి విముక్తి లేదా? భార్యగా, తల్లిగా, అమ్మమ్మ నానమ్మగా చివరి వూపిరి వదిలేదాకా బాధ్యతల్ని మోస్తుండటమేనా అనే ప్రశ్నకి జవాబు చెప్పే కథ ఇది. మరో కథ 'వాడి' లో అన్నేళ్ళ పనివాడిని అమ్మగారికి దత్తతిస్తుంది జానకి. వాడిని తన ఆస్తికి, ఆస్తిని వాడికే కావలా పెడుతుంది అన్న భార్య మనంద కేవలం డబ్బే నేపథ్యంగా జరిగిన ఈ మార్పిడితో చిన్న పిల్లల ప్రపంచంలోంచి పెద్దవాళ్ళ ప్రపంచంలోకి బలవంతంగా నెట్టి వేయబడతారు వాళ్ళు. వారు పెరిగి పెద్దయి కన్నవారికి గానీ, పెంచిన వారికి గానీ ఏ విధమైన న్యాయం చేస్తారనేది ముగింపు. ఈ కథ ఆంధ్రభూమిలో ప్రచురించబడింది.

సాహితిగారు త్వరలోనే 24 కథలతో కూడిన 'గూడు' అనే కథాసంపుటి ప్రచురిస్తున్నారు. దాదాపు ప్రచురణకు సిద్ధంగా వున్న ఈ సంపుటి త్వరలో సాహితీప్రియుల చేతుల్లోకి రాబోతున్నది. కథా రచనతో పాటు 'నవల' ప్రక్రియలో కూడా ప్రవేశమున్న 'సాహితి' గారు ఆ ప్రక్రియలో కూడా కృషి చేయాలని నిర్ణయించుకున్నారు. ఆకాశవాణి వరంగల్ కేంద్రం నుండి వీరి కథానికలు అనేకం ప్రసారమయ్యాయి.

వృత్తిరీత్యా హన్మకొండ హెడ్ పోస్టాఫీసులో 'ఎకౌంటెంట్' గా వున్నా, మరోవైపు కుటుంబ బాధ్యతలు నిర్వహిస్తూ బిజీగా వున్నా, తన వంతు సహకారం సాహితీ లోకానికి అందివ్వటానికి ముందుకు కలం పట్టి నిలబడిన వీరు నిజంగా అభినందనీయులు.


రచయిత్రి చిరునామా

ఎస్. శ్రీదేవి (సాహితి)

ఎకౌంటెంట్, హెడ్ పోస్టాఫీస్,

హన్మకొండ - 506001.

# సుధామ



కథకుడిగా, కవిగా, కాలమినిష్టుగా, కార్టూనిష్టుగా, సమీక్షకునిగా, వక్తగా, రేడియో 'వాడి' గా తెలుగు పాఠకులకు, శ్రోతలకు పరిచితులైన 'సుధామ' అసలు పేరు 'అల్లంరాజు వెంకటరావు'.

దీ.25-11-1951లో జన్మించిన సుధామ యిప్పటివరకు 30 కథలు పాఠకులకు అందిచారు. యువభారతి వారి 'ఉదయం' కథాసంకలనంలో వీరి మొదటి కథ ప్రచురించబడింది. 'సైనిక్ సమాచార్', 'చుక్కాని', 'జయశ్రీ', 'ఆంధ్రజ్యోతి', 'ఆంధ్రప్రభ', 'తరుణ' పత్రికల్లో తరచూ వీరి కథలు ప్రచురించబడుతుంటాయి. 'చుక్కాని'లో ఆరు వారాలపాటు ప్రచురించబడిన 'ప్రేమజీవనంలో కలల అలజడి' అనే పెద్ద కథ తెలుగు కథా ప్రియులను ఎంతో ఆకర్షించింది.

కథా నిర్మాణంలో ఇతివృత్తమే కాకుండా కథా శిల్పంలో వొక లయ వుండాలంటారు. కథని ఆద్యంతం ఉత్సుకతతో చదివించే గుణం వుండాలి. వ్యంగ్యం, హాస్యం, శిల్పం, సందేశం అనే నాలుగింటిలోనూ ఏ రెండయినా కథకి చేర్చితే అది అద్భుతమైన కథగా మలచవచ్చని అభిప్రాయపడతారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రాచ్యవిద్య చదివి తెలుగులో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసిన సుధామ అభ్యుదయ కవిత్వంలో భావచిత్రాలు (ఇమేజరీ) గురించి యం.ఫిల్ పరిశోధన చేసారు.

'సుధామ' కొంత కాలం ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థి రచయితల సంఘం ఉపకార్యదర్శిగా, యువభారతి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. కరీంనగర్ బిషప్ సాలమెన్ జూనియర్ కళాశాలలో 1975లో రెండేళ్ళు తెలుగు లెక్చరర్‌గా పనిచేసారు. 1983లో ఆకాశవాణి జాతీయ కవి సమ్మేళనంలో తెలుగు కవిగా ప్రాతినిధ్యం వహించిన వీరు 1978 లోనే ఆకాశవాణిలో చేరి పదోన్నతిపై 1991నుండి కార్య నిర్వహణాధికారిగా పనిచేస్తున్నారు.

నిజ జీవితంలోనే కాక, సాహిత్య జీవనంలో భర్తకు తోడునీడగా ఉండే కవయిత్రి, కథకురాలూ, నర్తకి, ఆకాశవాణిలో కార్య నిర్వహణాధికారిణిగా పనిచేస్తున్న 'ఉషారాణి' వేదంగారు సహధర్మచారిణిగా లభించటం సుధామగారు అదృష్టంగా భావిస్తారు. ఇతివృత్తంతో పాటు, కథకు శిల్పంకూడా ప్రధానమని భావించే సుధామ, కరుణ రసంతో పాటు హాస్యరసాన్ని కూడా పండించగల్గ సవ్యసాచి.

స్పందించే హృదయం, పరిశీలనాశక్తి, భాషమీద అధికారం, పట్టు, కథ రాయాలన్న ఆసక్తి వున్న సుధామ కథలకు బహుమతులు కూడా ఎన్నో వచ్చాయి. 1978 ఆంధ్రజ్యోతి వార పత్రిక ఉగాది కథలపోటీల్లో 'గడ్డిమొలవని భూమి' కథకు బహుమతి లభించింది. ఈ కథ ఆ రోజుల్లో పాఠకులని విశేషంగా ఆకట్టుకుంది. ప్రశంసలందుకుంది. వృత్తిరీత్యా ఎంతో బిజీగా వుండే సుధామ ప్రతిరోజూ కొంత సమయాన్ని సాహిత్యసేవ కొరకు కెటాయిస్తారు. త్వరలో కథాసంపుటి సుధామ అందించాలని కోరుకుందాం.

రచయిత చిరునామా
సుధామ
జి.12, సాదత్ టవర్స్, పద్మావతి
అపార్ట్‌మెంట్స్, సలీంనగర్ కాలనీ,
మలకపేట, హైదరాబాద్ - 36.

# సూర్యప్రసాదరావు





"కథ ఆద్యంతం ఉత్సుకతతో చదివించే గుణం వుండాలి. వ్యంగ్యం, హాస్యం, శిల్పం, సందేశం అనే నాలుగింటిలోనూ ఏ రెండయినా కథకి పుష్టినిస్తే పాఠకుడు చదువుతాడు" అని అభిప్రాయపడే ప్రసాదరావుగారు పదహారు కథలతో మరొక కథా సంపుటి తీసుకు రావాలన్న ఆలోచనలో ఉన్నారు.

ఖమ్మం జిల్లా నుంచి కవులు చాలా మంది ఉన్నా కథా రచయితలు చాలా తక్కువమంది అని చెప్పాలి. రావులపాటి సీతారామారావు, మహర్షిల తర్వాత, ఇంకా కథానికలు రాస్తూ యువ రచయితలను ప్రోత్సహిస్తున్న వారు సూర్యప్రసాదరావు గారు.

ఏభై రెండేళ్ళ క్రితం 'తెనాలి'లో జన్మించిన వీరు ఖమ్మంలో స్థిరనివాసం ఏర్పరచుకొని జిల్లాలో కథకులు లేనిలోటు తీరుస్తున్నారు. వృత్తిరీత్యా ఖమ్మంలోని శీలం సిద్ధారెడ్డి అండ్ జ్యోతి కళాశాలలో జంతు శాస్త్ర శాఖాధ్యక్షునిగా అధ్యాపక వృత్తిలో ఉన్నా, ప్రవృత్తి రీత్యా సుమారు ముప్పై కథలు అందిచారు. రాసింది కొన్ని కథలే ఐనా అవి ఎంతో ఉన్నత స్థాయిలో ఉంటాయి. ప్రతి కథా ఒక ఆణిముత్యం. శైలిలో, శిల్పంలో, కొసమెరుపులో చివరికి టైటిల్‌లో కూడా ఓ వినూత్న కోణంతో కలాన్ని నడిపే ప్రసాదరావుగారు 1975లో 'ఈనాడు'లో 'తొలి కవిత' ముద్రణలో చూసుకొని మురిసి పోయారు. 1993లో పదహారు కథలతో 'దివ్య మంగళ విగ్రహం' కథా సంపుటి ఆవిష్కరించారు.

ఆకాశవాణి కొత్తగూడెం నుంచి విరివిగా కథానికలు, కవితలు, రేడియో నాటికలు, ప్రసంగాలు వీరివి అనేకం ప్రసారమయ్యాయి. ఇటీవల ఆకాశవాణి కొత్తగూడెం స్టేషన్ డైరెక్టర్ శ్రీ కె.వి. హనుమంతరావుగారు, ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ శ్రీ చావలి దేవదాస్ గార్లు సూర్యప్రసాదరావును ఖమ్మం నుంచి ఆకాశవాణికి ఆహ్వానించి మరిన్ని నాటికలు రాబట్టుకోవటానికి ముఖాముఖి ఏర్పాటు చేసారు. "ఖమ్మం జిల్లాలో కథారచయితల కొరత ఉందని, ఆ కొరత తీర్చటానికి నేను నా వంతు కృషిగా యువ రచయితలకు సాహిత్యంలో ముఖ్యంగా కథారచనపై తరగతులు నిర్వహించాలన్న ఆలోచన ఉందని" పలుసందర్భాల్లో ఖమ్మానికి చెందిన ఓ కథారచయితగా ఆయన నాతో అన్నారు.

ఎవరి సాహిత్యాన్ని, కథలను వారే భద్రపరుచుకోవాలని, రికార్డు చేసుకోవాలని, ఏ సంస్థనో, మరెవరో వచ్చి భద్రపరుస్తారన్నది మంచి ఆలోచన కాదని వీరి విశ్వాసం. నిజానికి ఇది అక్షర సత్యం. ఎవరి సాహిత్యం వారే భద్రపరచుకోవడం రచయితగా వారి బాధ్యత కూడా! ఆహ్లాదం ఆనందం కలిగించే పాత సినిమా పాటలన్నా, సాహిత్యమన్నా.. ఆలోచన రేకెత్తించే మానవత ప్రతిబింబించే సాహిత్య ప్రక్రియ ఏదైనా... మనసు పారేసుకొనే రసజ్ఞుడు సూర్యప్రసాదరావు. త్వరలో సద్దుచేయని శబ్దాలు పేరిట ఓ కవితా సంపుటిని తీసుకు రాబోతున్నారు.

రచయిత చిరునామా
యం. సూర్య ప్రసాదరావు
డో.నెం. 5-6-18/బి, పాకబండ బజార్,
ఖమ్మం - 507001.

# పరిచయం



ఖమ్మం పట్టణంలో పుట్టిపెరిగిన **పైడిమర్రి రామకృష్ణ** ఎం.బి.ఎ. వరకు చదివారు. ఇప్పటివరకు 150 కథలు, కొన్నిరేడియో నాటికలు, పత్రికల్లో రివ్యూలు, మరికొన్ని కవితలు అందించారు.

ఖమ్మం పట్టణంలో 'స్నిగ్ధ'యువ కళాసమితి స్థాపించి దాని ద్వార ఆకాశవాణిలో కథంబ కార్యక్రమాలు, కథల పోటీలు నిర్వహించారు. సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లో ప్రవేశమున్నప్పటికీ, కథానిక పైనే ఎక్కువ ఆసక్తి చూపిస్తూ, కథకులతో పరిచయాలు పెంచుకున్నారు. కథకులంటే మిక్కిలి గౌరవమున్న రామకృష్ణ కథకుల పరిచయాలతో కూడిన **'కథాకిరణాలు'** శీర్షికను **'విజేత'** ఆదివారం అనుబంధంలో ఒక సంవత్సరం పాటు విజయవంతంగా నిర్వహించారు.

1999వ సం॥లో రాష్ట్ర సాంస్కృతిక మండలి, యువజన సర్వీసుల శాఖ సంయుక్తంగా నిర్వహించిన కథానిక శిబిరంలోనూ, ఆ తరువాత విమర్శ శిబిరంలోనూ ఖమ్మం జిల్లా నుంచి ఎన్నికై హైదరాబాద్ బోట్స్ క్లబ్ నందు శిబిరంలో కథకుల, విమర్శకులతోటి అభిప్రాయాలు పంచుకున్నారు. అదే సంవత్సరం సాహిత్యంలో యూత్ అవార్డు అందుకున్నారు.

పైడిమర్రి నరసింహామూర్తి, హేమలతల రెండవ కుమారుడైన పైడిమర్రి రామకృష్ణ ప్రస్తుతం **'కథాకిరణాలు మన తెలుగు కథకులు'** పుస్తకంలో 122 మంది కథకుల పరిచయాలు ప్రచురించారు. అయితే వేల సంఖ్యలో వున్న కథకులందర్ని తప్పక పుస్తకరూపంలో ప్రతి సంవత్సరం **'పైడిమర్రి కమ్యూనికేషన్స్'** ద్వారా అందించాలన్న లక్ష్యంతో వున్నారు. వీరి లక్ష్య సాధనకు కథకు లందరూ సహకరిస్తారని ఆశిస్తున్నాను. ఈ విషయంలో కథకులందరు రామకృష్ణను తప్పక అభినందించాల్సి ఉంటుంది.

**సిర్‌పూర్ కాగజ్ నగర్**
**ది. 8-12-2002**

**- వాధూలస**